# శ్రీశ్రీ రేడియో నాటికలు
# ప్రయోగ బాధ్య గోరణులు

శివలక్ష్మి

స్వరూప్ ప్రచురణలు
హైదరాబాదు

Sri Sri Radio Plays : Experimentalist Tendencies
**P.Sivalakshmi**



First Published May, 1993

Copies : 1000
cover : Mohan
Letter Design Mohan

Price : Rs. 25/–
Library adition:Rs. 60/-

ప్రతులకు:

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
4-1-435, విజ్ఞానభవన్, బ్యాంక్ స్ట్రీట్,
హైదరాబాద్ - 500 001

విశాలాంధ్ర బుక్ హౌస్,
విజయవాడ, హైదరాబాదు, అనంతపురం, విశాఖపట్నం,
హన్మకొండ, గుంటూరు, తిరుపతి, కాకినాడ.

Printed at . PLANOGRAPHERS
5-8-300,
Chirag Ali Lane,
HYDERABAD - 1. Phone . 203390

తెలుగు విశ్వవిద్యాలయం ఆర్థిక సహాయంతో ముద్రితం

Dedicated to my dear teacher
Prof. B.N. Joshi



# ABOUT MY BELOVED TEACHER

After a finite period of dormancy in my student career, I had the opportunity of visiting the 'Great' teacher, Prof B.N.Joshi I finished my M.A. (External, Osmania) at his institute and took the degree in 1984. Ever since I pursued my learning which culminated in presenting this little book. Prof.Joshi is the driving force behind my accomplishment.

Prof Joshi says that Shakespeare is a 'Miracle'. But in my view, Prof. Joshi is also a Miracle. He has established a parallel institute of English Literature and continued his penance of teaching till his demise at the age of 79 yrs. He is an uncommon teacher with a 'treasure' of encouragement and inspiration to the students. His house can be aptly said as 'Gurukulam" where 15000 students have been nurtured to grow to their literary heights.

Prof. B.N.Joshi values the greatest relationship between a student and the teacher. "Hellow, what can I do for you?" was his humble way of addressing the strangers, and after establishing his relation as a teacher gradually slided to the more affectionate words like "Beti, darling and my dear!" . He was a voracious reader and his skill in imparting up-to-date knowledge to the students was immense. He knew the art of scientific teaching and taught all M.A. Previous &Final papers, single handedly. We were engrossed by a world of beauty each time in his class aloof from the mechanical world. One cannot express it but can only be experienced. I cannot weigh his capacity of teaching Literature is an art and he is a professional artist.

I have tasted the sweetness of literature and also digested the underlying beauty of it. His teaching induced, in me a liking for Wordsworth's nature, Keats' beauty, Hamlet's psycology and Eliot's Universality. I developed a great passion towards Greek literature.

No words can precisely convey the deep respect I have for him. He dedicated his entire retired life for the cause of teaching. According to him students are his kith and kin. Though, he is no more, he is always present in the minds of his students and.... he remains in my imaginative future.

**– Siva Lakshimi**

# విషయ సూచిక

# పరిచయ వాక్యాలు

శ్రీ శ్రీ రేడియో నాటికలలోని ప్రయోగవాద ధోరణులపైని ఎమ్ ఫిల్ పట్టాకోసం శ్రీమతి పి శివలక్ష్మి తాను తయారు చేసిన సిద్ధాంత వ్యాసానికి పరిచయ వాక్యాలు వ్రాసి యిమ్మని నన్ను కోరారు వెంటనే నే ఒప్పుకోడానికి రెండు మూడు కారణాలున్నాయి

నాలుగేళ్ళక్రితం (1988లో) నేను ఆంధ్రప్రభకి వారంవారం వ్రాస్తూ ప్రకటిస్తూండిన 'రజని భావతరంగాలు' వ్యాస పరంపరలో శ్రీ శ్రీ రేడియో నాటికలు అని ఒక వ్యాసం వ్రాయడం ఒక కారణం ఆ రేడియో నాటికలలో ఏడెనిమిదింటికి పైగా-నేను మద్రాసు రేడియోలో నాటక కార్యక్రమ నిర్వాహకుడుగా నేనే శీర్షిక నిర్ణయించి, ఇతివృత్తం శ్రీ శ్రీ అప్పటికే రచించి ఉండి, నా దగ్గర వ్రాత ప్రతులలో సేకరించిన ఖండకావ్యాలో, గేయ కవితలో ఆధారంగా సూచిస్తూ నాటికకీ ఇతివృత్తానికీ తనకి తోచిన రూపురేఖలను తీర్చుకొనే బాధ్యత రచయితకు వదిలివేసే రేడియో నిర్వాహకుల 'కమీషన్డు స్క్రిప్ట్సు' వ్రాయించే సాంప్రదాయానికి నేను ఆరంభకుడనై ఉండడం రెండవ కారణం అంతకుముందు ఆంధ్ర విశ్వవిద్యాలయంలో 1937-40ల మధ్య - బి ఏ ఆనర్సు చదువుతుండినపుడు మా అధ్యాపకవర్గంలో ఒకరయిన అబ్బూరి రామకృష్ణారావు గారు తాము ఉపన్యసించే 'కాంపోజిషన్ క్లాస్'లో - ప్రాచీన మధ్య యుగాధునాతన వివిధ భాషా కవితా రచనా రీతులను గురించీ, భారతీయ భారతీయేతర వివిధ సాహిత్యోద్యమాలను, ఉద్యమ నాయకులను గురించీ పరిచయం చేస్తూ తెలుగు నవ్య సాహిత్యాకాశంలోకి తన ప్రోత్సాహంతో చొచ్చుకుని పైకి వస్తున్న ధూమకేతువుగా శ్రీ శ్రీని పరిచయం చెయ్యడం మూడవ కారణం; శ్రీ శ్రీ, నారాయణబాబు, పఠాభి, చలం, జరుక్ శాస్త్రీలతో పాటు 'పూషా' అనే పేరుతో కవితలు వ్రాస్తూ నేను సమకాలికంగా కొన్ని తిరుగుబాటు ధోరణులపై అభిమానం కలిగి ఉండడం నాలుగో కారణం అంతవరకూ స్వవిషయం

సిద్ధాంత వ్యాసకర్త్రి శ్రీ శ్రీ రేడియో నాటికలలోని విశిష్ట వ్యక్తిత్వాల 'కండ'లను ఖండఖండాలుగా లాబొరేటరీ టేబిలుపై పలెకోసి, పరచిపెట్టి వివిధ దృక్కోణాల నుంచి పరిశీలించి, గీటురాయి పరీక్షలకి లోనుజేసి, తన పరిశోధన సారాంశాలను నిశితమైన పట్టుకారులతో పైకి తీశారు

శ్రీ శ్రీ భావనాధోరణిలోను, రచనా ధోరణిలోను స్పష్టమయే విశిష్టవ్యక్తిత్వాన్ని రచయిత్రి - రెండు ప్రత్యేక వ్యాసాల్లో ఇలా నిర్ధారించారు:-

"వ్యాసానికీ- కవిత్వానికీ, కథకూ-కవిత్వానికీ, నాటికకూ- కవిత్వానికీ మధ్య ఉన్న రేఖలను చెరిపివేసి, అన్ని ప్రక్రియల్నీ చివరికి రేడియో నాటికలతో సహా రూపం మార్చుకున్న కవితలేమో అనిపించేటట్లు నిర్వహించడంలో శ్రీ శ్రీ వైశిష్ట్యం ప్రధానంగా

ఇమిడి ఉంది".

—— సరదా కొసని కొరడా - (రచయిత్రి).

"శ్రీ శ్రీ తన రేడియో నాటికలను ప్రధానంగా నాలుగు సమస్యల మీద రచించారు. మానవత్వం, సమత, కాలం, మృత్యువు. ప్రత్యక్షంగానో పరోక్షంగానో ఈ సమస్యలను ఈ నాటికలలో స్పృశించారు. స్వల్ప పరిమాణం గల ఇతివృత్తంలో అత్యంత గంభీరార్థాలను శ్రోతల హృదయాలలో స్ఫురింప జేయాలనే ఉద్దేశ్యంతో ప్రయోగాలు చేశారు. వైజ్ఞానిక నేపథ్యంతో హేతుబద్ధ దృక్పథంతో పరిశీలించినపుడు అగాధమైన ఈ ఇతివృత్తాల అర్థాలు శ్రోతలకు అర్థమౌతాయి".

—— మనో నాటికల్లో శ్రీ శ్రీ నాటికలు (రచయిత్రి).

మొదటి అధ్యాయం 'ప్రయోగ వాద పరిచయము- రేడియో నాటిక'. ఈ అధ్యాయంలో సంప్రదాయము - ప్రయోగము ఒకదాని కొకటి విరుద్ధమైనవా అని చర్చించి, 'ప్రతి సంప్రదాయము ఒక నాటి ప్రయోగమే; ప్రతి ప్రయోగమూ ఒక నాటికి సంప్రదాయము కాక తప్పద'ని పండితాభిప్రాయం తేలుస్తూ ప్రజలకోసం వారి ప్రయోజనాలను దృష్టిలో ఉంచుకుని ప్రయోగాలు చేసే ఏ కవైనా ప్రతిభాశాలి అనిపించుకుంటాడని శ్రీ శ్రీ ప్రతిభాశాలిత్వానికి రచయిత్రి తాంబూలమిచ్చారు.

శ్రీ శ్రీ రచనా ధోరణిపై యూరోపియన్ సాహిత్యాలలోని ఇజాల ప్రభావం ఉంది కనుక, ఆ 'ఇజా'లను పరిచయం చెయ్యడం జరిగింది. పాశ్చాత్య, భారతీయ రేడియో నాటికల పరిణామాలను, ప్రపంచ రేడియో నాటక పరిస్థితినీ దిగ్దర్శనంగా సూచించారు.

శ్రీ శ్రీ నాటికల్లోని సాహిత్య వ్యక్తిత్వమూ, విదూషకతత్త్వమూ మనో విశ్లేషణాత్మ కతనూ అంతర్జాతీయ దృష్టినీ గురించి ప్రత్యేకించి చెప్పారు.

చివరి అధ్యాయంలో ధ్వని మాధ్యమ ప్రధానమైన రేడియో నాటిక, లక్షణ, నిర్మాణ, నిర్వహణలో ఉండే కష్టనిష్ఠురాలూ, కంఠాల వైవిధ్యావశ్యకతా, సంగీతావశ్యకతలను గురించిన ప్రసక్తి తెచ్చారు.

"వివిధ ప్రయోగవాద ధోరణులన్నింటిల్లోనూ అంతస్సూత్రంగా మనో విశ్లేషణ ప్రభావం" - దానివల్ల "ఎక్స్‌ప్రెషనిజం, సర్రియలిజం, అబ్సర్డిజం మొదలగు చాలా ప్రయోగాల్లో నాటకంలో కల లాంటి వాతావరణం సృష్టించే ప్రయత్నం జరిగింది".

—— వ్యాసకర్త నిశిత పరిశీలక నిర్ణయాలలో మరికొన్ని మచ్చుతునకలు:-

"వస్తువు విషయంలో శ్రీ శ్రీకి పట్టింపుల్లేవు. కట్టుబాట్లు అంతకంటే లేవు. లేనిదాన్లో లేదా మనం లేదనుకునేదాన్లో - వస్తువు సృష్టిస్తారు. చెప్పదలచుకొన్న అంశాన్ని సూటిగా చెప్పరు.... చెప్పదలచుకొన్న అంశాన్ని ఒక్కోసారి తలకిందులు చేస్తారు."

"పాత్రల మనస్తత్వం చెప్పరు. తీరు తెన్నులు తెలియ నీయకుండా తనలో దాచేసుకుంటారు. పాత్రలు ఇంతకు ముందు సాంప్రదాయక రేడియో నాటికల్లో లాగా

ఉండవు. గ్రామఫోన్ రికార్డ్, ఆశ, భయం, కనుపాప, నిర్జీవి, సంధ్య, అంధకారం, నక్షత్రం, బావి లాంటి అన్నిటిని పాత్రలు చేస్తారు. అపాత్ర పాత్రీకరణం వల్ల శ్రోతకు పాత్రలతో తన్నుతాను identify చేసుకొనే వీలుండదు...... మనసుకి ఆనందం కలగడానికి బదులు శ్రోత రచయిత యొక్క wave lengthని అందుకోవాలని పరిగెత్తడం వల్ల మస్తిష్కానికి తీవ్రశ్రమా, తత్ఫలితంగా అలసటా మిగులుతాయి."

"గేయనాటికలూ డైలాగ్ ఓరియంటెడ్ నాటికలూ మధ్య అంతరాయాన్ని చెరిపేసి మామూలు నాటికల్లో గేయాలూ కవితలూ చేర్చి కొత్త టానిక్ తయారు చేశారు శ్రీ శ్రీ.... ఈ టానిక్ చేదుమందులాగా శ్రోతకి మింగుడుపడదు".

శ్రీ శ్రీ రేడియో నాటికల రచన - ప్రయోగవాద ధోరణుల వల్లా విశిష్ట వ్యక్తిత్వపు మేధశ్శక్తి ఒత్తిడులవల్లా - ఆనాటి రేడియో శ్రోతలకోసం వ్రాశారనడానికి వీలులేదు. ఆయన శ్రోతలూ, చదువరులూ, భూత, వర్తమాన, భవిష్యత్తులలో వ్యాపించుకొని ఉన్న సర్వశ్రోతలు - వారికై ఆ రచనల ప్రభావంలో శ్రీ శ్రీ విఫలుడైనారా అనే అంశం వరకూ వ్యాసకర్త్రి చర్చించడం ఆమె నిశితపరిశీలనా దృష్టికి మరొక దృష్టాంతం.

శీర్షికకు సంబంధించిన వివిధ విషయ పరిజ్ఞాన సేకరణలో వ్యాసకర్త్రి బహుగ్రంథ పరిశోధనము, వివిధ విజ్ఞులతో చేసిన సాక్షాత్కృత సంవాదాలూ ప్రశంసనీయాలు.

పర్యవేక్షకురాలయిన ఆచార్య సి.ఆనందారామం గారి మార్గ దర్శిత్వముతో, బహుళ శ్రమ సాధ్యమయిన స్వయంకృషితో శ్రీమతి పి.శివలక్ష్మి తన సిద్ధాంతాన్ని సమగ్ర విజ్ఞతా పూర్వకంగా సిద్ధం చేయగలిగినందుకు హృదయపూర్వక ధన్యవాదాలు.

బాలాంత్రపు రజనీకాంతరావు<br>8-5-1992.

విభావరి
ఎస్.ఎఫ్.
వీనస్ అపార్ట్‌మెంట్సు
టిక్కిలిరోడ్డు
విజయవాడ - 10.

# ప్రస్తావన

దృశ్య కావ్యాలు, శ్రవ్య కావ్యాలు అని రెండు రకాలు. ఇది సంప్రదాయిక విభజన. నాటకం మొదటి కోవలోకి వస్తే, కవిత్వం రెండో కోవలోకి వస్తుంది. అయితే అటు నాటకంగాని, ఇటు కవిత్వంగాని ఆకాశం నుంచి ఊడిపడ్డవి కావు. వేలాది ఏళ్ళుగా బతుకుతో పెనవేసుకుపోయి, ప్రజలకి చేరువగా తమ మనుగడ సాగించిన జానపద దృశ్య కళారూపా లెన్నిటినో మింగేసి "సామాజికుల' నాటకం తలెత్తింది. అలాగే కోట్ల కొలది పల్లెపాటలని వెనక్కి నెట్టేసి కవిత్వం ముందుకు దూసుకు వచ్చింది. నాటకానికి ప్రేక్షకులుంటే కవిత్వానికి శ్రోతలుంటారు. నాటకం చూడ్డానికి ఉద్దేశించింది. రేడియో నాటిక మాత్రం వినడానికే. కళ్ళు మూసుకుని, చెవులప్పగించి, రేడియో నాటిక వింటూ కూర్చోవచ్చు. కూర్చోనక్కర్లా. ఏదో ఒక చిన్న, పెద్ద పని కూడా చేసుకోవచ్చు. కళ్ళకి కట్టవలసిన దృశ్యాన్ని కూడా రచయిత మాటల ద్వారానే చిత్రించవలసి వుంటుంది. ప్రయోక్త వివిధ శబ్దాల ద్వారా ఆ ఎఫెక్టు తీసుకురావాలి. మాటల పొదుపు, శబ్దాల అదుపు రేడియో నాటికల్లో ముఖ్యం.

కవిత్వానికి కూడా సైన్సుకి వలె
కావాలి రీసెర్చి ఎక్స్‌పెరిమెంటూ

అన్నాడు శ్రీ శ్రీ ఏనాడో. కొందరి కవుల్లా శ్రీ శ్రీ 'యంత్రవిరోధి' కాదు. యంత్రంని అదుపు చేసుకుని మనకి అనువుగా వినియోగించుకోవాలనేది శ్రీ శ్రీ అభిమతం. పారిశ్రామిక నాగరకతని 'రొమాంటిక్‌దృష్టి' నుంచి నిరసించిన కవులు, రచయితలు, కళాకారులు ఎందరో వున్నారు. కాని శ్రీ శ్రీ మాత్రం ఆ కోవలోకి రాడు. యంత్ర స్వరూపాన్ని పరిశ్రమ స్వభావాన్ని బాగా ఆకళింపు చేసుకున్నవాడు శ్రీ శ్రీ. వీటి పునాదిమీద ఏర్పడిన ఆధునిక వ్యవస్థ ప్రభావం గురించి ముచ్చటిస్తూ శ్రీ శ్రీ ఒక కొత్త సంగతి చెప్పాడు. కవిత్వంలోనూ, జీవితంలోనూ 'Economy of words and thoughts' కావాలి మొర్రో అని ఎందరెందరో ఎన్నెన్నో రకాలుగా మొత్తుకుంటూనే వున్నారు. ఇది మనకి తెలుసు. కాని దీన్ని పాటించిన కవులు, రచయితలు అరుదు. విమర్శకులు ఎంత గీపెట్టినా సాధించలేని పనిని పారిశ్రామిక నాగరికత సాధించిందన్నాడు శ్రీ శ్రీ. ఎలాగంటే దినపత్రికలో వార్త, వ్యాపార ప్రకటన, టెలిగ్రాం ఈ మూడింట్లోనూ

మాటల పొదుపు అవసరం. రేడియో నాటిక పేరుకే నాటిక గాని, అది రక్తి కట్టడానికి నటుల హావభావాల సాయం ఇసుమంత కూడా వుండదు. అందుకని అన్నీ మాటల ద్వారానే సాధించాలి. నాటికరచయిత ఈ సంగతి బాగా గుర్తుంచుకోవలసి వుంటుంది.

రేడియో నాటికలోని మరో కీలకమైన అంశం 'కాలపరిమితి'. ఇతివృత్తం, పాత్రల చిత్రీకరణ, సంవిధానం, ఈ మూటిని ఏకతాటిమీద నడిపి కాలానికి కట్టిపడెయ్యాలి. కాలపరిమితిని కత్తిమీద సాములా పాటించకపోతే రేడియో నాటిక రాయలేరు. రచయితకి టైమ్‌సెన్సు లేకపోతే ప్రయోక్తకి చాలా ఇబ్బంది కలుగుతుంది. శ్రీ శ్రీతో ఇలాంటి పాట్లు పడ్డామని ఎవరూ, ఎప్పుడూ అనలేదు. అయితే వ్యక్తిగత జీవితంలోని అరాచకత్వం, సదుపాయాల లేమి వలన గడువు దాటిపోయి గొడవ పడ్డ సందర్భాలు లేకపోలా–"మాకు త్వరగా ఏ 'నాటిక'యినా రాసివ్వండి శ్రీ శ్రీ గారూ" అంటే "అలాగే రాస్తాను 'ఏనాటి' కయినా" అన్న హాస్యప్రియుడు శ్రీ శ్రీ.

శ్రీ శ్రీ నాటికల్లో కవిత్వం, భావావేశం పందెం వేసుకు పరుగెడతాయి. శ్రీ శ్రీలోని కవి, కళాకారుడు మనకి కొట్టొచ్చినట్టు కనబడతారు. అయితే ఇవి ప్రధానంగా ఇంటలెక్ట్యువల్ నాటికలు. వీటిల్లో మనకి శ్రీ శ్రీ థింకర్‌గా, సైంటిస్టుగా, తత్వవేత్తగా తారసపడతాడు. మానవుల ఆలోచనలకి పదును పెడుతున్న కాలం–దూరం, చావు–పుట్టుక, స్వర్గం–నరకం, మరణం–అమరత్వం వీటిని తరచి తరచి ఈనాటికల్లో చర్చించాడు శ్రీ శ్రీ.

గీతా ప్రవచనాలకి మూలాధారం ఆత్మ అని మనందరికి తెలుసు. 'ఆత్మకి చావు పుట్టుకలు లేవు, ఆత్మ సత్యం, ఆత్మ నిత్యం. జన్మలూ, కర్మలూ అన్నీ ఆత్మ చుట్టూవే' అంటుంది భగవద్గీత. ఈ ఆత్మ వాదనలన్నింటిని పరాస్తంచేసి, ఆత్మ ఉనికిని అపహాస్యం చేశాడు శ్రీ శ్రీ. 'గవేషణ' నాటిక అందుకే ఎంతో మిన్నగా ఎన్నదగింది.

సినీ జనారణ్యంలో చిక్కుకుపోయి, నాటకరంగానికి దూరం అయినందుకు ఆత్రేయ తెగవాపోయేవాడు. మంచి నాటకం రాస్తానని ఆశపెడుతూ ఉండేవాడు. అలాగే శ్రీ శ్రీ కూడా 'బెండయ్య గారి గది' అనే నాటకం రాసి పారేస్తానని బెదిరిస్తూ వుండేవాడు. దాని ఇతివృత్తం గురించి, సంవిధానం గురించి గంటల తరబడి సముద్ర తీరంలో చెబుతుండేవాడు. "చాలా మంచి నాటకం అవుతుంది సుమా" అని ఉబ్బిపోయే వాళ్ళం. సముద్రాలు దాటి అమెరికా వెళ్ళినప్పుడు (13-6-1981) ఆ నాటకం మూడు అంకాలు ముక్తసరిగా రాశాడు. 'బెండయ్య గారి గది'కి మూడే గోడలు. నాలుగో గోడ ప్రేక్షకులే. ఇలాంటి ప్రయోగాలు అందులో ఎన్నో వున్నాయి. తాను ముందుగా అనుకుని అందులో పొందు పరచలేనివి కూడా కొన్ని వున్నాయి. శ్రీ శ్రీ ప్రయోగ శీలిగా మనల్ని ఇందులో ముఖ్యంగా ఆకట్టుకుంటాడు. శ్రీ శ్రీ రాతప్రతి పదిలంగా వుంది. విరసం ప్రచురిస్తున్న శ్రీ శ్రీ సాహిత్య సర్వస్వంలో 7వ సంపుటి '1+1=1 మొదలైన రేడియో నాటికలు'. ఇందులో ఆఖరిది 'బెండయ్య గారి గది'. అలాగే 'ముట్టడి' నాటిక గురించి ఒక మాట. ఇది

అముద్రితం కాదు ఢంకా మాసపత్రిక (1949 అక్టోబరు)లో అచ్చయింది పుస్తకాల్లో చోటు చేసుకోలా ఇంతవరకు అదీ 7వ సంపుటంలోనే వస్తుంది

కవులకి, కళాకారులకి వుండే స్వేచ్ఛా, స్వాతంత్రియాలు విమర్శకులకి, పరిశోధకులకి వుండవు వీళ్ళకి ఓపిక, ఓర్పు కావాలి విసుగు, విరామం లేకుండా పరిశ్రమించాలి పరిశోధకులు అంతేకాదు గడకర్రలు చేత పుచ్చుకుని తాడు మీద నడిచే ఒడుపు పరిశోధకులకి ప్రాణం శివలక్ష్మిలో ఈ ఉత్సాహం తొణికిసలాడుతూ వుంటుంది అందుకే బెదురు, భయం లేకుండా టైట్ రోప్ వాకింగ్ చేస్తుంది ఈ ఒడుపుకి తోడయింది ఆసక్తి తనకు విశేష పరిచయం వున్న అంశాలనీ, ప్రక్రియలనీ, పరిశోధనకి ఎంచుకుంది శివలక్ష్మి ఈ రంగంలో ఎడతెరిపి లేకుండా కృషి చేసి ముందు ముందు మరిన్ని విజయాలు సాధిస్తుందని నిండు మనసుతో నమ్ముతున్నా

చలసాని ప్రసాద్

విశాఖపట్నం
28-2-1993

# కృతజ్ఞతలు

M.Philలో మాకు పాఠాలు చెప్పినవారు ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం, కె.కె.రంగనాథాచార్యులు, వెల్చేరు నారాయణ రావు, డా॥సి.ఆనందారామం. విలువైన సలహాలతో నా మార్గాన్ని సుగమం చేశారు. నా పరిశోధనాంశానికి పర్యవేక్షకురాలు డా.సి.ఆనందారామం. ఆద్యంతమూ సహకరించడమే కాదు, పరిశోధన ముగిసినా ముగియని విధంగా ఆత్మీయులయ్యారు.

రేడియో నాటికల విషయంలో గోపాలకృష్ణ (ఆలిండియా రేడియో, మద్రాసు), ఉమశ్రీ, మధుసూదన్ (ఆలిండియా రేడియో, విశాఖపట్నం), ఇంద్రగంటి శ్రీకాంతశర్మ (ఆలిండియా రేడియో, విజయవాడ) తమ సహకారాన్ని అందించారు.

డా॥బాలాంత్రపు రజనీకాంతరావు, వాడ్రేవు నారాయణమూర్తి, చలసాని ప్రసాద్, హరిపురుషోత్తమరావు, అబ్బూరి వరద రాజేశ్వర రావు, అబ్బూరి గోపాలకృష్ణ, ఆచార్య ఆత్రేయ, రావూరి భరద్వాజ, వేగుంట మోహన ప్రసాద్, వరవరరావు, నగ్నముని, మొదలి నాగభూషణశర్మ, ఎ.ఆర్.కృష్ణ, పి.వి.రమణ, అద్దేపల్లి రామమోహనరావు, చేకూరి రామారావు, జయధీర్ తిరుమల రావు, ముదిగొండ వీరభద్రయ్య, నాగరాజు- గార్లు ఈ నాటికల గురించి ఎంతో సమాచారాన్ని అందించారు. వీరిని కేవలం కృతజ్ఞతల జాబితాలో చేర్చినంత మాత్రాన సరిపోదు. వీరి సహాయ సహకారాలు లేకపోతే నా వ్యాసరచన పూర్తయ్యేది కాదు.

రజనీకాంతరావు గారు అడుగడుగునా వచ్చిన సందేహాలను ఓపిగ్గా తీర్చడమే కాకుండా, ఎంతో ఆదరంగా పరిచయ వాక్యాలు రాశారు.

ఎమ్.ఎ. చదివేకాలంలో మా పీఠాధిపతి ఆచార్య సీతాకల్యాణి. వారి సారథ్యంలో మిగిలిన అధ్యాపక బృందం ప్రొ॥ఎన్.గోపి, డా॥రాజన్న శాస్త్రి, డా॥శ్రీలక్ష్మి, డా॥కుసుమా బాయి, సంయుక్తా రెడ్డి మొ॥వారు అందించిన స్నేహపూర్వక సహకారం మాకు పైచదువులకు స్ఫూర్తి నిచ్చింది. అందరూ మా Batchని ఆప్యాయంగా చూసేవారు. ఆ రోజులు మరువలేనివి.

పుస్తకాన్ని అచ్చువేయించమని ప్రోత్సహించి తగిన ఆత్మస్థైర్యాన్నిచ్చారు. ప్రొ॥ వి. రామకృష్ణ, మిత్రులు వాసిరెడ్డి నవీన్.

ప్రూఫ్ రీడింగ్ నాకంటే శ్రద్ధగా చేశారు మిత్రులు అశోక్.

అమ్మా-నాన్నలూ, మామా, మరీ ముఖ్యంగా సవీ, రవీ, దివీ మీకు మేమున్నామంటూ కొండంత అండగా ఉంటారు.

నాశక్తంతా స్నేహమే. స్నేహం కలుపుకోవడం గొప్పకాదు. కలిసిన స్నేహాన్ని కలకాలం నిలుపుకోవడంలోనే స్నేహితుల సౌశీల్యాలు వెల్లడవుతాయి. నా స్నేహితులు

చివరివరకూ నిలుస్తారు. అందుకే నాకు గర్వం. పేరు పేరునా వాళ్ళపేర్లు రాస్తే పేజీలు నిండుతాయి. నా నేస్తాలకి Telepathy తెలుసు. అందుకే అందరినీ ఆర్ద్ర హృదయంతో గుర్తు చేసుకుంటున్నాను.

కొందరి పరిచయం తక్కువే అయినా చిరకాల పరిచితుల్లా అనిపిస్తారు. ఆర్టిస్ట్‌మోహన్, మోహన్ కంటే ఛే, రాగ్ బాబులు, కమల్ మా మంచి స్నేహితులు.

మా థండర్ వెలుగులు ఉమ, సంధ్య, స్వరూప్ నా చదువు సజావుగా సాగేలా చూస్తారు.

నేను బతకడానికీ, అద్భుతంగా బతకడానికీ, బతకలేక పోవడానికీ మూలం మా మోహన్.

'రైలుబడి'లో కొబయాషీ లాంటి మాజోషీసర్ కిదొక చిరుకానుక. సహజంగా టీచర్స్ తెలివిగల విద్యార్థుల్ని ఇష్టపడతారు. కానీ ఆయన మధ్యలో చదువాపేసి, శ్రద్ధలేని నాలాంటి విద్యార్థుల్ని చేరదీసేవారు. ముందు రోజు పాఠం గురించి ఎప్పుడు ప్రశ్నవేసినా దేభ్యంలా నిలబడే దాన్ని. "పాపం! నీ కెన్నో పనులూ, బాధ్యతలూ ఉంటాయి. మళ్ళీ నేనే చెప్తాను. ఇంకోసారి విను!" అనేవారు. ఎప్పుడూ ముంతాజ్‌తో కలిసి పార్టీలు ఆర్గనైజ్ చేస్తున్నట్లే ఉండేది. మాస్టారు మమ్మల్ని వెంటబెట్టుకొని Macbeth, King oedipus లాంటి డ్రామాలు, Cleopatra, Odysseus లాంటి సినిమాలు చూపిస్తున్నట్లే ఉండేది. ఆయన ఇంట్లో మేం 'టొటొచాన్'లాగా ఆడు కుంటున్నట్లే ఉండేది. ఈ క్రమంలోనే గమత్‌గా ఆశ్చర్యంగా సాహిత్యాన్ని పలవరిస్తూ- పులకలు తెచ్చుకోవడాన్ని నేర్పేశారు.

నాకు పుస్తకాలనిచ్చి సహకరించిన అనేక గ్రంథాలయాల సిబ్బందికి, అందంగా అచ్చేసిన ప్లానోగ్రాఫర్స్ వారికి, ఇంకా పరోక్షంగా సహకరించిన వారందరికీ కృతజ్ఞతలు.

– శివలక్ష్మి

# ప్రవేశిక

రేడియో నాటకంలోని గొంతులు, ఆ గొంతుల్లో వినిపించే మాధుర్యం అందరికీ తెలిసిన విషయమే అయినా, విన్న ప్రతిసారీ నాకు ఆశ్చర్యంగా ఉంటుంది. "రేడియో నాటకంలోని గొంతుకలో ఈ విశాలవిశ్వ సర్వస్వమంతా నిండి ఉంది"-అని శ్రీ చిరంజీవి అంటారు. నాకది నిజమనిపిస్తుంది. ఆ గొంతుల్లోని వైవిధ్యం నాకిష్టం. వైవిధ్యం వల్లనే నాటకంలోని రకరకాల పాత్రల్ని పోషించడం సాధ్యమౌతుంది. శ్రీ శ్రీ కవిగా అందరికీ సుపరిచితుడైనా, నాటక కర్తగా రావలసినంత ప్రాచుర్యం రాలేదు. ఈ నాటికలలో వివిధ ఇజాల ప్రభావంతో చేసిన ప్రయోగాల వల్ల కూడా కొంత అస్పష్టత చోటు చేసుకుంది. రేడియో నాటికల మీద నాకున్న అభిరుచి ఒక కారణం అయితే ఈ అస్పష్టతకు కారణాలు పరిశీలించాలనేది రెండో కారణం. ఈ నేపథ్యంలో నేను "శ్రీ శ్రీ రేడియో నాటికలు-ప్రయోగ వాద ధోరణులు"- అనే అంశాన్ని ఎంచుకోవడం జరిగింది.

అవి ఆకాశవాణి కొత్తగా వచ్చిన రోజులు. శ్రీ శ్రీ రేడియో నాటికల రచనా కాలానికి అప్పుడప్పుడే ఆంధ్రదేశంలో ఆధునికత చిగురిస్తున్న కాలం. కవిత్వం రాయడం ఏవిధంగా ప్రారంభించినప్పటికీ, అభ్యుదయ కవిగా గుర్తింపు పొందిన శ్రీ శ్రీ ఏ సాహితీ ప్రక్రియలోనైనా అభ్యుదయ కవిగానే కలం నడిపించారు. వస్తువు, శిల్పం, శైలి-ఈ మూడూ అభ్యుదయ దృక్పథంలోనే సంగమించి శ్రీ శ్రీ నాటికలు ప్రయోగవైచిత్రికి ఒక సాఫల్యాన్ని సాధించాయి.

శ్రీ శ్రీ పాశ్చాత్య సాహిత్యాన్ని బాగా ఆకళింపు చేసుకున్నారు. ప్రపంచాన్ని అర్థం చేసుకోవాలనే తపనవల్ల కనిపించిన ప్రతి పుస్తకాన్నీ ఆబగా చదవడమే గాక, 40వ దశకంలో ప్రసారమైన పాశ్చాత్య రేడియో నాటికలను బి.బి.సి.లో విన్నారు. ఆ రోజుల్లో Giles Copper, Dylan Thomas, Louis Macniece, Archibald Macleish, W.H auden, T.S.Eliot మొదలైన ప్రముఖ రచయితలు 'Isms" ప్రభావంతో సమకాలీన జీవితం మీద అద్భుతమైన వ్యాఖ్యలు చేశారు.

శ్రీ శ్రీ కూడా తన నాటికలలో సందర్భానుసారంగా వర్తమాన జీవితం మీద బ్రహ్మాండమైన బాణాలు విసిరారు. ఉపాధ్యాయుడు నిరంతరం నేర్చుకుంటూనే ఉంటే తప్ప యదార్థంగా చదువు చెప్పలేడనీ, నేర్చుకోవడం మానివేసిన వాళ్ళే బోధించడ మారంభించి యాంత్రికంగా చెప్పిన పాఠాల్నే చెప్తున్నారంటారు. అందువల్ల విద్యార్థులు పాసు మార్కుల్నే ధ్యేయంగా భావించడం వల్ల సృజనాత్మకత తగ్గి పోతుందంటారు. "ఇదీ మన ప్రపంచం"- అని సమాజాన్ని కళ్ళకి కట్టించడానికి శ్రీ శ్రీ ఎన్నో ప్రయోగాలు చేసి ఈ శతాబ్దపు దురదృష్టాన్ని వివిధ కోణాల్లో శ్రోతల ముందుంచారు.

పరలోకాలనూ, పాపపుణ్యాలనూ, సాంప్రదాయిక విలువలనూ ధిక్కరిస్తూ-

ఆధునికతను సాహిత్యంలో సుస్థిరం చేసిన శ్రీ శ్రీ కవిత్వంలో పౌరాణిక ప్రతీకలను వొదులుకోలేనట్లే, రేడియో నాటికల్లోనూ పౌరాణిక వస్తుజాలాన్ని వొదులుకోలేదు. అయితే తానెంచుకున్న వస్తువుకి శిల్ప ప్రతిభను జోడించి ప్రాచీన, పౌరాణిక వస్తువులకు ఆధునిక భాష్యం చెప్పారు. శ్రీ శ్రీ ప్రయోగం సాధించిన మరొక సత్ఫలితమిది.

శ్రీ శ్రీ నాటికలన్నిట్లో తన కాలానికి కొత్తదైన వస్తువుతో ప్రయోగాలు చేశారు. శీర్షికను ఆకాశవాణి కార్యక్రమ నిర్వాహకులు నిర్ణయించి పంపేవారు. 'జ్ఞానంకన్నా ఊహ గొప్పది'- అన్న ఐన్‌స్టీన్ మాటల్ని రుజువు చేస్తూ శ్రీ శ్రీ శీర్షిక చుట్టూ కథ నల్లడంలో శ్రోతల్ని దిగ్భ్రాంతుల్ని చేసే ఊహాలోకం చూపిస్తారు. అధికాంశం నాటికల్లో వస్తువు- 'మానవుడు- అతని సమస్యలు'. వస్తువులోని ప్రయోగంకోసమే శిల్పంలో ప్రయోగాలు చోటు చేసుకున్నాయి.

పరిశోధనాంశంపై స్పష్టమైన అభిప్రాయం ఏర్పడడానికి ఒక ప్రశ్నావళిని తయారు చేసి ప్రముఖుల్నీ - శ్రీ శ్రీని ఆంతరంగికంగా ఎరిగిన మిత్రులనూ స్వయంగా కలుసుకున్నారు.

'Isms' గురించి Prof. B.N.Joshi, Sequera గార్లు వివరంగా చెప్పారు.

కె.చిరంజీవి గారు శ్రీ శ్రీ రేడియో నాటికల పుస్తకాన్ని చూచి "ఇది Flap Book, శ్రీ శ్రీ రేడియో నాటికల లక్షణాలు తెలిసి రాయలేదు. వీలైతే వేరే టాపిక్ తీసుకో"మన్నారు. ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యంగారు "అనుభవజ్ఞుడైన ఒక రచయిత తాను రేడియో కోసం వ్రాస్తున్నాను అనే స్పృహతో వ్రాసినప్పుడు, తప్పకుండా ఆ లక్షణాలుండి తీరతాయి. పరిశీలించ"మన్నారు. అయోమయంగా ఉన్న పరిస్థితుల్లో మిత్రులు లక్ష్మి యాకూబ్‌ల సహకారంతో శ్రీ రజనీ కాంతరావు గారిని కలుసుకున్నాను. వారు ఈ అంశంపట్ల ఆసక్తిని కనపరిచి, బోలెడంత ధైర్యాన్నీ, ప్రోత్సాహాన్నీ ఇచ్చారు. వారి స్నేహితులు శ్రీ వాడ్రేవు నారాయణ మూర్తిగారు కూడా నాకు తెలియని విషయాలెన్నో వివరించి చెప్పారు. వీరే శ్రీ శ్రీకి Eliot సంవిధాన చాతుర్యమంటే చాలా ప్రీతి అని చెప్పారు. పరిశీలించిన మీదట ఆ విషయం నిజమని ధృవపడింది. Eliot ఒకచోట చెప్పిన విషయాన్నే తన రచనలలో మళ్ళీమళ్ళీ చెప్తుంటాడు. ఉదాహరణకి 'Four quartets'లోని 'Burnt Norton'లో చెప్పిన విషయాన్ని 'Family reunion' అనే నాటకంలో చెప్తాడు. ఈ టెక్నిక్‌ని శ్రీ శ్రీ కూడా ఉపయోగిస్తారు. తన నాటికల్లో ఎన్నోచోట్ల తన కవితలనే వాడుకున్నారు. 'చరమరాత్రి'లోని 'కోనేటిరావు- కథానిక'ల లోని విషయమే 'గుమస్తాకల'- అనే రేడియోనాటికగా మలిచారు.

హరి పురుషోత్తమరావుగారు ప్రయోగవాదం రేడియోలో విజయవంతమైనట్లు రంగస్థలం మీద కాలేదన్నారు. ఒక్క శ్రీ శ్రీ నాటికలే ఏడెనిమిదికి పైగా బాగా పేరొచ్చాయన్నారు. శ్రీ శ్రీ వీరికి రాసిన ఒక ఉత్తరంలో 'Dylan Thomas' రాసిన 'Under Milk Wood 'అనే రేడియో నాటకం గురించి రాశారు. ఈ నాటక ప్రభావాన్ని కూడా శ్రీ శ్రీ నాటికలలో గమనించవచ్చు. పాత్రలకి పేర్లుండవు. I Voice, II voice, III voice

అని Dylan Thomas అంటే శ్రీ శ్రీ మొదటి గొంతుక, రెండవ గొంతుక, మూడవ గొంతుక- అని అంటారు. 'Dylan Thomas' తన నాటకాన్ని 'To begin at the beginning' అని మొదలు పెడితే, శ్రీ శ్రీ 'చతురస్రం' నాటికను "ప్రారంభం నుండి ప్రారంభిద్దాం"- అని అంటారు.

Louis Macniece- 'Christopher columbus' లో సృష్టించిన 'Faith', 'Doubt'- పాత్రల లాంటి 'ఆశ', 'భయం' అనే పాత్రల్ని సృష్టించారు శ్రీ శ్రీ 'గుమస్తాకల'లో. 'మరోప్రపంచం'లో శ్రీ శ్రీ సృష్టించిన యువకకంఠాలు, 'వృద్ధకంఠాలు'- అనే వాటి వెనక, Louis Macniece సృష్టించిందే. 'Faith chorus' 'Doubt chorus' అనే వాటి ప్రభావ ముండటాన్ని గమనించవచ్చు.

అబ్బూరి వరద రాజేశ్వరరావుగారు వారి తండ్రి గారైన అబ్బూరి రామకృష్ణారావు రచించిన '20వ శతాబ్దపు జోలపాట అనే రంగస్థల నాటకంలోని ప్రయోగాల గురించి చెప్పారు. అబ్బూరి గోపాలకృష్ణగారు అనారోగ్యంతో ఉండి కూడా, శ్రీ శ్రీ 'విదూషకుడి ఆత్మహత్య' అనే రేడియో నాటికను రంగస్థల నాటకంగా ఏ విధంగా మలచిందీ చెప్పి, రాతప్రతిని ఇచ్చారు. వారు నాటకం మొత్తాన్నీ భావయుక్తంగా చదువుతూ నన్ను టేప్ రికార్డ్ చేసుకోనిచ్చారు. స్వర్గీయ ఆత్రేయ గారిని 6.5.89న కలిశాను. వారు రేడియో నాటికలో 'Cut Dialogue' ఏ విధంగా రాణిస్తుందో చెప్పి సినిమా కబుర్లు కూడా చెప్పారు. మే 7న వారి పుట్టిన రోజు సందర్భంగా భోజనానికి కూడా పిలిచారు. ఎ.ఆర్.కృష్ణగారు శ్రీ శ్రీ రేడియో నాటికల పుస్తకం తీసుకుని వారం రోజుల్లో రమ్మన్నారు. నేను వారంతర్వాత ఫోన్‌లో "రమ్మంటారా సార్?" అని అడిగితే "అయ్యో! త్వరగా వచ్చెయ్యమ్మా! నేను నీకు చెప్పాలనుకున్నవన్నీ మర్చిపోతున్నాను"-అని అన్నారు. రకరకాల గొంతుల గురించీ, ఏ గొంతు ఏ పాత్రకు ఎందుకు పనికొస్తుందో వివరంగా చెప్పారు. ఇవన్నీ మళ్ళీ మళ్ళీ స్మరించుకోదగిన విషయాలు.

గోపాలకృష్ణగారు ఆలిండియా రేడియో మద్రాసు కేంద్రంనుండి ఏఏ రేడియో నాటికలు ఎప్పుడెప్పుడు ప్రసారమయిందీ, శ్రోతల ప్రతిస్పందన గురించీ ఉత్తరం ద్వారా తెలిపారు. ఇంద్రగంటి శ్రీకాంతశర్మగారు వారి 'స్మృతి' రేడియో నాటక స్క్రిప్ట్ ఇచ్చారు. రేడియోస్టేషన్‌లో శబ్దాలని రికార్డ్ చేసి స్టాక్‌లో ఉంచడం, సహజత్వం కోసం పడే ఇబ్బందులూ, వాటిని సందర్భాను సారంగా ప్రసారం చేయడం మొదలైన విషయాలు వివరించి చెప్పారు.

శ్రీ శ్రీ రేడియో నాటికల్లోని చిత్ర విచిత్ర ప్రయోగాలు కొన్ని రేడియో ప్రసారానికీ, శ్రోతల గ్రహణ సౌలభ్యానికీ అనువైనవేనా? అనేసందేహం రావచ్చు. కానీ ఈ సందర్భంలో రేడియో నాటికలు కేవలం సంభాషణా ప్రధమైనవి మాత్రమే కావని మర్చిపోకూడదు. వాటికి నేపథ్యసంగీతాలు, ఆయా రసాలకు అనుగుణమైన 'ఎఫెక్ట్స్' సృష్టించే ధ్వనులను సృష్టించగలిగిన వాద్యాలు తోడవుతాయి. ఈ ఎఫెక్ట్స్‌తో కేవలం

సంభాషణలవల్ల అందుకోలేని భావాన్ని శ్రోతకు స్ఫురింపజేసే వీలుంది. మాటల కలితమైన భావ వ్యక్తీకరణ సామర్థ్యం సంగీతానికుందనే విషయం మర్చిపోకూడదు.

రేడియో నాటికల విషయం పరామర్శించేటప్పుడు ఒక్క రచయిత దృష్టిలోనుంచి మాత్రమే పరిశీలించడానికి వీలులేదు. ప్రయోక్త, దర్శకుడు, సంగీతదర్శకుడు, పాత్రధారులు, ప్రధానంగా పాత్రధారుల Modulation మొదలైనవన్నీ కూడా పరిగణనలోకి వస్తాయి. పరిశీలనలోనే ఇంత గొప్పగా తోచిన ఈ నాటకాలు ఆయా వాద్యాల సహకారంతో, ఆయా పాత్రధారుల Modulationsతో కూడిన సంభాషణల ఉచ్చారణల్లో ఇంకా ఎన్నెన్ని భావాలు శ్రోతల హృదయాలలో స్ఫురింపజేశాయో! నాటిక ముగిసింతర్వాత కూడా ఎన్నెన్ని సంవత్సరాలు శ్రోతల హృదయాల్లో ప్రతిధ్వనించాయో! మొత్తం మీద శ్రీ శ్రీ కవిత్వ ప్రయోగాలలాగే రేడియో నాటికల ప్రయోగాలు కూడా విజయవంతమైనవని భావించవచ్చు.

సౌలభ్యం కోసం పరిశోధనాంశాన్ని నాలుగు అధ్యాయాలుగా విభజించాను. మొదటి అధ్యాయంలో 'ప్రయోగం-ప్రయోగవాదం' అనే పదాల వివరణ ఇచ్చాను. ప్రపంచ సాహిత్యంలో ముఖ్యంగా నాటక సాహిత్యంలో తలెత్తిన రకరకాల ఇజాలను క్లుప్తంగా చెప్పాను. దేశ, విదేశాల్లోని 'రేడియో నాటిక' చరిత్రను రేఖామాత్రంగా స్పృశించి, శ్రీ శ్రీ 'రేడియో నాటిక'అనే ప్రక్రియని ఏ పరిస్థితుల్లో మొదలుపెట్టారో క్లుప్తంగా పరిచయం చేశాను.

రెండో అధ్యాయంలో శ్రీ శ్రీ సాహిత్య వ్యక్తిత్వంలోని ప్రయోగ ప్రియత్వాన్నీ, విదూషకతత్వాన్నీ వివరించి, మనో విశ్లేషణాత్మక పరిశీలనకు శ్రీ శ్రీ యిచ్చే ప్రాధాన్యాన్ని గురించి చెప్పాను. శ్రీ శ్రీ వివిధ ప్రక్రియలు సృష్టించినప్పటికీ పరిశీలించి చూస్తే అన్ని నూత్న ప్రక్రియల్లోనూ, తనదైన ఒక ముద్రకనిపించడం గురించి విశ్లేషించాను.

మూడో అధ్యాయంలో నేను సేకరించినమేరకు శ్రీ శ్రీ రేడియో నాటికల నేపథ్యాన్ని వివరిస్తూ, ఒక్కొక్క నాటికలోని కథాసారాంశాన్ని వివరించాను.

నాలుగో అధ్యాయంలో రేడియోనాటిక లక్షణాలు, నిర్మాణం, నిర్వహణ, కథాప్రాధాన్యతలను వివరించి కంఠాలు, సంగీతం, ధ్వనులు మొదలైనవి నిర్వహించే పాత్రనూ, శ్రీ శ్రీ వస్తువులోనూ, టెక్నిక్ లోనూ చేసిన వివిధ ప్రయోగాలనూ వివరించాను.

అధ్యాయం 1

# ప్రయోగవాద పరిచయం రేడియో నాటిక

ఆధునిక సాహిత్యానికి సంబంధించిన చర్చల్లో తరచుగా 'ప్రయోగం', 'ప్రయోగవాదం' అనే పదాలు కనపడుతుంటాయి. ఈ ప్రయోగం (Experiment), ప్రయోగవాదం (Experimentalism) వంటి భావనలు ఇంతకు ముందు లేనివి. ఈ కారణంగా వీటిని పూర్తిగా వినూత్న భావనలుగా, వినూత్న పరిభాషలుగా గుర్తించడం సమంజసంగా ఉంటుంది.

ఆంగ్లంలో 'Experiment' అనే మాటకు 'పరీక్ష','పరీక్షించి చూసే ప్రక్రియ' అనే అర్థాలు ఉన్నాయి. విజ్ఞాన శాస్త్రంలో ప్రయోగం (Experiment) ప్రముఖ స్థానాన్ని ఆక్రమించింది. వైజ్ఞానిక పరిశోధన, సాహిత్యం ఒకటి కాక పోయినా, సాహిత్యంలో కూడా సరికొత్త విధానాలను ప్రవేశపెట్టి వాటి ఫలితాలను తెలుసుకొనేందుకూ, కొన్ని ప్రతిపాదనలను చేసేందుకూ ప్రయోగ విధానాన్ని అనుసరించవచ్చు. మస్తిష్కంలో మెదిలిన ఒక కొత్త ఊహను వాస్తవ జీవితానికి ఏ విధంగా -ఎంతమేరకు అనువర్తింపచేయవచ్చో పరీక్షించి నిర్ధారణ చేసుకోవడానికి అవసరమైన సంఘర్షణాత్మక వాతావరణ కల్పనతో సాహిత్యసృష్టికి పూనుకోవడం 'సాహిత్యంలో ప్రయోగం' - అని నిర్వచించుకోవచ్చు. ఇలా సాహిత్యవేత్తలు వివిధ సాహిత్య ప్రక్రియల్లో ప్రయోగాలు చేయడాన్ని 'ప్రయోగవాదం' అంటారు[1]. మొదటగా ప్రపంచ సాహిత్యంలో, ఆ తర్వాత తెలుగు సాహిత్యంలో 'ప్రయోగవాదం' ప్రారంభమైంది. తెలుగు సాహిత్యంలో తెలుగు కవిత్వం మీదా, తెలుగు నవలల మీదా, తెలుగు కథల మీదా, తెలుగు నాటకాలమీదా, ఈ ప్రయోగవాద ధోరణులు తమ ప్రభావాన్ని చూపించాయి.

శ్రీ శ్రీ నలుగురు నడిచే బాటలో నడవడానికి ఇష్టపడని మనిషి కావడం వల్లా, తను ఏ రచనలో నైనా స్వంత వ్యక్తిత్వం, తనదైన ముద్రా కనిపించాలని తపించే కళాకారుడవడంవల్లా ఎప్పటికప్పుడు సాహిత్యంలో కొత్తదనం కోసం ఎన్నో ప్రయోగాలు చేస్తూ వచ్చారు.

శ్రీ శ్రీ రేడియో నాటికలనీ, ప్రయోగవాద ధోరణులనీ పరిశీలించే ముందు,

'ప్రయోగం' అనే పదం గురించి ఎలాంటి తికమకలూ పడకుండా, మరికొంత వివరంగా చర్చిస్తున్నాను.

ప్రయోగం అనే పదం అనుచానంగా సంప్రదాయార్థంలో ఎలా వాడబడుతూ వస్తూందో తెలుసుకోవాలంటే, 'సి.నారాయణరెడ్డి' గారి – 'ఆధునికాంధ్ర కవిత్వము సంప్రదాయములు : ప్రయోగములు' – అనే సిద్ధాంత గ్రంథాన్ని చూడాలి. కొంతమేరకు 'ప్రయోగం' అనే పదాన్ని గురించిన అవగాహనను ఇది కలిగిస్తుంది.

" సంప్రదాయముపై జరుగు మార్పే ప్రయోగము
ఈ ప్రయోగము మూలమునకు మెరుగులు దిద్దు
నది కావచ్చును; లేక మూలచ్ఛేది కావచ్చును."[2]

అని నారాయణరెడ్డిగారు నిర్వచించారు. వారే కాదు. 'సంప్రదాయవాదులు' ఎవరైనా ప్రయోగం అనే పదానికి, సాహిత్యానికి మాత్రమే వర్తించేదిగా కాక, అన్ని రంగాలకూ, అన్ని కాలాలకూ వర్తించే విధంగా 'విస్తృతార్థం' కల్పించారు.

పాశ్చాత్య సంప్రదాయవాదుల్లో 'Aristotle of our Age'- గా పేరెన్నిక గన్న T.S Eliot ఈ విధంగా అన్నారు.

" To conform merely would be for the new work not really to conform at all; it would not be new, and would therefore not be a work of art. And we do not quite say that the new is more valuable because it fits in; but its fitting in is a test of its value- a test, it is true, which can only be slowly and cautiously applied, for we are none of us infallible judges of conformity We say· it appears to conform, and is perhaps individual, or it appears individual and may conform; but we are hardly likely to find and it is one and not the other."[3]

ఇందులో Eliot ఎక్కడా Experiment అన్నపదాన్ని ప్రయోగించలేదు. కానీ దానికి సమానార్థకమైన ' Test' అనే మాటను ప్రయోగించాడు. నారాయణరెడ్డిగారి నిర్వచనంలో "సంప్రదాయముపై జరుగు మార్పే ప్రయోగము"– అనే వాక్యానికీ, Eliot చెప్పిన "It would not be new"- అనే వాక్యానికీ గల సారూప్యం దర్శించే శక్తున్న వాళ్ళకి సంప్రదాయానికి గల బలం ఏమిటో తెలుస్తుంది. 'వాల్మీకి', 'కాళిదాసు', 'భవభూతి' మొదలైనవారు ఎవరికివారే తమ కాలానికి తాము కొత్త ప్రయోగాలు చేశారని నారాయణరెడ్డిగారు వివరించారు. నన్నయ తెలుగులో ఒక కావ్యం రాయడం నన్నయ నాటికి కొత్త ప్రయోగం. నన్నయ నుంచి నేటివరకు ప్రసిద్ధ కవులలో ఎవరికి వారు, తమ తమ కాలాలలో కొత్త ప్రయోగాలు చేసి తెలుగు సాహిత్య సంప్రదాయాన్ని నెలకొల్పారు. ఈ సందర్భంలో 'ప్రయోగం' అనే పదానికి, 'కాలపరీక్షకు గురి చేస్తూ ప్రతిభావంతుడైన కవి ఓ కొత్త పనిని చేయడం' – అని అర్థం చెప్పుకోవచ్చు.

"సంప్రదాయము, ప్రయోగము స్థూలదృష్టికి వేరువేరుగా కనిపించినను, ఈ

రెంటికి సన్నిహిత సంబంధమున్నది. ప్రతి సంప్రదాయము ఒకనాటి ప్రయోగమే. ప్రతి ప్రయోగము ఒకనాటికి సంప్రదాయము కాక తప్పదు. ఒక్కొక్క ప్రతిభావంతుడైన కవి చేతిలో " పరుసవేది " యుండును. అతడు మట్టిగడ్డను ముట్టినను మాణిక్యమై పోవును. మౌలిక ప్రజ్ఞ కలవాడు చేసిన ఏ ప్రయోగమైనను త్వరలోనే సంప్రదాయముద్ర వేసికొనును."[4]

–నారాయణరెడ్డిగారు 'ప్రతిభావంతుడైన కవి' –అని అంటే, Eliot 'Individual talent' - అని అన్నాడు, "Tradition and the Individual talent" అనే వ్యాసంలో ఈ ఇద్దరి భావాల్లో ఏకరూపతను చూస్తే 'Individual talent' లేనివాడు ' Tradition' లో భాగం కాలేడనీ, Tradition బలంలేని 'Individual talent' కాలపరీక్షకు నిలవదనీ అభిప్రాయపడ్డారని తెలుస్తోంది. సంప్రదాయం ప్రజాజీవితంలోని మౌలికవిలువలతో, సంస్కృతితో ముడిపడివుంటుంది. ఆ ప్రజల కోసం, వారి ప్రయోజనాలను దృష్టిలో ఉంచుకొని ప్రయోగాలు చేసే ఏ కవైనా ప్రతిభాశాలి అవుతాడు. ఆధునిక ప్రయోగవాద ధోరణిలో ప్రయోగం కోసం ప్రయోగం చేయడమే తప్ప సంప్రదాయాన్ని కొనసాగించేందుకు ప్రయోగాలు ఎవరూ జరపరు. నారాయణరెడ్డిగారు ప్రయోగం కోసం ప్రయోగం చేసే విధానాన్ని విశృంఖల ధోరణిగా భావించారు. అయితే ఆధునికశాస్త్రవిజ్ఞానం, ఆ విజ్ఞానం వల్ల ఏర్పడ్డ వింత ఆలోచనలు ఈ ధోరణికి కారణమని వారు గుర్తించారు.[5]

వైజ్ఞానిక పరిశోధనలపట్ల ఆసక్తి; స్వేచ్ఛా, సౌభ్రాతృత్వం, సమానత్వం - లాంటి భావాల పట్ల ఆదరణా; డార్విన్, ఫ్రాయిడ్, మార్క్స్ వంటి మేధావుల సిద్ధాంతాల ప్రభావం; యూరప్ నుంచి వచ్చిన ఆధునిక సాహిత్య ప్రక్రియల, కళాస్వరూపాల, ఉద్యమాల, విప్లవాల పట్ల అవగాహనా, సమ్మేళితం చేసుకున్న వ్యక్తి కావడం వల్లనే శ్రీ.శ్రీ ప్రయోగవాదంలో వీటన్నిటి మేళవింపూ కనిపిస్తుంది. అందువల్లే శ్రీ శ్రీ ఆధునిక రచయిత అయ్యారు. శ్రీ శ్రీ 'ప్రయోగవాదం" తెలియాలంటే యూరప్‌నుంచి తెలుగుసాహిత్యం లోకి ప్రవేశించిన వివిధ 'వాదాల' (ఇజాల) పరిజ్ఞానం అవసరం.

### ఆధునిక వాదాలూ ప్రయోగవాదం

'ఇజం' అనే మాటకు తెలుగులో వాదం అని వ్యవహరిస్తారు. 'ఆధునిక వాదాలు' అంటే, ఆధునిక కాలంలో వచ్చిన డాడాయిజమ్', 'సర్రియలిజమ్' - వంటి 'ఇజాలు' అని అర్థం చేసుకోవాలి.

యూరప్‌లో వివిధ ఇజాలు ముందు వివిధ కళల్లో ప్రవేశించి, ఆపై సాహిత్యంలోని వివిధ ప్రక్రియల్లోకి వ్యాపించాయి. కొన్ని ప్రపంచ ప్రసిద్ధ గ్రంథాలను అధ్యయనం చెయ్యాలంటే ఈ ఇజాల గురించి తగినంత పరిచయం అవసరం. ఉదాహరణకి

'సర్రియలిజం' తో ప్రభావితమైన నవలలు - జేమ్స్‌జాయిస్ రచించిన 'యులిసిస్', వర్జీనియా వుల్ఫ్ రచించిన 'మిసెస్ డాలోవే".

సాహిత్యంలో ప్రవేశపెట్టడానికి వీలున్న వాస్తవిక వాదం (Realism), అధివాస్తవిక వాదం(Surealism), స్వభావవాదం (Naturalism), మొదలైన ఇజాలు నవలారచనతోపాటు మిగిలిన ప్రక్రియలన్నిట్లోకీ చొరబడ్డాయి. అసంబద్ధవాదం (Absurdism), రంగస్థలవాదం(Theatricalism) లాంటివి నాటక రంగానికి మాత్రమే పరిమితమయ్యాయి [6]

ప్రస్తుతం ఈ ఇజాలలో ప్రధానమైన పదింటిని క్లుప్తంగా పరిచయం చేస్తున్నాను అవి-

1. కాల్పనికవాదం (Romanticism)
2. వాస్తవికవాదం (Realism)
3. స్వభావవాదం (Naturalism)
4. ప్రతీకవాదం (Symbolism)
5. వ్యక్తీకరణవాదం (Expressionism)
6. అసంబద్ధవాదం (Absurdism)
7. అధివాస్తవికవాదం (Surrealism)
8. రంగస్థలవాదం (Theatricalism)
9. వాన్‌గార్డ్ భావవాదం (Vanguardism)
10. భవిష్యవాదం (Futurism)

**కాల్పనికవాదం (Romantism):**

రొమాన్స్‌జాతుల వీర, ప్రణయ గాథల్లో కనిపించే ప్రకృత్యారాధన, ప్రణయ భావుకత, అతిలోక కాల్పనికత, ఏదో తెలియని ఆవేదన వంటివి ఈ కాల్పనిక వాద లక్షణాలు.[7] ఈ లక్షణాలన్నీ మెలోడ్రామాకి మార్గం వేశాయి. మెలోడ్రామాలో ఉద్వేగానికి ఎనలేని ప్రాధాన్యం ఉంటుంది.

**వాస్తవికవాదం (Realism):**

కాల్పనికవాదం నేలవిడిచి సాము చేయడం వల్ల వాస్తవిక వాదావిర్భావం జరిగింది పురాణాలకూ, రాచరిక వ్యవస్థకూ సంబంధించిన సాంప్రదాయిక భావాలన్నిటిమీదా దెబ్బతీయడంవల్ల వాస్తవిక వాదానికి 'Protest theatre' అని పేరొచ్చింది.[8]

ఈ వాదం పద్దెనిమిదవ శతాబ్దంలో ఆరంభమైంది. వాస్తవికవాద నాటకంలో నిజజీవితం లోని సంఘటనల్ని యథాతథంగా చిత్రించడం జరుగుతుంది. అంతకు ముందెప్పుడూ వస్తువుగా స్వీకరించని అనేక సమస్యలు ఈ వాదం పుణ్యమా అని నాటకరంగం మీదికొచ్చాయి. Ibsen, Bernard Shaw, Chekhov, Strindberg

మొదలైనవారు వాస్తవికవాదాన్ని నాటకరచనలో అత్యుత్తమంగా ఉపయోగించుకున్న ప్రముఖులు.

### స్వభావవాదం (Naturalism):

వాస్తవికవాదం లోంచి వచ్చిన ప్రధానమైన వాదం స్వభావవాదం. ప్రజల్లో వేగంగా పెరుగుతున్న హేతువాదదృష్టినీ, శాస్త్రీయదృష్టినీ సాహిత్యవస్తువుకి అన్వయింపజేసేదే స్వభావవాదం.[9] దాదాపుగా వాస్తవాన్ని తెచ్చి రంగస్థలంమీద యధాతధంగా ఉంచడం ఈ వాదంలోని ప్రధానలక్షణం. ఉదాహరణకి 'సంత' ని ప్రేక్షకులకు ద్యోతకం చెయ్యాలంటే, కూరగాయల అంగళ్ళని, కూరగాయల క్రయవిక్రేతల్ని, రంగస్థలంమీద ఉంచి తీరాలని స్వభావవాదులు తాపత్రయపడ్డారు. Emilyzola, Chekhov, Stanislavsky మొదలైనవారు ఈ వాదాన్ని ప్రాచుర్యంలోకి తెచ్చారు.

### ప్రతీకవాదం (Symbolism):

ఫ్రాయిడ్ 'మనోవిశ్లేషణ సిద్ధాంతం' ప్రచారంలోకి వచ్చాక, మనిషి మనసులో, సుప్తచేతనలోని భావాలు ప్రతీకాత్మకమైన భాషలో ఉంటాయన్న అవగాహన సాహిత్యవేత్తలకు వచ్చింది. సుప్తచేతనని ప్రతీకలద్వారా సాహిత్యవేత్తలు అభివ్యక్తం చేశారు వాస్తవాన్ని మార్మికతతో, సంకేతాల రూపంలో చెప్పాలన్నది వీరి అభిప్రాయం. పందొమ్మిదవ శతాబ్దపు ద్వితీయార్థంలో ఫ్రాన్స్‌లో పుట్టిన ఈ వాదానికి ప్రముఖుడు Adalphe Afsia.

### వ్యక్తీకరణవాదం (Expressionism):

ఫ్రాయిడ్-కలల విశ్లేషణ, ఐన్‌స్టీన్- సాపేక్షతాసిద్ధాంతం, డోస్టోవిస్కీ -నవలలు, బెర్గ్‌సన్ తత్త్వశాస్త్రం - వీటన్నిటి ప్రభావం పడినవాదం ఇది. మానవుని ఆంతరంగిక ఆలోచనలకు ఉదాత్త రూపకల్పన చెయ్యాలన్నది వీరి ఉద్దేశ్యం[10]. జర్మనీలో Franz Wedekind, Ernest Tayler, George, Kaiser, అమెరికాలో Elmer Rice, Wilder ఈ వాదాన్ని ప్రాచుర్యంలోకి తెచ్చారు.

### అసంబద్ధవాదం (Absurdism):

కొందరు నాటకరంగ ప్రయోక్తలు అస్తిత్వవాదంనుంచి ప్రేరణపొంది 'Absurd theatre' అనే ప్రయోగం చేశారు. ఆంతరంగిక ప్రపంచం ఎంత అసంబద్ధంగా ఉంటే, అంత అసంబద్ధంగానూ నాటక రచయిత చిత్రించాలనేది వీరి వాదం [11]. Alfred Jarry ని 'అసంబద్ధ నాటకరంగ పితామహుడు' (Father of the Absurd drama) గా

భావిస్తారు. Samuel Buckett, Eugene G'neill, Pirandello మొదలైనవారు ఈ వాదాన్ని ప్రాచుర్యంలోకి తెచ్చారు.

**అధివాస్తవిక వాదం (Surealism):**

ఈ వాదం ఫ్రాయిడ్-'మనో విశ్లేషణ సిద్ధాంతం' నుంచి ప్రేరణ పొందింది. మనిషి మనసు లోతుల్లో, తనకే తెలియకుండా ఉన్న అనుభవాలు అన్ని వాస్తవాలకంటే వాస్తవమైనవని సర్రియలిస్టులు భావిస్తారు. శ్రీశ్రీ ఈ వాదానికి నిర్వచనం చెప్తూ "అపస్మారక మనస్సు నుండి స్వప్నలోక రహస్యాలను సంగ్రహించడానికి చేసే ప్రయత్నమని సర్రియలిజమును నిర్వచించవచ్చును" అన్నారు.[12]

ఒక్కమాటలో చెప్పాలంటే, 'సర్రియలిస్టిక్ డ్రామా' వేదికమీద ఒక కలను అందిస్తుంది. ప్రేక్షకుల్ని ఒక కలల ప్రపంచానికి - అది రచయిత కలైనా కావచ్చు, ఇతరుల కలైనా కావచ్చు - తీసికెళ్తుంది.

**రంగస్థలవాదం (Theatricalism):**

ఈ వాదంలో దర్శకుడే సర్వాధికారి. ప్రతిపాత్రా దర్శకుడి ఇష్టప్రకారం కదలాలి. ఏయన్నా దేశీయుడైన "రైన్‌హార్టెట్" రంగస్థల వాద ప్రముఖుడు[13]

**వాన్‌గార్డ్ భావవాదం (Vanguardism):**

ఇంగ్లీష్‌లో "Van-guardism" అనీ, ఫ్రెంచిలో 'Avante-Guarde' అనీ ఈ వాదాన్ని వ్యవహరిస్తారు. ఎక్కడపడితే అక్కడ, ఏ నియమమూ పాటించకుండా ప్రజల మధ్య నాటక ప్రదర్శన జరపవచ్చునంటారు. ఈ వాద ప్రముఖులైన Alfred Jarry, Uburoi.[14]

**భవిష్యవాదం (Futurism):**

పందొమ్మిది వందల తొమ్మిదిలో ఇటలీలో 'Signor F.T. Marinetti' అనే అతను తన ఉద్యమాన్ని Futurism అనే పేరుతో స్థాపించాడు.[15] యూరప్‌లో యుద్ధం తీవ్రంగా జరుగుతున్నరోజుల్లో మానవ నాగరకతా చిహ్నాలన్నీ ధ్వంసమైపోయాయి. ఆ సమయంలో 'మారినెట్టీ' సాహిత్యాన్ని నాశనం చేసి, శిథిలాల నుంచి కొత్త శిల్పాన్ని సృష్టించాలనుకున్నాడు. అది 'భవిష్యవాదం' అవుతుందని భావించి 'Futurist Manifesto' ని ప్రకటించాడు. అందులో - ఐతిహాసికులనూ, ప్రేమగీతరచయితలనూ, పండితులనూ, విమర్శకులనూ, వ్యాకరణాలనూ, నిఘంటువులనూ, నాటకశాలలనూ, శిల్పాలనూ నిర్మూలించమన్నాడు. యంత్రాలనుండీ, చలనచిత్రాలనుండీ, వార్తాపత్రికలనుండీ- కావ్యవస్తువుని స్వీకరించి నూతనసృష్టి చేయమన్నాడు. తన భావాల కనుగుణంగా 'మారినెట్టీ', 'ట్రిపోలీయుద్ధం' అనే గ్రంథాన్ని కేవలం ధ్వన్యనుకరణలతో రచించాడు.[16]

ఆధునిక తెలుగు నాటకం 'కన్యా శుల్కం' (వివిధమార్పులతో చేసిన ద్వితీయ ముద్రణ) పందొమ్మిదివందల పదిలో వెలువడింది. 'కన్యాశుల్కం' వెలువడిన మూడు దశాబ్దాల అనంతరం ఇంగ్లీష్ నాటక రంగంలోని వివిధ పరిణామాల ప్రభావాలు, తెలుగు నాటకరంగంలోని పరిణామాలకు కారణమవసాగాయి.

1943-1963 మధ్య చారిత్రక కారణాల వల్ల, వివిధ కళలతో పాటు నాటకకళలో కూడా 'ప్రయోగవాదం' ఊపునందుకుంది.

తెలుగు నాటకాలలో వివిధ ప్రయోగాలతో పాటు తెలుగు నాటికల రచనలో కూడా విభిన్న పరిణామాలొచ్చాయి. దాదాపు ఇదే కాలంలో ఆంధ్రా యూనివర్సిటీ ప్రయోగాత్మక నాటకరంగం, తెలుగు నాటక చరిత్రలో తీవ్ర సంచలనాన్ని కలిగించింది. 'ఆంధ్రాభ్యుదయోత్సవాలు' విద్యార్థుల్లోనూ, అధ్యాపకుల్లోనూ కొత్త ప్రయోగాలకు సంబంధించిన వినూత్న చైతన్యాన్ని కలిగించాయి.[17] తెలంగాణా సాయుధ పోరాటం సమయంలో 'ప్రజా నాట్యమండలి', 'మాభూమి', 'ముందడుగు' వంటి నాటకాలతోపాటు ఎన్నో నాటికల్ని కూడా ప్రదర్శించింది. ఇవన్నీ వాస్తవిక వాదానికి నిదర్శనలుగా నిల్చాయి.

తీరికా, స్థిమితమూ లేని ఎలక్ట్రానిక్ యుగపు ఆధునిక మానవుడి కోసం స్వల్పవ్యవధిలో వినోదం కలిగించడానికి అవతరించింది ఆధునిక తెలుగునాటిక వీటిలో కథతో పాటే సన్నివేశం, నిర్వహణ, పాత్రలు, వాతావరణం పరిమితమై వుంటాయి నాటికకు ఆకస్మికారంభం ఉండి, ఆద్యంతాలు ఉత్సుకత (suspense) తో నిండి ఉంటుంది. ముగింపు ఊహింపరాని విధంగా ఉండి ఆనందం (Thrill) కలిగిస్తుంది.[18] నాటిక One sittingలో, స్వల్ప వ్యవధిలో ఐపోతుంది. అందులోనూ దృశ్యప్రక్రియ కాబట్టి ప్రగతికి దోహదకారి అవుతుంది.

కొనకలూరి ఇనాక్ నాటికా వాఙ్మయాన్ని ఈ క్రింది విధంగా విభజించారు.[19]

1. కవితా నాటిక
2. పౌరాణిక నాటిక
3. చారిత్రక నాటిక
4. శ్రవ్యనాటిక
5. హాస్యనాటిక
6. సాంఘిక నాటిక
7. అపరాధ పరిశోధక నాటిక
8. అనువాదనాటిక
9. ప్రచార నాటిక
10. రాజకీయనాటిక

11. విషాదాంత నాటిక
12. బాలనాటిక
13. స్త్రీనాటిక
14. నృత్యనాటిక
15. వర్గపోరాట నాటిక
16. సంసారిక నాటిక

## రేడియోనాటిక: ప్రయోగవాదం:

రేడియోనాటిక, నాటకకళను విప్లవాత్మకంగా ప్రభావితం చేసింది. ఇది అంధులను కూడా అలరించగలదు కనుక దీనిని "Blindman's theatre" అన్నారు. అయితే, కేవలం రంగస్థల నాటకంలోని శబ్దభాగాన్ని మాత్రమే వింటున్నట్లుండే రేడియోనాటికకి ఏ విశిష్టతా ఉండదు. రేడియోలో, రంగస్థలంమీద ఉత్పత్తి చేయదానికి వీల్లేని ఎన్నో శబ్దాలను ఆధునిక సాంకేతిక శాస్త్ర సహాయంతో ఉత్పత్తి చేసే అవకాశం ఉంది. Voice control ద్వారా, Musical effects ద్వారా శ్రోతల మనసుమీద ఎన్నో ప్రభావాలు సృష్టించవచ్చు. ఇందువల్ల రేడియోనాటికకి అనంతమైన కాల్పనిక శక్తి ఏర్పడింది. ఒక క్షణంలో భారతదేశంలోని పల్లెటూరి సంఘటననీ, మరుక్షణంలో గ్రీస్‌లోని ఏథెన్స్ నగరానికి సంబంధించిన సన్నివేశాన్నీ వినిపించవచ్చు. చిరంజీవి " శ్రోత ఊహలకు పురులు విప్పుతుంది రేడియోనాటిక అన్నారు.[20]

రేడియోనాటికలో శబ్దాన్నీ, గొంతుకనీ, సంగీతాన్నీ ఉపయోగించి కాల్పనిక, స్వాప్నిక వాతావరణాన్ని సులభంగా సృష్టించవచ్చు. అందువల్ల సర్రియలిజం, అబ్సర్డిజమ్, ఎక్స్‌ప్రెషనిజం లాంటి అనేక ఆధునిక వాదాల ప్రయోగాలకు రేడియో అనువైనదిగా మారింది. రేడియోనాటిక ప్రయోగవాదానికి స్టేజి నాటిక కన్నా ఎక్కువగా అనుకూలిస్తుంది. ఈ విషయాన్ని బలపరుస్తూ, రేడియోనాటికల రచయితగా పేరొందిన చిరంజీవి ఇలా అన్నారు.

> "..... ఈ మీడియంలో Impressionistic drama లేదా Non-realistic forms మరింతగా రాణిస్తాయి".[21]

## పాశ్చాత్య రేడియోనాటిక - ఆవిర్భావ వికాసాలు[22]

## యూరప్ రేడియో నాటిక:

ఒక కొత్త ప్రసార సాధనమైన రేడియో ప్రాథమిక సూత్రాల్ని అర్థం చేసుకునేందుకు యూరప్ రచయితలకు కొంతకాలం పట్టింది. 'మాటాడు! నేన్నిన్ను చూడాలి' అనేది రేడియోనాటికలపై రాసిన ఒక జర్మన్ పుస్తకం శీర్షిక. దీనికున్న స్వేచ్ఛను వారు గుర్తించారు. గతాన్నీ, వర్తమానాన్న, భవిష్యత్తునీ అవసరాన్ని బట్టి ఎలా

అంటే అలా ప్రసారం చేయవచ్చు.

పాశ్చాత్య రేడియో నాటికల్లో మొట్టమొదటిది Richard Hughes రాసిన 'Danger' అను నాటిక. పదిహేను నిమిషాల వ్యవధిలో బి.బి.సి. నుంచి ప్రసారమైంది. అప్పట్నించీ ఇంగ్లాండ్, ఫ్రాన్స్, జర్మనీ, ఇటలీ, స్కాండినేవియా, నార్వే, స్వీడన్, డెన్మార్క్, ఐర్లండ్ దేశాల నుండి తరచు రేడియో నాటికలు ప్రసారం కాసాగాయి. రేడియోనాటిక ప్రత్యేక కళారూపంగా ఆవిర్భవించిన తొలిరోజుల్లో రేడియో కార్యక్రమ నిర్వాహకులు సాహిత్యంలో పేరొందిన కావ్యాలనీ, కథలనీ రేడియో నాటికలుగా మలచేవారు. అయితే, సాహిత్యంలోని భాషా, దృశ్యాలూ రేడియోనాటిక రూపంలో పేలవంగా ఉండేవి. దీనితో సాంప్రదాయిక నాటకాలకు దగ్గరగా రేడియో నాటికల్ని రూపొందించడం ప్రారంభించారు. జరిగిన సంఘటనల్ని వ్యాఖ్యాత ద్వారా చెప్పించడమో లేక నటనను రెండు కంఠాలు విశ్లేషించి చెప్పించడమో జరిగేది. ఒక కంఠం ప్రశ్నించడమో, విమర్శించడమో చేయగా, మరొక కంఠం జవాబివ్వడమో సమర్థించుకోవడమో చేసేది.

క్రమక్రమంగా యూరప్ రచయితలు రంగస్థల నాటిక సూత్రాల సంకెళ్ళనుండి విడివడి, రేడియోకోసం స్వేచ్ఛగా రాసే స్థితికి ఎదిగారు. బాహ్య ప్రపంచంనుండి అంతర్గత ప్రపంచానికి దృష్టి మార్చడంతో వారికి ఒక కొత్త శైలి అలవడింది. సమకాలీన సమస్యలూ, యుద్ధాలూ, నేరాలూ, శిక్షలూ, వినూత్న వ్యక్తిత్వం, ఒంటరితనం మొదలైన జీవిత సమస్యల్ని చిత్రించనారంభించారు. దీనివల్ల యూరప్‌లో వచ్చిన రేడియో నాటికలు ప్రజల స్మృతులనూ, స్వప్నాలనూ, ఉద్వేగాలనూ అద్భుతంగా చిత్రించ గలిగాయి. యూరప్ రేడియోనాటిక – యువరచయితలకూ, లబ్ధప్రతిష్ఠులకూ ఒక వేదికగా మారింది. దీనివల్ల యూరప్‌లో ప్రముఖరచయితలంతా దాదాపు రేడియోకి రచనలు చేసినవారే.[23] 'జర్మనీ దేశం'లో రేడియోనాటికలకు అవార్డులను కూడా ప్రవేశపెట్టారు.[24] ఇటువంటి అవార్డులకోసం రచయితలంతా పోటీపడి రచనలు చేశారు.[25] యూరప్‌లో టెలివిజన్ ప్రవేశించినా, రేడియోనాటికల వల్ల ఈ నాటికే ప్రత్యేకంగా రేడియోకి కొందరు శ్రోతలు మిగిలే ఉన్నారు.

## బ్రిటన్ రేడియో నాటిక: తీరుతెన్నులు

బి.బి.సి.లో ప్రసారమైన తొలినాటకం william Shakspeare రాసిన 'Twelfth Night'[26]. అయితే, ఇది ఆయన రాసిన నాటకానికి రేడియో నాటకీకరణ మాత్రమే! అసలైన రేడియో నాటిక 'White Chateau'[27]. ఇదే సంవత్సరంలో 'Wesward Ho'[28]అనే నవల కూడా నాటకీకరణం జరిపి రేడియోలో ప్రసారం చేశారు. క్రమేణా రేడియోనాటిక సాంకేతికాభివృద్ధి సాధించింది. ధ్వని ప్రధానమైన ఆర్కెస్ట్రా, కోరస్, నేపథ్యంలో సంగీతం మొదలైన హంగులేర్పడ్డాయి. వీటన్నింటితో 'The first Kalidoscope'[29]ప్రసారమైంది. దీనిలో మనిషి జీవితాన్ని సాహిత్యకారుల్తో పాటు, సంగీత కారులు కూడా వ్యాఖ్యానించడంవల్ల రేడియోకి అనుగుణంగా మలచే అవకాశం లభించింది.

1923 నుంచి '30 నాటికి-అంటే ఏడేళ్ళలో బి.బి.సి. ఏటా రెండువందల నాటికలు ప్రసారంచేసే ఉన్నత స్థాయి కెదిగింది. ఆనాడు ప్రజలకు రేడియో గొప్పవినోద సాధనం. ప్రజల అభిరుచులకనుగుణంగా వారికి వినోదం కల్గించేందుకు వీలుగా నవలలను నాటకీకరించారు. ప్రయోగాత్మక నాటికల్తో పాటు అపరాధపరిశోధన ప్రధానంగా గల 'థ్రిల్లర్స్'[30]ను కూడా ప్రసారం చేశారు. ప్రసిద్ధ రంగస్థల నాటకాలను కూడా రేడియోకి అనుగుణంగా మార్చారు. యుద్ధ కాలంలో జర్మనీ దాడులతో ఇల్లు కదిలి, బైటకొచ్చే వీల్లేని ప్రజలకు రేడియో నాటికలే వినోదంతో పాటు ధైర్యాన్ని కలిగించేవి.[31] 'The March of the 45'[32] వంటి నాటకాలు సంగీతంతో యుద్ధ కాలపు బీభత్సాన్ని మరిపించి ప్రజలు మనశ్శాంతి పొందేలా చేశాయి. ఈ కోవకు చెందిందే 'Christopher Columbus' [33]. ఇవన్నీ కావ్యాలవంటి నాటికలు. ఇవి కవితాత్మకమైన రేడియో నాటకాలకు మార్గం వేశాయి ఈ కారణంగా 'Christopher Fry'[34] ప్రసారమైంది. రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో, ప్రజాదరణ పొందిన రేడియో నాటిక యుద్ధానంతరం అదే ఆదరంతో బలం పుంజుకొని మరింత వేగం సాధించింది. ఈ వేగవంతమైన అభివృద్ధి దశలో వెలువడిన నాటిక 'The Dark Tower'.[35]

1946 లో - సెప్టెంబర్ 29న 'బి.బి.సి,'Third Programme' అనే ప్రత్యేక కార్యక్రమాన్ని ప్రారంభించింది. అందులో ప్రయోగాత్మక నాటకాల్ని ప్రసారం చేసింది. ఈ కాలం నుంచి వెలువడిన నాటకాల్లో చెప్పుకోదగ్గ నాటకాలు చాలా ఉన్నాయి. ఆ నాటకాల్ని రచించిన రచయితలు కూడా చెప్పుకోదగ్గవారే [36]రంగస్థల నాటక కర్త Samuel Buckett కూడా రాశాడు.[37]

**అమెరికన్ రేడియో నాటిక: తీరుతెన్నులు**

అమెరికన్ రేడియో నాటికలో ఆలోచనల, ఉద్వేగాల పాలు తక్కువ. ప్రజల్ని ఆకర్షించాలని సెక్స్, వ్యాపార ప్రకటనలూ, మతవిశేషాలు ప్రసారం చేసేవారు. దీనితో నాణ్యత, సృజనాత్మకత లోపించాయి. ప్రకటనదారుల వత్తిడివల్లా, ప్రభావం వల్లా, Fantacy, Terror ఇతివృత్తంగా కల నాటికలు మొదట ప్రసారమయ్యాయి.

1930 తర్వాత అమెరికన్ రేడియో నాటిక ప్రముఖ రచయితల దృష్టి నాకర్షించింది. [38]ఎందరో ప్రసిద్ధ రచయితలు రేడియో కోసం నాటికలు రచించారు.[39] ఈ నాటికల్లో సమకాలిక సమాజంపై తీవ్రమైన వ్యాఖ్యలూ, విసుర్లూ కనిపిస్తాయి.[40] 1930లోనే 'H.G. Welles' రాసిన 'War of the Worlds'నాటకీకరణ గొప్ప మలుపుగా పరిణమించింది. అయితే, 'Archibald Macleish' రాసిన 'The Fall of City' శ్రోతలనూ, విమర్శకులనూ అంతగా ఆకట్టుకోలేకపోయింది.[41]

**తెలుగు రేడియో నాటిక**

1938లో మొట్టమొదటి రేడియో నాటిక ముద్దుకృష్ణ రచించిన 'అనార్కలి'.[42]

తర్వాత కాలంలో రేడియోనాటికలు మంచి ప్రాచుర్యంలోకి వచ్చాయి. సంఖ్యలోనే కాక నాణ్యతలో కూడా మంచి నాటికలు రాసిన వారిలో ప్రసిద్ధులు-'కొడవటిగంటి కుటుంబరావు', 'గోరాశాస్త్రి'. 'గోరాశాస్త్రి నాటికల్లో [43] వాస్తవ జీవిత చిత్రణతో పాటు సున్నితమైన హాస్యం కూడా సమ్మిళితమయ్యేది. కుటుంబరావు రచనల్లో సమాజాభ్యుదయ కాంక్ష ఎక్కువగా కనిపిస్తుంది. నేటి తరానికి చెందిన 'యండమూరి వీరేంద్రనాథ్', 'ఆదివిష్ణు' వంటి రచయితలు కూడా రేడియో నాటికల కర్తలే!

అమరేంద్ర రాసిన ఒక వ్యాసంలో [44], రేడియోనాటకాలను నాలుగుతరగతులుగా వర్గీకరించారు. ఇదే వర్గీకరణను రేడియోనాటికలకు కూడా అనువర్తింపజేయవచ్చు. ఆ విధంగా చేసినప్పుడు, పూర్వం ఇనాక్ చేసిన వర్గీకరణ సంఖ్య బాగా తగ్గి మరింత సులభతరం అవుతుంది. ఈ విభజనలో

1. పౌరాణిక నాటికలు
2. చారిత్రక నాటికలు
3. సాంఘిక నాటికలు
4. ఊహా చిత్రాలు - వస్తాయి.

**పౌరాణిక నాటికలు**

పౌరాణిక నాటికలు శ్రోతలను ఎక్కువగా ఆకర్షిస్తాయి.[45] దీనికి కారణం భారత, భాగవతాది కావ్యాలతో వారికి ఎక్కువ పరిచయముండడమే!

**చారిత్రక నాటికలు**

భారతదేశ చరిత్ర, ఆంధ్రదేశ చరిత్రలలో ఎన్నో రసవత్తరమైన ఘట్టాలున్నాయి. వాటిని ఆధారంగా చేసుకొని రేడియోకి అనుగుణంగా మలచిన నాటికలే చారిత్రక నాటికలు[46].

**సాంఘిక నాటికలు**

చదువుకున్న శ్రోతలను బాగా కదిలించి సామాజిక స్పృహ కలిగేలాగా చేసే శక్తి రేడియో నాటికలకి అపారంగా ఉందని గ్రహించిన రచయితలు సాంఘిక నాటికల్ని రచించారు.[47] వారు ఆశించినట్లే ఆ నాటికలు శ్రోతల్ని బాగా ఆలోచింప చేశాయి.

**ఊహాచిత్రాలు**

ఊహాచిత్రాలు అద్భుతమైన శక్తితో భావలోకాల్లో శ్రోతల్ని విహరింపజేస్తాయి. ఈ కోవకి చెందినవి శ్రీ శ్రీ 'అనంతయాత్ర', ఆరుద్ర 'అడిగింది ఒక తల్లి'.

ఈ వర్గీకరణలో చేర్చనివి మునిమాణిక్యం వారి హాస్యరచనలు. ఈ రచనలు ఆయన కథల్లాగే శ్రోతల్ని గిలిగింతలు పెట్టాయి.

"…. పరిధిలో చిన్నవైనా - స్కిట్‌లు, చెణుకులు ప్రత్యేక ప్రయోజనం కలవి. ఇవి పూర్తిగా సమకాలీన సమస్యల మీద వ్యంగ్య ప్రధానంగా, హాస్యప్రధానంగా, కొస మెరుపుతో, చాకుల్లాగా వాడిగా ఉంటాయి. ఇవి కేవలం ఇద్దరు పాత్రల మధ్య సంభాషణలాగా నడిచిపోవు. మూడు నాలుగు పాత్రలు, ఒక చిన్న సన్నివేశం, సమస్య, కొసమెరుపు - మొత్తం టపాకాయ బిగింపుతో ఉంటుంది. పెద్ద నాటకాల కంటే ఇటువంటి అల్పవ్యవధి శ్రవ్యనాటికల రచన, నిర్వహణ కూడ కష్టమే" [48]

--అంటారు ఇంద్రగంటి శ్రీకాంతశర్మ. ఈ వాక్యాలు, పరిధి తక్కువగా ఉండే శ్రవ్య నాటికల రచనలో పాటించవలసిన పద్ధతుల్ని వివరిస్తాయి. అలాగే

"రేడియోనాటిక కేవలం శ్రవణేంద్రియానికి appeal చేస్తూ, రససిద్ధిని కలిగించగలగాలి. శ్రోత ఆలోచనలకు imaginationకు అవకాశం ఇవ్వాలి. ఇందుకు రచయితకు ఉన్న ఆలంబన అల్లా - కేవలం భాష. ఇది చాలా జటిలమైన ప్రక్రియ. పదునైన కత్తి మీద సాము. అయితే రంగస్థలనాటకానికి ఉన్న సౌలభ్యం దీనికి లేక పోవచ్చుగాని, దీనికి ఉన్న range రంగస్థలనాటకానికి రాదు. సహారా ఎడారిలో, బకింగ్‌హామ్ పాలెస్‌లో, పూరిగుడిసెలో, ఊరిపొలిమేరలో, విమానంలో, ప్రేయసి మనసులో, కథానాయకుడి మెదడులో కథని నడపవచ్చు. మనసు తీయగలిగినంత పరుగు, వేగం యిందులో చూడవచ్చు. ఇంత flexibility దృశ్యనాటికకు రాదు . విచిత్రంగా దృశ్యనాటికలో విసుగు కలిగించే Melodrama ఇక్కడ బాగా రాణిస్తుంది. రంగస్థల నాటికలో ఎదురు తిరిగే Dialogue play రేడియో నాటికకు ప్రాణం."[49]

-అంటూ గొల్లపూడి మారుతీరావు రాసిన వాక్యాలు కూడా శ్రవ్యనాటిక ప్రయోగంలో గల పరిధుల్ని వివరించి, వాటి విస్తృతిని వెల్లడిస్తాయి.

'బాలాంత్రపు రజనీకాంతరావు' రేడియోనాటికల చరిత్రలో ఎన్నదగ్గ స్థానాన్ని సంపాదించారు. ఈయన రేడియోనాటికకు ఎల్లలు లేవని రుజువు చేశారు. ఈయన రచించిన 'చండీదాసు'కి, శ్రీ శ్రీ తన అలవాటైన ధోరణిలో 'వాయుపథంలో చండీదాసు' అని వినూత్న నామధేయం ఉంచారు. ఒకరి నాటికలకి కొత్త పేర్లు పెట్టడంతో ఆగిపోని శ్రీ శ్రీ, తను కాలూనడానికి అనువుగా ఉన్న రేడియోనాటికల రంగంపై ప్రవేశించి నిర్విరామంగా రచనలు చేశారు. శ్రీ శ్రీ 'మోహినీ రుక్మాంగద' రేడియోనాటిక రచించగా, అందులో రజనీకాంతరావు బ్రహ్మగా నటించారు.[50]

ఈ అధ్యాయంలో ప్రయోగవాదం, వివిధరకాల వాదాలూ, యూరప్, బ్రిటన్, అమెరికా, తెలుగు రేడియోనాటిక రంగాలను గురించి వివరించాను. అనంతరం, రెండో అధ్యయంలో - శ్రీ శ్రీ కవిత్వంలో ప్రయోగ ప్రియత్వం, రేడియోనాటిక రచనలో ప్రయోగ ప్రియత్వానికి ఎలా రంగాన్ని సిద్ధ పరిచిందో వివరించబోతున్నాను.

అధ్యాయం 2

# శ్రీ శ్రీ కవిత్వం - ప్రయోగ ప్రియత్వం

శ్రీ శ్రీ తన ప్రతి రచనలోనూ ఒక కొత్త ప్రయోగాన్ని చేయాలని, తెలుగు సాహిత్యాన్ని ఆధునిక ఆంగ్ల సాహిత్యంతో సమాంతరంగా నడిపించాలని తపించారు. అందుకే- "సాహిత్యానికైనా, సైన్సుకైనా ప్రయోగపరత్వమే అభివృద్ధికి రాచబాట వేస్తుంది"- అని అన్నారు.[1] చిన్నప్పుడు, ఎనిమిదోఏట కందపద్యం రాసిందగ్గర్నుంచీ, కడపటి రచనవరకూ తమ రచనల స్వరూపాన్ని ఎప్పటికప్పుడు మారుస్తూ వచ్చారు.

శ్రీ శ్రీ చేపట్టిన సాహిత్య ప్రక్రియల్లో రేడియోనాటిక అతని ప్రయోగవాద కాంక్షకు కావలసినంత సంతృప్తిని కలిగించే స్వభావం ఉన్న ప్రక్రియ. అందువల్ల శ్రీ శ్రీ నాటికల ప్రధాన వైశిష్ట్యం ప్రయోగవాదంగా పరిణమించింది. శ్రీ శ్రీని అవగాహనచేసుకోవడానికి భూమికగా శ్రీ శ్రీ సాహిత్యాన్ని క్లుప్తంగాతెలిపి, అందులో ప్రయోగవాద ధోరణికి గల ప్రాధాన్యాన్ని వివరిస్తున్నాను.-

శ్రీ శ్రీ 1920లో అంటే తన పదవ ఏట 'వీరసింహవిజయసింహులు' అనే నవల రాశారు. 1925లో 'పరిణయరహస్యం' అనే నవలఅచ్చయింది. ఆ సంవత్సరంలోనే 'దివ్యలోచనములు' అనే పేరుతో ధృతరాష్ట్రుడు చూసిన విశ్వరూప సందర్శనాన్ని గురించి కొన్ని పద్యాలు రాశారు. శ్రీ శ్రీ ఐదవ ఏట నుంచి, పద్దెనిమిదవ ఏటి లోపల 'స్వకీయపురాణం' అనే గీతమాలిక, 'గోకులాయి' అనే డిటెక్టివ్ నవల, 'సావిత్రి-సత్యవంతుడు' అనే నాటకం రచించారు. [2]

> "అందరిలాగే నడవడం కాకుండా లేని రెక్కలు తెచ్చుకొని స్వంతంగా ఎగరాలనే ఆంతరింగికమైన ఏదో ఉబలాటం నన్నలా లాక్కెళ్ళింది. ఇతరులెవరూ చేయని ఏవో ప్రయోగాల కోసం తహతహ నాకు పసిప్రాయంలోనే ఉంది"[3]

-అని శ్రీ శ్రీ స్వయంగా చెప్పారు. బాల్యం నుంచీ ఆయనలో ప్రయోగవాద బీజాలున్నాయనడానికిది నిదర్శనం.

> "ఈ శతాబ్దపు తొలిపాదంలో జమీందారీ కవిత్వం మీద భావకవిత్వం తిరుగుబాటు చేసింది. చిన్నప్పటి నుంచీ తిరుగుబాటు మనస్తత్వంగల నేను భావకవిత్వాన్ని మనస్ఫూర్తిగా ఆహ్వానించాను [4]" - అని అన్నారు శ్రీ శ్రీ

'శ్రీ శ్రీ లోని తిరుగుబాటు మనస్తత్వమే అతను ప్రయోగవాది కావడానికి దోహదం చేసింది.

శ్రీ శ్రీకి మొదట్నుంచీ కనపడ్డ ప్రతిపుస్తకాన్నీ 'అబ'గా చదివేసే స్వభావం ఉంది. దేశవిదేశాల ప్రఖ్యాతకవుల రచనల్నీ ఆవురావురుమంటూ చదివేసేవారు. ఇందువల్ల ప్రపంచ సాహిత్యపు నడకలు అర్థమై, ప్రపంచంతోపాటు వేగంగా వెళ్ళి పోవాలనే తీరని తృష్ణ ఉండేది. 1930 సంవత్సరం వరకూ స్వంతగొంతుక ఏర్పడకపోయినా, ఆ తర్వాత తనది అనే ముద్ర ఒకటి కనిపించేలా రచనలు గావించగలిగారు. ఫలితంగా 'జయభేరి' అనే మొట్టమొదటి ప్రయోగాత్మక గీతాన్ని 1933లో వెలువరించారు.

"నేను సైతం
ప్రపంచాగ్నికి
సమిధనొక్కటి ఆహుతిచ్చాను"[5]

శ్రీ శ్రీ తెలుగులోని సంస్కృత ప్రయోగాలతో సహా, తెలుగు భాషాప్రయోగం మీద గట్టి అధికారాన్ని అప్పటికే సంపాదించారు. కవిత్వం వాడుక భాషలోనే ఉండాలని నిర్ణయించుకున్నాక గ్రాంథిక భాషకు దాదాపుగా స్వస్తి చెప్పారు. నవ్యతనారాధించే శ్రీ శ్రీ, 'అబ్బూరి రామకృష్ణారావు' ప్రోత్సాహంతో యూరోపియన్ సాహిత్యంలోని కొత్త కొత్త ప్రయోగాలన్నింటితో పాటు, అంతర్జాతీయ దృక్పథాన్ని కూడా, తెలుగు సాహిత్యంలోకి తెచ్చారు. Swineburne, Adgar Allen Poe, Emile Verhaeren, T.S. Eliot మొదలైన అనేక ఆంగ్ల కవుల ప్రభావాలు శ్రీ శ్రీ మీద ఆరోజుల్లో పడ్డాయి.[6]అధివాస్తవికోద్యమం తనని తీవ్రంగా ఆకర్షించిందని చెప్పారు శ్రీ శ్రీ[7]. వస్తు, శిల్పాలకు సమప్రాధాన్యం ఇవ్వాలనే అభిప్రాయాన్ని శ్రీ శ్రీ చాలాచోట్ల చెప్పారు[8]. ప్రయోగవాదంలోని డాడాయిజం, సింబాలిజం, క్యూబిజం, అబ్సర్డిజం, సర్రియలిజం మొదలైన వాదాల్లో శిల్పానికి ప్రాధాన్యం ఎక్కువ. రియలిజంలో అందుకు భిన్నం[9]. కవిత్వంలో వస్తు ప్రాధాన్యత రీజన్, రియాలిటీలు గుర్తించిన నాటినుంచీ వచ్చింది [10]. రూప ప్రధానంగా అనాదినుంచీ శాసించబడిన కవితాతత్త్వం ఇప్పుడు వస్తు ప్రధానంగా మారింది. శ్రీ శ్రీలో ఆ మార్పు 'మహాప్రస్థానం' నుంచి వచ్చింది.[11]

"మహాప్రస్థానం రాసిన తొలి దినాలనుండీ, 35 సంవత్సరాలుగా తెలుగు కవితారూపంలో వచ్చినమార్పు అందరికీ తెలిసిందే. భావం, గుణం, నడక, రీతి, శైలి, శిల్పం - ఈ మాటలకు బదులుగా కవితావస్తువు, పలుకుబడి, విప్లవం, ప్రగతి ఆలోచనా విధానం, ఇజం - అనేవి కవుల వాడుక పదాల్లో వచ్చి చేరాయి" [12]- అని అన్నారు. 'గోపాలచక్రవర్తి'.

ఈ విధంగా తెలుగు సాహిత్యంలో కొందరు ప్రయోగవాదానికి, కొందరు ప్రయోజన వాదానికి మిగిలిపోగా, శ్రీ శ్రీ రెండువాదాల్నీ జీర్ణం చేసుకొని 'యుగకర్త' కాగలిగారు. కవిత్వమైనా, కథైనా, నాటికైనా ఏధోరణిలో చెప్పినా సారాంశం ఒక్కటే.

సాంప్రదాయాన్ని జీర్ణించుకొని, సామాన్య ప్రజానీకం కోసం శ్రీ శ్రీ రచనలు చేయడం వలన 'సామాజిక ప్రయోజనమే తన రచనోద్దేశం'అంటారు.

"కవిత్వానికి సామాజిక ప్రయోజనం ఉందని భావిస్తూ అదే ధ్యేయంగా కవితాయాత్ర సాగిస్తా"[13] అని శ్రీ శ్రీ స్వయంగా చెప్పారు. 'స్వప్రయోజనం కోసం ఆత్మవంచన చేసుకోలేన'ని కూడా చెప్పారు.[14]

## శ్రీ శ్రీ కవిత్వం – విదూషకతత్వంః

"విదూషకుడి Temperament
ఏదో ఒక Discontent
బ్రదుకుతో Experiment
పదాలు Patent రసాలు Torent
సదసత్సమస్యకి Solvent శ్రీ శ్రీ giant"[15]

– అనే Self Portrait సరదాకే రాసినా, శ్రీ శ్రీ వ్యక్తిత్వానికి స్పష్టంగా అద్దపడుతుంది. శ్రీ శ్రీ విదూషకుడి Temperament అతని సాహిత్యంలో ఎక్కువగా చోటు చేసుకుంది. ముఖ్యంగా 'ఖడ్గసృష్టి', 'సిప్రాలి', 'చరమరాత్రి' లలో ఈ విదూషకుడి ధోరణి ఎక్కువగా కనిపిస్తుంది. కొన్ని రేడియో నాటికల్లో కూడా ఈ ధోరణి ఉంది. ఉదాహరణకి 'విదూషకుడి ఆత్మహత్య'.

గురజాడ 'కన్యాశుల్కం', పికాసో చిత్రించిన 'గుయెర్నికా', ఛార్లెస్ డికెన్స్ నవలలు, 'చార్లీ చాప్లిన్' సినిమాలు వీటన్నింటిలో పైపైన కడుపుబ్బ నవ్వించే హాస్యం ఉన్నా, తరచిచూసే కొద్దీ 'మన సమాజం ఇలా ఉంది' అనే భయంకరమైన వాస్తవికతను పట్టి చూపించే బీభత్సరస ప్రధానమైన విషాదం ఉంటుందని శ్రీ శ్రీ అనేక సార్లు చెప్పారు.[16] విప్లవ సాహిత్యం విజృంభిస్తున్న రోజుల్లో శ్రీ శ్రీ విదూషక సాహిత్యం ప్రచురించారు. ఎందుకంటే–

> "ఇది విదూషక సాహిత్యం" అని మొదటే ఉగ్గడించాను. అయితే కేవలం నవ్వించడానికి మాత్రమే వీటిని రాయలేదు నేను. పత్రికా ప్రపంచంలో కార్టూనులు నిర్వహించే విధిని ఈ కవిత్వం ద్వారా నేను సాధించదలచుకున్నాను. ......నా ఆదర్శం వేమనః అతని కవిత్వంలో కూడాహాస్యం ఉంది. దానితోపాటు సెటైర్, నీతి, ఉపదేశం ఇవన్నీ ఉన్నాయి.Rabclais, Rousseau, Voltaire మొదలగువారి నిశిత హాస్యరచనలే ఫ్రెంచి విప్లవానికి ప్రేరక శక్తులుగా పనిచేశాయన్న నిజాన్ని మనం మరిచిపోకూడదు"[17]

– అని శ్రీ శ్రీ సమాధానం ఇస్తున్నారు.

శ్రీ శ్రీలోని Discontent విషయానికొస్తే, అది అతని రచనల్లో ఎన్నోచోట్ల కనపడుతుంది. తాను చాలా సార్లు మృత్యుగేహళిలోకి ప్రవేశించడాన్ని గురించి శ్రీ శ్రీ

అనేక సందర్భాల్లో ప్రస్తావించారు. 'మేమే' అనే 'సిప్రాలి' లోని గేయంలో "... మృత్యువు పెరట్లో మందారపువ్వులం.[18]" అనడమే కాక, "మూడుసార్లు మృత్యువుతో పోరాడిగెలిచాను".[19] అనే మాటల్నిబట్టి 'మృత్యువుతో నా మూడో యుద్ధం' అనే శీర్షికని బట్టి శ్రీ శ్రీ జీవిస్తున్నా, నిరంతరం మృత్యువుతో పోరాడుతున్నట్లు ఫీలయ్యేవారనీ, మృత్యువు గురించి పరిపరి విధాల ఆలోచించే వారనీ తెలుస్తుంది.[20]"

'సదసత్సంశయం' లో దేవుని గురించీ, మృత్యువు గురించీ ఎన్నెన్నో సందేహాలను వ్యక్తంచేశారు శ్రీ శ్రీ.[21]

"ఈ సృష్టికి ఏమర్థం
మానవునికి గమ్యమేది
ఒక సకలాతీతశక్తి
ఉన్నట్టా లేనట్టా."[22]

ఇది మాత్రం నేనెరుగుదు
నెంతమంది యేమన్నా
తథ్యం ప్రాణికి మృత్యువు
తప్పదు జీవికి వేదన."[23]

మనుజానిలో మరణభీతి
మదిలో దుఃఖానుభూతి
ఆలోచనలన్నిటికీ
ఆంతర్యంలలో పునాది."[24]

శ్రీ శ్రీ కవితల్లో లాగే, రేడియో నాటికల్లో కూడా కాలానికి, దేవుడికి, మృత్యువుతో పోరాటానికి ఎంతో ప్రాముఖ్యమిచ్చారు

'సాహిత్యరచన : ప్రక్రియలు' అనేవ్యాసంలో
"సాహిత్యంలో ప్రయోగాత్మకమైన ప్రక్రియలు చేసి
చూపించేవారు ఏరీ, ఏరీ, ఎక్కడ, ఎక్కడ అని
వెతుక్కోవలసి వస్తోంది.

సైన్సుకి ప్రయోగమే ప్రాణం అని అందరూ గుర్తిస్తారు. కాని ఈ సత్యం, ఈ సూత్రం సాహిత్యానికి కూడా వర్తిస్తుందని గుర్తిస్తున్నవారు చాల తక్కువ సంఖ్యలో ఉన్నారు. నిత్యనూతన ప్రయోగాల వల్లనే సాహిత్యం కూడా సైన్సులాగే అభివృద్ధి చెందుతుంది.పాత ప్రక్రియలనే.పట్టుకు కూర్చుంటే సైన్సయినా సాహిత్యమయినా స్తంభించి పోక తప్పదు."[25]

- అని తనకు సాహిత్యంల్సో, సైన్సులో లాగే ప్రయోగాలు చేసే ధోరణి ఎలా అలవాటైందో స్పష్టం చేశారు శ్రీ శ్రీ.

ఇక నూతన ప్రక్రియల విషయానికొస్తే, సినీరచనలో కంటే రేడియో రచనలో ప్రయోగాలు చేసే వీలు ఎక్కువగా ఉందని చెప్పారు. ప్రయోగవాదానికి ఊపునిచ్చిన యంత్రపరికరాల్లో రేడియో ఒకటి. ఇదే విషయాన్ని ప్రస్తావిస్తూ-"…. ఇందులో ఎన్నో ప్రయోగాలు చేయడానికి అవకాశం ఉంది. రేడియోనాటిక ఒక సరికొత్త రచనాప్రక్రియ. శ్రవ్యకావ్యం అనే నిర్వచనానికి అన్నివిధాలా సరిపోతుంది రేడియోనాటిక. అటువంటి నాటికలు ఈనాడు అన్ని భాషల్లోనూ అసంఖ్యాకంగా వెలువడుతున్నాయి, ముఖ్యంగా తెలుగుభాషలో"[26]

-అని శ్రీ శ్రీ అన్నారు. శ్రవ్యకావ్య ప్రయోగాలు చేయడానికి ఎక్కువ అనువుగా ఉంటుందని, రేడియోనాటికా ప్రక్రియని ఎంచుకున్నారాయన.

## శ్రీ శ్రీ కవిత్వం – మనో విశ్లేషణాత్మక పరిశీలన:

శ్రీ శ్రీ కవిత్వంలో గుర్తించవలసిన మరొక మౌలిక లక్షణం 'మనస్తత్వ విశ్లేషణ'.

యూరప్‌లో జరుగుతున్న ప్రయోగాల పట్ల స్పష్టమైన అవగాహన కలిగిన శ్రీ శ్రీకి, ఫ్రాయిడ్, యూంగ్‌మొదలైనవారి మనోవిశ్లేషణ సిద్ధాంతాల పట్ల కూడా లోతైన అవగాహన ఉంది. వీటి ప్రభావంతో వచ్చిన అధివాస్తవిక, అస్తిత్వ వాదాల వంటి వాటి గురించి శ్రీ శ్రీ అనేక సందర్భాల్లో, వివిధ వ్యాసాల్లో చర్చించారు.[27] ఈ సిద్ధాంతాల ప్రభావం శ్రీ శ్రీ మీద ఎంతగా పనిచేసిందంటే 'చరమరాత్రి'లో, ఒక కథను "నేను కథరాయడంలేదు. కలరాస్తున్నాను"- అంటూ ప్రారంభిస్తారు.[28] శ్రీ శ్రీకి 'మానవుడి సమస్యలన్నిట్లోకీ, మానసిక సమస్యలు మౌలికమైనవి' అనే అభిప్రాయం ఉంది.' మానవుడు ఆర్థిక, రాజకీయ విజయాలు సాధించినప్పటికీ, మానసిక సమస్యలతన్ని వేధిస్తూనే ఉంటాయ'ని 'చతురస్రం' నాటికలో శ్రీ శ్రీ జోస్యం చెప్పారు.[29] శ్రీ శ్రీ 'చరమరాత్రి' కథానికల్లోనూ, రేడియోనాటికల్లోనూ స్వాప్నిక వాతావరణాన్ని మనోవిశ్లేషణ షిద్ధాంతపు ప్రభావం వల్లనే సృష్టించారు.

## శ్రీ శ్రీ వివిధ సాహిత్య ప్రక్రియలు: వస్తుసంవిధానం:

శ్రీ శ్రీ కవితలు చదివినా, కథలు చదివినా, నాటికలు చదివినా ఒక విచిత్రమైన, స్వాప్నికమైన, అధివాస్తవిక ప్రపంచం కళ్ళకు కడుతుంది. 'మహాప్రస్థానం'లో 'బాటసారి', 'భిక్షువర్షీయసి' గేయాలున్నాయి.[30] ఇవి కథలనిపిస్తాయి. ' ఒంటరిబావి' 'భూతాల కొలిమి' వంటి రేడియోనాటికలు గేయాలో, కథలో చెప్పడానికి వీల్లేనట్లుగా ఉంటాయి. శ్రీ శ్రీ చిన్నప్పుడు డిటెక్టివ్ కథల్ని, బేతాళకథల్ని రాశారు. వాటిల్లో దొంగల గుహల్ని, పిశాచాలలోకాల్ని, భూతాల్ని, మాంత్రికుల్ని సృష్టించారు. ఊహాలోకాల్లోకి తనవెంట పాఠకుల్ని కూడా పయనం కట్టించారు. శ్రీ శ్రీ కవితల్లో భూతాలూ, పిశాచాలూ, పిశాచాల నృత్యం, కంకాళాల నాట్యం వంటి భావ చిత్రాలు పదేపదే

పునరావృతమవుతుంటాయి. ఉదాహరణకు

" ఎవరో
ఎవరెవరో, ఎవరెవరో
తలవిరబోసుకు
నగ్నంగా నర్తిస్తున్నారు: భయో
ద్విగ్నంగా వర్తిస్తున్నారు."[31]

మంత్రనగరి సరిహద్దులు ముట్టకు". [32]- మొదలగునవి.

రేడియో నాటికల్లో భయానకమైన వాతావరణాన్ని సృష్టిస్తూ, పద చిత్రాల ద్వారా శ్రోతల మస్తిష్కంలో విచిత్ర లోకాల్ని సృష్టించడం ప్రధాన లక్ష్యం చేసుకున్నారు శ్రీ శ్రీ. ఇందుకు ప్రబల నిదర్శనాలు 'భూతాలకొలిమి', 'ఒంటరిబావి'.

"పోవాలి చేరగా భూతాల కొలిమి
సందు చివరా ఉన్న భూతాలకొలిమి".[33]

"నోరావులించి
ఊరికి దూరాన పొంచి
నీరింకిపోయి నిలుచుందొక ఒంటరి బావి:
దారుణమ్మైన కథలున్నవి దాని గురించి:
చెప్పనా, చెప్పనా ఆ బావి గురించి?
విప్పనా, విప్పనా నా విషాల సంచి?" [34]

-ఇలాంటి ఉదాహరణలను శ్రీ శ్రీ రచనల్లోంచి ఎన్నైనా ఇవ్వచ్చు.

కథలైనా, కవిత్వమైనా, రేడియోనాటికలైనా- ఏ ప్రక్రియ అయినా దాన్ని కవిత్వమయం చేసి, కవిత్వాభిముఖంగా నడిపంచడం శ్రీ శ్రీ సాధించిన ప్రత్యేకత. వ్యాసానికీ- కవిత్వానికీ, కథకీ-కవిత్వానికీ, నాటికకీ- కవిత్వానికీ మధ్య ఉన్న రేఖల్ని చెరిపేసి అన్ని ప్రక్రియల్నీ చివరికి రేడియో నాటికలతో సహా 'రూపం మార్చుకున్న కవితలేమో?' అనిపించేటట్లు నిర్వహించడం శ్రీ శ్రీ వైశిష్ట్యం.

అధివాస్తవికతలాంటి వాదాల ప్రభావం వల్ల కానీ, ఇతర కారణాలవల్ల కానీ, పాశ్చాత్య దేశాల్లోని ప్రయోగవాద రచనలన్నింటిలోనూ విచిత్ర వాతావరణ కల్పనకు ప్రాధాన్యం ఎక్కువ. ఊహాబలానికీ, సృజనాత్మకతకీ ప్రాధాన్యం ఉండడంవల్ల అన్ని ప్రక్రియలూ కవిత్వం దిశగా నడవడం జరిగింది. ముఖ్యంగా రేడియోనాటికలు గేయాలతో నిండిపోవడం వల్ల నాటికారూపంలో ఉన్న కవితలేమో అనిపించేటట్లు తయారయ్యాయి.

ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన రేడియోనాటిక కర్త లూయీ మెక్నీస్ (Louis Mecniece)రేడియోనాటికా రచయితకు ఉండవలసిన ముఖ్యలక్షణాలనిలా చెప్పాడు-

" For man, we should always remember, is born poetic,

Hence the predominance of nursery rhymes in the nursery and of poetry in all early literatures. Poetry, in this one sense at least, is more Primitive than prose; it was easier on the ear and less strain upon the mind. That is why radio drama -not because the medium is new but because of its Primitive audience-might reasonably be expected to demand a Poet's approach"[35]

-'రేడియో నాటికకర్తకి ఉండవలసిన ముఖ్యలక్షణం కవిత్వం రాయగలగడం' అని మెక్నీసు చెప్పిన ప్రధాన లక్షణం శ్రీ శ్రీ ప్రవృత్తిలో ఉంది. ఈ లక్షణాన్ని పూర్తిగా పుణికి పుచ్చుకొని, రేడియోనాటికల Alchemy లోని ఈ రహస్యాన్ని పట్టేసుకొని, పూర్తిగా తన రచనలకు అనువర్తింపజేసిన ఘనత శ్రీ శ్రీకి దక్కుతుంది. దేశ విదేశాల కవిత్వాలు, spencer మొదలు Joice వరకూ చదివి, అన్ని పోకడలూ తెలుసుకొని, ఆపై రేడియోనాటికలు రాశారు శ్రీ శ్రీ.

శ్రీ శ్రీ సాహిత్యవ్యక్తిత్వంలో, అంతర్జాతీయ దృష్టి, ఆధునిక జీవితం మానవునిలో తెస్తున్న పరిణామాల పట్ల స్పృహ, తాత్త్విక గవేషణ, మనోవిశ్లేషణకు ప్రాధాన్యతనివ్వడం-- చోటు చేసుకున్నాయి. ఇవన్నీ శ్రీ శ్రీ గొప్ప ప్రయోగశీలి అయ్యేందుకు కారణాలని గమనిస్తే, రేడియోనాటికలను పరిశీలించడానికి వలసిన భూమిక లభిస్తుంది..

అధ్యాయం 3

# శ్రీ శ్రీ రేడియో నాటికలు వస్తువు-భూమిక

శ్రీ శ్రీ నాటికలన్నీ ఒక కొత్త వస్తువు, ఒక కొత్త భావం, మరెంతో కొత్త శిల్పంతో మలచబడ్డాయి. ఆ కొత్తదనం ఏమిటో, ఆ ప్రయోగం ఏమిటో అర్థం చేసుకోవాలంటే, ఆ నాటికల్లో విషయం అర్థం చేసుకోవడం ముఖ్యం. మొదటిసారి ఒక్కొక్క నాటికనూ రేడియోలో విన్నప్పుడు గానీ, చదివినప్పుడు గానీ వాటిల్లోని విషయం సొంతం అర్థంకాదు. సరికదా, కొంతైనా అర్థం కావడం కష్టమే. అయితే, శ్రీ శ్రీ స్వయంగా 'చరమరాత్రి' కథల సంపుటిలో, ఇతర వ్యాసాల్లో చేసిన వివరణలు కొంతవరకు ఈ నాటికల్లోని విషయం అర్థం చేసుకోవడానికి ఉపకరిస్తాయి.

1. చతురస్రం
2. గవేషణ
3. అనంతయాత్ర
4. సుప్తాస్థికలు
5. విదూషకుడి ఆత్మహత్య
6. గ్రామఫోను రికార్డుల తిరుగుబాటు
7. గుమాస్తాకల
8. ఒంటరి బావి
9. భూతాల కొలిమి
10. బలి
11. మరోప్రపంచం
12. స్వామి - భూస్వామి.
13. దడిగాడువానసిరా

ఈ పదమూడు నాటికలూ కాక ' శ్రీ శ్రీ సాహిత్యం' మొదటి, రెండు వచనవిభాగాల్లో-

1. యుద్ధం-యుద్ధం-యుద్ధం
2. భాగ్యలక్ష్మి
3. జడభరతుడు

4. చెప్పని సందేశం

5. శిరస్సు చెప్పిన రహస్యం

6. కాక్కారాక్కో.

-అనే నాటికలున్నాయి. ఇవికాక 'ముట్టడి' అనే రేడియో నాటిక కూడా శ్రీ శ్రీ రచించారు. అది అముద్రితంగా ఉంది".[1] 'కృష్ణ- కృష్ణ' అనే నాటికను రచించినట్లు తెలుస్తోంది.[2] 'మోహిని · రుక్మాంగద' అనే నాటికను కూడా శ్రీ శ్రీ రచించారని, అది కాలగర్భంలో కలిసిపోయిందని బాలాంత్రపు రజనీకాంతరావు చెప్పారు.[3]

శ్రీ శ్రీ రేడియోనాటికల్ని అద్దేపల్లి రామమోహనరావు, టి. సత్యనారాయణ ఒకే విధంగా వర్గీకరించారు.[4] అయితే, వీరు రెండవ ప్రచురణలోని నాటికలని మాత్రమే వర్గీకరించడం వల్లా, ఆ వర్గీకరణలో కూడా ఎక్కువ సౌలభ్యం లేకపోవడం వల్లా మొత్తం నాటికల్ని ఈ విధంగా విభజిస్తున్నాను--

1. చతురస్రం

2. మరోప్రపంచం

3. అనంత యాత్ర

4. గవేషణ

- ఇవి మానవుడి భవిష్యత్తుని గురించిన ఊహలకు సంబంధించినవి. ఈ నాటికలకి శ్రీ శ్రీ కాలాన్ని ప్రాతిపదికగా తీసుకున్నారు.

1. ఒంటరి బావి

2. భూతాల కొలిమి

- ఇవి చావు, శ్మశానాలకు సంబంధించిన మంత్ర, తంత్ర వాతావరణం కలవి.

1. సుప్తాస్థికలు

-ఈ నాటికలో కూడా చావుకీ, శ్మశానానికి సంబంధించిన వాతావరణమే ఉంది. అయితే, విషయం మాత్రం గాంధీమహాత్ముడి స్మృతికి సంబంధించినదవడం వల్ల రచన భిన్నంగా సాగుతుంది.

1. విదూషకుడి ఆత్మహత్య

2. గుమాస్తా కల

3. శిరస్సు చెప్పిన రహస్యం

-ఇవి సమాజంలోని బాధా సర్పదష్టుల జీవిత చిత్రాలను చూపిస్తాయి. ఇవి ఎక్కువగా చైతన్య స్రవంతి పద్ధతిని ఆశ్రయించుకున్నాయి.

1. గ్రామఫోను రికార్డుల తిరుగుబాటు

--ఇది సంగీతం లాంటి లలిత కళల్లో ఉండవలసిన స్వేచ్ఛా, నవ్యతలను గురించి ప్రతిపాదిస్తుంది.

1. బలి.

-ఇది ప్రాచీనమైన పురాణకథకు వినూత్న వ్యాఖ్యానం చేస్తుంది.

1. దడిగాడువానసిరా

-చిత్ర సీమలో కవి, డైరెక్టర్, నాయకుడు మొదలైనవారి ప్రవృత్తులకు దర్పణం పడుతుంది.

1. స్వామి - భూస్వామి.

- సాంఘిక దురాచారాలకు సంబంధించిన సాంఘిక ఇతివృత్తం గలది.

1. చరిత్ర చెప్పని సందేశం

-మహాప్రస్థానాంతర్గత 'దేశచరిత్రలు' గేయానికి నాటకీకరణ

1. జడభరతుడు

-సమాజంలో కవిస్థానాన్ని గురించి విశదపరుస్తుంది.

**మానవ భవిష్యత్తూ, కాలం, ప్రాతిపదికగాగల నాటికలు:**

**చతురస్రం:**

**ఇతివృత్తం:**

1999, డిసెంబరు 31వ తేదీన ఈ నాటికలో కథ ప్రాంభమౌతుంది. చంద్రలోకం నుంచి మానవుడు తెచ్చిన అమృతాన్ని ప్రపంచ ప్రజలందరికీ పంచాలని ఐక్యరాజ్యసమితి నిశ్చయిస్తుంది. ఈ సమావేశంలో బ్రిటన్, అమెరికా వంటి దేశాలు ఆ ప్రయత్నాన్ని నిరోధిస్తాయి. ఆఫ్రో-ఆసియన్ రాజ్యాల తరఫున లుముంబాజూనియర్ ప్రతిపాదించిన తీర్మానం నెగ్గి అమృతాన్ని పంచ నిశ్చయించింది ఐక్యరాజ్యసమితి.

ప్రపంచ ఆరోగ్యసంస్థనుంచి డాక్టర్ వచ్చి ఇంజెక్షన్ల రూపంలో, టాబ్లెట్ల రూపంలో --వివిధప్రాయాలు గల జ్ఞానం, రాజ్యం, సిరి, కళలనే వ్యక్తులకు -అమృతం ఇచ్చి వెళతాడు. అందరూ ముప్పై ఏళ్ళ వాళ్ళైపోతారు. వాళ్ళలో గొడవ మొదలౌతుంది.డెబ్బై ఏళ్ళ వృద్ధుడు జ్ఞానం యువకుడవగా, పదేళ్ళకళ యువతి అవుతుంది. జ్ఞానం రాజ్యాన్ని కాదని కళని పెళ్ళాడబోగా, కవి కూడా కళనే పెళ్ళాడతానంటాడు. జ్ఞానం రాజ్యాన్ని చేసుకోమని, కవికి సలహా ఇవ్వగా ఆమె పెళ్ళికి పెడమొఖం పెడుతుంది. కళ, జ్ఞానాన్ని నిరాకరిస్తుంది. ఈ రభసలో ఒక స్త్రీ అవతరించి, తానే దైవాన్నీ, సత్యాన్నీ అంటుంది. కవి ఆ స్త్రీతో సంభాషిస్తూ, 'రెండు ఖడ్గాలు' అనే సుదీర్ఘ కవిత వినిపిస్తాడు.

**విశ్లేషణ:**

శ్రీ శ్రీకి మానవుడి భవిష్యత్తు గురించిన ఆరాటం అధికం. 'మహాప్రస్థానం' లోని వివిధ రచనల్లో ఒకచోట-

"నిజంగానే నిఖిలలోకం
నిండుహర్షం వహిస్తుందా?"

-- అని ప్రశ్నిస్తారు.[5] మరోచోట--

"....స్వాతంత్ర్యం,
సమభావం,
సౌభ్రాత్రం
సౌహార్దం
పునాదులై ఇళ్ళులేచి,
జనావళి శుభంపూచి-
శాంతి, శాంతి, శాంతి, శాంతి
జగమంతా జయిస్తుంది,
ఈ స్వప్నం నిజమవుతుంది
ఈ స్వర్గం ఋజువవుతుంది!"

-అంటూ మానవాళికి ఆస్వాసాన్ని కలిగిస్తారు.[6] భావిప్రపంచాన్ని గురించి శ్రీ శ్రీకి ఉన్న భావాలలో కేవలం మార్క్సిజమే కాక, ఐన్‌స్టీన్ సాపేక్షతా సిద్ధాంతం వల్ల, కాలం పట్ల ఏర్పడిన వినూత్నావగాహన కూడా చోటు చేసుకుంది. ఆర్.ఎస్.సుదర్శనం, 'ఆధునిక సాహిత్యంలో కాలం' అనే వ్యాసంలో ఐన్‌స్టీన్ భావాలు సాహిత్యంపై వాటి ప్రభావాలను గురించి చర్చించారు. అంతేగాక తెలుగు సాహిత్యానికి సంబంధించినంతవరకు కాలంపట్ల ఏర్పడ్డ ఈ వినూత్న భావాలు శ్రీ శ్రీ రచించిన 'చతురస్రం' నాటికలో ఉన్నాయంటూ వ్యాఖ్యానించారు.[7]

ఆర్.ఎస్. సుదర్శనమే కాలాన్ని జయించడానికి సంబంధించిన పాశ్చాత్యసాహిత్యాన్ని గురించి కొంత చెప్పారు.[8]

శ్రీ శ్రీ 'చతురస్రం' గురించి అవగాహన చేసుకోవడానికి, కాలాన్ని గురించిన సిద్ధాంతాలూ, పాశ్చాత్య సాహిత్యం తెలుసుకొని ఉండడం అవసరం. చతురస్రం నాటికలోని విషయమే 'చరమరాత్రి' అనేకథలో ఉంది. రేడియోనాటికల సంపుటికి, '1+1=1' అనే శీర్షికనూ, కథల సంపుటికి 'చరమరాత్రి' అనే శీర్షికనూ పెట్టడాన్ని బట్టి శ్రీ శ్రీ వీటికెంత ప్రాముఖ్యమిచ్చారో గ్రహించవచ్చు. శ్రీ శ్రీ 'చతురస్రం' నాటికలో ధ్వని మాత్రంగా చెప్పిన అనేక విషయాలని 'చరమరాత్రి'లో అతి స్పష్టంగా వాచ్యం చేశారు. ఎందరో ఆధునిక ప్రపంచ రచయితలు స్వీకరించిన 'కాలాన్ని జయించడం' అనే వస్తువునే తీసుకొని, దాన్ని ఈశ్వరవాద- నిరీశ్వరవాదాలతోనూ, మానవుడి భవిష్యత్తుతోనూ ముడి పెట్టారు.[9] 'చతురస్రం' నాటికను ప్రారంభిస్తూ--

"చతురస్రం" నాటిక ఎప్పుడో నేను వ్రాయవలసింది. భగవంతుని గురించీ, మానవుని గురించీ నాకున్న అభిప్రాయాలను ఈ నాటిక ద్వారా కొంతలో కొంతయినా తెలియజేయగలిగినాననినేననుకుంటున్నాను. శ్రీ శ్రీని నిరీశ్వరవాదిగా చిత్రించేవారు కొందరున్నారని నాకు తెలుసు. అలాంటివారినే నేను ముఖ్యంగా ఈ నాటికను శ్రద్ధగా చదవండని కోరుతున్నాను. .......

ఎప్పటికైనా మానవుడు మరణంమీద విజయం సాధిస్తాడనే నమ్మకం నాకుంది. ఆ నమ్మకమే ఈ నాటికా రచనకు ఆధారం"[10]. --

-అన్నారు . 'చతురస్రం' అనే రేడియో నాటికకే శ్రీ శ్రీ పెట్టిన మరోపేరు "1+1=1". ఈ '1+1=1' అనే దాని అర్థాన్ని శ్రీ శ్రీ 'చరమరాత్రి' అనే కథలో స్వయంగా వివరించారిలా--

"అంచుల దగ్గర అంతా యాదృచ్ఛికమే.............

(ఔను-కాదు)+(మంచి-చెడ్డ)-(వెలుగు-చీకటి)+(చావు-బతుకు).....=?

ఈ లెక్కని ఎందరు ఎన్నిమార్లు చేస్తే అన్ని జవాబులువస్తాయి. అందుకే ఎవరి ఆవరణల మధ్య వాళ్ళుఇమిడిపోతారు. తమకు వెలపల ఉన్న సంజ్ఞఏమిటో కూడా వాళ్ళకి తెలియదు. అన్ని ఆవరణలకీవెలపల ఏ సంజ్ఞ ఉందో అసలే తెలియదు.

మొత్తంమీద ఈ లెక్కకి జవాబు సున్నా అనిగాని, ఒకటి అనిగాని, రెండు అనిగాని నిర్ధారణగా ఎవరూ చెప్పలేరు.

-(1+1) = -2

+(1+1) = +2 అని లెక్క చేసి ద్వైతులు రెండంటారు.

-(1-1) = 0

+(1-1) = 0 అని లెక్క చేసి, మిధ్యావాదులు సున్నా అంటారు. నేనొకణ్ణే ఏ తర్కానికీ లొంగకుండా, వెలుపలి సంజ్ఞ ఏదయినా లక్ష్య పెట్టకుండా

1-1 = 1

1+1 = 1, అని అనడం మానలేను.

అంటే దీని అర్థం; ఔను/కాదు. మంచి/చెడ్డ. వెలుగు/చీకటి, చావు/బతుకు, మనిషి/దేవుడు, అంతా ఒకటే అని. ఇందుమూలంగా శూన్యంమీదనూ, అనేకం మీదనూ ఏకానికి గల ఆధిక్యాన్ని ఉగ్గడిస్తున్నాను. ఈ ఏకం ఎవరో కాదు మానవుడు. అతడే సత్యం. అతడే నిత్యం అతడే ఈశ్వరుడు." [11]

'చతురస్రం' అనే పదానికి వివరణను కొంత ఈ నాటికలో ఇస్తే, 'చరమరాత్రి' మరికొంత ఇచ్చారు శ్రీ శ్రీ. 'చతురస్రంలో రష్యా ప్రతినిధి చేత'--

"సృష్టి సమాంతర రేఖలలో ప్రవహిస్తుందని నేటి వైజ్ఞానికులలో కొందరంటున్నారు. ఇది ఐన్‌స్టీన్ సిద్ధాంతానికి విరుద్ధమని కొందరంటున్నారు. .....మానవ మనస్సులో అనేక చతురస్రాలున్నాయి. రెండేసి రెండేసి సమాంతర రేఖలు నిలువుగా ప్రవహిస్తున్నాయనుకోండి. అప్పుడు వాటి మధ్య ఎన్నో చతురస్రాలు ఏర్పడతాయి కదా. అయితే ఇవి స్క్వేరులా రెక్టాంగిల్సా? సమబాహు చతురస్రాలా? విషమబాహు చతురస్రాలా? యీ చతురస్రాల సమస్యలను పరిష్కరించడం ద్వారాకూడా ప్రజలందరికీ

అమృతాన్ని పంచిపెట్టవలసిందే. ప్రస్తుత ప్రపంచస్థితిలో ఇవి రెక్టాంగిల్స్ అనే నేననుకుంటున్నాను. ప్రవహిస్తున్న, అడ్డం నిలువు సమానాంతర రేఖలుగా కాలాన్ని నేను భావిస్తున్నాను. మానవుడు టైమ్‌ని స్క్వేర్ చెయ్యాలి."[12]

--అని అంటారు - 'చరమరాత్రి'లో కూడా

"ఇదేం ఇలా కరిగిపోతున్నాను. సరిహద్దులు దాటిపోతున్నాను. ఎన్ని నిచ్చెనలో! అడ్డుగా, నిలువుగా, గళ్ళు గళ్ళుగా, పరిగెత్తుతున్న జామెట్రీ. కలుసుకుంటున్న సమాంతరరేఖలు! సముద్రాకాశాల సంగీతం. జ్ఞాపకాలతో స్వప్నాలు కలిసి చేసే నాట్యం. నిరీశ్వర సాక్షాత్కారం!"[13]

--అని అంటారు. మానవుడు కాలాన్ని జయించడమనేది 1990వ సంవత్సరం, డిసెంబరు 31వ తేదీ నాటికి సాధ్యమవుతుందన్నట్లుగా కల్పించారు శ్రీ శ్రీ. సరిగ్గా ఆ సంవత్సరమే కాకపోయినా, ఎప్పటికైనా మానవుడు ఆ స్థితిని సాధిస్తాడనేది శ్రీ శ్రీ విశ్వాసం అని స్పష్టంగా తెలుస్తుంది, ఈ నాటికవల్ల.[14]

సైన్స్, టెక్నాలజీ సాధించిన, సాధిస్తున్న అద్భుత విజయాలను చూస్తే శ్రీ శ్రీకి, అవి కాలాన్ని జయించడానికి కావలసిన అమృతం లాంటిదాన్ని దేన్నో కనుక్కోవడానికి మానవుడికి తోడ్పడతాయనే నమ్మకాన్ని కల్గించాయనిపిస్తుంది. ఈ నమ్మకాన్ని చంద్రుడి మీదకి దిగగల్గిన మానవుడు, అక్కడి అమృతాన్ని నేలమీదికి తీసుకొస్తాడనే కవితాత్మక ఊహతో ముడిపెడతాడు. అమృతాన్ని త్వరత్వరగా ప్రపంచానికంతటికీ పంపిణీ చేయడానికి ప్రపంచ ఆరోగ్యసంస్థ (World Health Organisation)లాంటి సంస్థలున్నాయని, టాబ్లెట్ల ద్వారా, ఇంజెక్షన్ల ద్వారా అమృతాన్ని మనిషికందించే వీలుందనీ అద్భుతమైన ఊహలు చేస్తారు శ్రీ శ్రీ. ఇవి ఊహలని శ్రీ శ్రీ కన్పించవు. అందుకే నాటికలో' ఒకచోట" కరెక్టుగా గెస్ చెయ్యడమే కవిత్వం" అని అనిపిస్తారు.[15]

శ్రీ శ్రీ ఇదే అభిప్రాయాన్ని, కవిత్వం గురించి రాసిన ఒక వ్యాసంలో ఇలా చెప్పారు-

"అనేక విధాల క్షణక్షణ పరిణామం పొందుతున్న ప్రపంచానికి కళాశీలురే పురోగాములు. వీరి దృష్టిలో ప్రజ్వరిల్లిన ఆదర్శలోకమే కాలక్రమాన భౌతిక లోకంలో రూపు కడుతుంది. నిజమైన తిరుగుబాటు కళాప్రపంచంలోనే వస్తుంది. రాజకీయవాదులు తర్వాత వీటినే ప్రచారం చేసి నూతన రాజ్యం స్థాపించామంటారు. కవి దర్శించిన నేటి కలలే రేపటి యదార్థాలవడాన్ని మనం గమనిస్తూనే ఉన్నాం"[16]

'చతురస్రం'లో శ్రీ శ్రీ మానవుడు సాధించవలసిన పరమావధి' 'అద్వైతం' అని చెప్పదలుచుకున్నట్లు స్పష్టంగా తెలుస్తుంది.[17] '1+1 = 1' అన్న సిద్ధాంతం అద్వైత వాదులది. "అహం బ్రహ్మాస్మి" అనే వాక్యాన్ని ఉపనిషత్సారాంశంగా స్వీకరించి, అద్వైత సిద్ధాంతాన్ని ప్రాచుర్యంలోకి తెచ్చారు శంకరాచార్యులు. శంకరాచార్యులనుండి

శ్రీ శ్రీ సమకాలికుడైన రమణమహర్షివరకు, అద్వైత సిద్ధాంత మార్గానుగాములే! శంకరాచార్యులు 'అద్వైతం' లో ఒక నిర్దిష్ట మానవుడు భగవంతుడిలో ఐక్యం పొందడం, లేదా భగవంతుడే ఐపోవడం అనేది 'ఆధ్యాత్మిక సాధనవల్ల సాధ్యం' అని ప్రతిపాదిస్తారు. శ్రీ శ్రీ 'చరమరాత్రి'లో చెప్పే ధోరణి ఒక నిర్దిష్టమానవుడి వ్యక్తిగత పరిణామం లాగా ఉంటుంది. శ్రీ అరవిందులు మానవజాతి అంతా చారిత్రకంగా 'అద్వైతం' వైపుకి పరిణామం చెందుతోందనీ, భవిష్యత్తులో మానవులందరూ భగవంతుడైపోయే రోజు వస్తుందనీ ప్రతిపాదించారు. శ్రీ శ్రీ 'చతురస్రం'లో మానవజాతి అంతాకూడా చారిత్రకంగా ఒక దశలో 'అద్వైతం' సాధిస్తుందని ప్రతిపాదిస్తారు. అయితే, శంకరాచార్యులను చదివిన స్ఫూర్తితోనూ, అరవిందుల ప్రేరణతోనూ'చతురస్రం' రాశారని అనలేం.

'చతురస్రం' Futuristic నాటిక. అంతా ఊహాత్మకమే! భవిష్యత్తు మీద గాఢమైన వాంఛకీ, విశ్వాసానికీ శబ్దరూపం ఈ నాటిక. శ్రీ శ్రీలో హైందవ విశ్వాసాలూ, సంప్రదాయ ప్రతీకలూ కోకొల్లలుగా కనపడతాయి. ఉదాహరణకు 'అమృతం' అనే పదం మృత్యువుని .జయించేందుకు సంకేతం. దేవతలు అమృతపానం గావించారనీ, అందువల్లే వాళ్ళు అమరులయ్యారనీ హైందవుల విశ్వాసం. చంద్రుడు అమృతాంశువనీ, చంద్రుడు అమృతం అందిస్తాడని కూడా హిందువులు విశ్వసిస్తారు. చైనాలో చంద్రుణ్ణి స్త్రీమూర్తిగా భావిస్తారు. శ్రీ శ్రీ 'స్త్రీ-పురుషులు' అనే ద్వంద్వాలను ఒకటిగా చేయడానికి ఒక స్త్రీ పాత్రను ప్రవేశపెట్టి, ఆమె నాటకాంతంలో కవికి ప్రత్యక్షమైనట్లు రచించారు. అర్ధనారీశ్వరతత్వం అర్థంచేసుకున్న వారికీ, 'మధురభక్తి'లో భగవంతుణ్ణి స్త్రీగా భావించడంలోగల ఔచిత్యాన్ని గ్రహించిన వారికీ నాటకాంతంలో కవికీ స్త్రీకీ జరిగిన సంభాషణ అవగతమవుతుంది. కవి ఆ స్త్రీని 'మానవా' అని సంబోధిస్తే, ఆ స్త్రీ కవిని 'మాధవా' అని సంబోధిస్తుంది. శ్రోతలకు 'మానవుడే-మాధవుడు' అనే సూక్తి చటుక్కున స్ఫురిస్తుంది, ఈ సంబోధనవల్ల స్త్రీలో (ప్రకృతిలో) దాగిన పురుషుణ్ణి, మానవుడిలో దాగిన మాధవుణ్ణి తలపుకి తెస్తారు శ్రీ శ్రీ. 'చతురస్రం'లో స్త్రీ తాను దైవాన్నని చెప్పడమే గాక - "కాలాన్ని నేను, న్యాయాన్ని నేను, సత్యాన్ని నేను" అని కూడా అంటుంది. దైవం కాలాతీతుడే గాక, కాలమే తానైనవాడు, సత్యస్వరూపుడు. సమవర్తి. ఇవన్నీ హైందవ మత భావనలే! ఆ దైవం ఇన్నాళ్ళూ మహర్షుల ద్వారా, మహాపురుషుల ద్వారా, మహాకవుల ద్వారా, మహా భక్తుల ద్వారా మాట్లాడానని కూడా అంటుంది.[18] దైవం వీళ్ళందరి ద్వారా మాట్లాడుతుందనేది హైందవుల విశ్వాసమే!

'చతురస్రం' లోని జ్ఞానం, రాజ్యం, కళ, సిరి అనే నాలుగు పాత్రల గురించి అద్దేపల్లి రామమోహనరావు ఇలా అన్నారు.-

"ఈ చతురస్రానికి నాలుగు బాహువులు, కథలో నాలుగు పాత్రలు. 70 ఏళ్ళ జ్ఞానం అనే వైజ్ఞానికుడు, 50 ఏళ్ళ రాజ్యం అనే స్త్రీ, 10 ఏళ్ళ కళ అనే అమ్మాయి, 30 ఏళ్ళ సిరి అనే కవి. ఈ నలుగురికీ వయస్సులో ఉన్న

భేదం, ఆ నలుగురికీ స్వభావాల్లోనూ, సర్వవిషయాల్లో ఉన్న భేదానికి ఉపలక్షణం. కాబట్టి మొదట ఇది విషమ బాహు చతురస్రం. ఈ నాలుగు పేర్లూ గూడా సాంకేతికంగా పెట్టాడు కవి. విజ్ఞానమూ, రాజకీయమూ, సౌందర్యమూ, కవిత్వమూ ఈ నాలుగంశాలు. వీటికి ఒకదానితో ఒకదానికి పొత్తు లేదు. అందుకే ఇది విషమబాహు చతురస్రం. ఇది సమబాహువుగా మారడమన్న దాన్ని కవి నలుగుర్నీ 30 ఏళ్ళ వాళ్ళనిగా చెయ్యడంగా భావించాడు"[19].

శ్రీ శ్రీ కళలకూ, కాంక్షలకూ ప్రాతినిధ్యం వహిస్తుందీ నాటిక. మానవుడు రాజకీయ స్వాతంత్ర్యమూ, ఆర్థిక స్వాతంత్ర్యమూ సాధించినా ఇంకా మానసిక స్వాతంత్ర్యం సాధించవలసే ఉంటుందని శ్రీ శ్రీ అభిప్రాయం. ఈ అభిప్రాయాని కనుగుణంగా, నాటికలో-రెండువేల సంవత్సరాలనాటికి మానవకుటుంబమంతా రాజకీయ, ఆర్థిక స్వాతంత్ర్యాలననుభవిస్తూ మానసిక స్వాతంత్ర్యం కోసం ప్రయత్నిస్తూ ఉంటుందని రచించారు. ఈ అంశాన్ని ప్రయోక్తే స్వయంగా నాటికలో తెలియజేస్తాడు. నాటికలో ఐక్యరాజ్యసమితి భవనం ఆంధ్రదేశంలో ఉన్నట్లూ, అది అరవై అంతస్థుల భవనమైనట్లూ, సమితి సభ్యులంతా తెలుగునెంతో గౌరవించినట్లు శ్రీ శ్రీ రచించారు. ఇవన్నీ శ్రీ శ్రీ ఆకాంక్షలే. సమితి సమావేశారంభంలో, 'యుద్ధ స్పర్శలేకుండా చేయడం మానవజాతి సాధించిన ప్రగతి' అని అనడం శ్రీ శ్రీ అసంఖ్యాక స్వప్నాల్లో ఒకటి[20]. రెండువేల సంవత్సరం నాటికి ప్రపంచ రాజ్యాల్లో అగ్రరాజ్యాల ఆధిపత్యం తగ్గిపోవడం , శ్రీలంకలాంటి చిన్న దేశాలకూ్కడా పలుకుబడి ఏర్పడడం శ్రీ శ్రీ ఆశావాదానికి చిహ్నం. జాతి వివక్షకు గురైన చిన్న దేశాలన్నీ సంఘటిత శక్తిగా ఏర్పడాలనీ, రష్యా చిన్న దేశాల పక్షం వహించాలనే శ్రీ శ్రీ కోరిక ఈ రచనలో ద్యోతకమవుతుంది. కాంగో ప్రతినిధి సూచనను రష్యా బలపరిచింది అని రాయడం, ఈ కోరిక కనుగుణంగానే జరిగింది.

నాటిక ఆరంభంలో " మానవ జాతి ఒకే కుటుంబం అన్న మాటకి ప్రాణం వచ్చింది" అని శ్రీ రావు చేత అనిపిస్తారు శ్రీ శ్రీ.[21] అయితే తర్వాత జరిగే సంఘటనల్లో అందుకు భిన్నమైన వాతావరణం కనిపిస్తుంది. చిన్న రాజ్యాల పట్ల న్యూనతాభావం అగ్రరాజ్యాలకు పోదు. ప్రపంచ రాజకీయాల్లో అమెరికా సైంధవుడి పాత్రను నిర్వహిస్తూనే ఉంటుంది. బ్రిటీషు సామ్రాజ్య ప్రతినిధి అభ్యుదయ నిరోధకుడు. ఈ విధంగా ముందు చెప్పినదాన్ని తనకు తానే ఖండించుకుంటూ రచించడం వల్ల శ్రీ శ్రీకిగల ప్రపంచ పౌరుడి స్పృహతో పాటు, ఆయనకి ప్రపంచ రాజకీయాలపట్ల గల అవగాహనను కూడా వ్యక్తం చేస్తుంది. ఐక్య రాజ్యసమితి సమావేశాల్లో అనవసరమైన కాలయాపన, వాగ్వివాదాలే తప్ప ప్రపంచ ప్రజలకు మేలుచేసే చర్యలు చేపట్టడం తక్కువని నొక్కి చెప్తారు శ్రీ శ్రీ. రెండువేల సంవత్సరం నాటికి మానవజాతిలో ఏ మార్పుల నాశించారో వాటికి భిన్నమైన, వాతావరణాన్ని చిత్రిస్తూ ఈ నాటికే వాస్తవమనిపించే

సంఘటనల్ని కళ్లకు కట్టిస్తారు శ్రీ శ్రీ. దీనివల్ల ప్రపంచ భవిష్యత్తు పట్ల ఆయనకి గల ఆరాటం తెలుస్తుంది.

ప్రపంచమేమిటి? అనేది శ్రీ శ్రీ మొదటి ప్రశ్నసుకుంటే అందులో మనిషి పాత్రేమిటి? అనేదతని రెండవప్రశ్న. దైనందిన మానవజీవితం ఒక నాలుగుస్తంభాలాట. అమృతం తాగడానికి ముందు తీసుకున్న నిర్ణయాలకు భిన్నంగా జ్ఞానం, రాజ్యం ప్రవర్తించడం కనిపిస్తుంది. అమృతం తాగినప్పటికీ వారిలో మానసికవృద్ధాప్యం పోలేదని సూచించడానికి శ్రీ శ్రీ ఇలా చేశారు. అంతకు ముందున్న మానసిక స్థితి కవిలోనూ కళలోనూ కొనసాగింది. ఇది విషమ బాహు చతురస్ర సమస్య. ఈ సమస్యాపరిష్కారానికి దైవసహాయం కావాలి. ఇక్కడ దైవమంటే ఈశ్వరుడు కాదు. అద్వైత ద్వైతాలు తాత్త్వికాలుకాదు. ఈ భావనల్ని తాత్త్వికాలా అన్నట్లు ఆలోచింపజేసి, శ్రీ శ్రీ తన దృక్పథాన్ని కనువుగా ఆదునికీకరణం చేశారు. శ్రీ శ్రీ ప్రకారం ఇక్కడిదైవం విజ్ఞానం, కవిత, తపస్సు, స్వప్నం, సౌందర్యం వగైరాలు. అన్నిటికీ సృష్టికర్త మానవుడే. కవిత్వానికీ, శాస్త్రానికీ వైవిధ్యం ఉందని సామాన్యమైన అభిప్రాయం. కాదని ఈ సన్నివేశం ద్వారా చెప్తారు.

"సిరి : ఫ్రెయిల్‌టీ దైనేమ్ ఈజ్‌వుమన్ అన్నాడు
షేక్స్‌పియర్ ఆనాడు. ప్రేయసీ! నీ పేరు
రాక్షసి అన్నాడు శ్రీ శ్రీ యీ నాడు.
జ్ఞా: నేను బయాలజిస్టుని, ఫిజియాలజిస్టుని,
సైకాలజిస్టుని.
రా: జిష్ణుని, విష్ణుని, కృష్ణుని.[22]"

- ఈ వాక్యాల్లో కవిచెప్పిన కవిత్వం, జ్ఞానం వినిపించిన సైన్స్, రాజ్యం చెప్పిన మతం ఈ మూడూ, మూడు స్థాయి (levels)లలో మనిషిని నడిపిస్తాయి. శ్రీ శ్రీ ఈ నాటికకు ప్రధానాంశంగా మానవత్వాన్ని తీసుకున్నారు. దైవం గురించి ఎన్నిచర్చలు చేసినా, ఆ భావనను అటు మానవత్వానికిగానీ ఇటు కాలానికిగానీ అనుబంధంగా మాత్రమే కొనసాగించారు. మానవ జీవితంలోని చిన్నపెద్ద సంఘర్షణలన్నీ పరిష్కారమైన స్థితినే రచయిత సమబాహు చతురస్రంగా భావించారు. ఈ ప్రపంచానికి సర్వసమానత్వం, ప్రశాంతత, శాంతి, సౌఖ్యం ఏర్పడడమంటే కాలం ఆగిపోవడం అని కూడా రచయిత ధ్వనింపజేశారు. కాలం ఆగడమంటే జీవితం ఆగడం కాదు. జీవితం ఆగలేదంటే కళలూ, కవితలూ మొదలైన ఉన్నత మానసికచర్యలు కొనసాగుతాయి. అందుకే నాటికలోని వస్తువు, పాత్రలు, లక్ష్యం వీటి సంబంధాన్ని తెలియజేయడానికి నాటికను కవితలతో ముగించారు.

రెండులో ఏ కత్వాన్ని సూచించడానికి కవి ఈ పాటపాడించారు. ఈ గీతం ఆధునిక కవిత్వంలో ఉత్తమ శ్రేణికి చెందిన ఉదాహరణమనీ, మానవాళితో తన

ఆత్మైక్యాన్ని శ్రీ శ్రీ తెలుపుతున్నారనీ విమర్శకులు భావించారు.

"రెండు కంకాళాల కార్తీక దీపాలు (ప్రమిదా, కావ్వొత్తీ)
ఇంకా రెండేమిటి? వొకే ఒకతనం: ఒకే రెండుతనం
లేక పోవడం. వొకే నిండుతనం."

అని అంటారు శ్రీ శ్రీ[24].

ఆధునిక విజ్ఞానం, సాంకేతిక శాస్త్రం-వంటి వన్నీ మనిషి శాంతిగా జీవించడానికీ, సుఖసౌఖ్యాలను భవించడానికీ పనికి రావాలని శ్రీ శ్రీ కోరుకుంటాడు. అందుకే '1+1 = 1' అంటే 'గణిత శాస్త్రం × మానవప్రేమ' అనే తనదైన సిద్ధాంతాన్ని ప్రతిపాదించారు శ్రీ శ్రీ. ఈ నాటికలోని '1+1=1' అనే అంశానికి శ్రీ శ్రీ చెప్పిన ప్రతిపాదితాంశం ఏమిటో అనుబంధంలో చేర్చాను.[25]

మరోప్రపంచం:

ఇతివృత్తం:

యువకులు మరోప్రపంచాన్ని కాంక్షిస్తారు. వృద్ధులు జీవితం అశాశ్వతమనీ, మృత్యువు తప్పదనీ ప్రబోధిస్తూ నిరుత్సాహపరుస్తారు. మరోప్రపంచం నుంచి 21వ శతాబ్దపుమనిషొచ్చి, ఆ లోకానికి సంబంధించిన విశేషాలు వినిపిస్తాడు. యువకులతనికి స్వాగతం పలికినా, వృద్ధులు వ్యతిరేకిస్తారు. అలా వ్యతిరేకించిన వృద్ధులు మృత్యువు నారాధిస్తూ వెనక్కెళ్ళిపోతారు. యువకులు మరో ప్రపంచపు మహత్వాకాంక్షతో మున్ముందుకి సాగిపోతారు.

విశ్లేషణ:

1954లో, 1956లో ప్రచురించబడ్డ తన రేడియో నాటికల సంపుటానికి 'మరో ప్రపంచం' అని శ్రీ శ్రీ పేరుంచారు. అదే, ఈ నాటికకు శ్రీ శ్రీ దృష్టిలో ఎంత ప్రాముఖ్యత ఉందో తెలియజేస్తుంది. దీన్లో కూడా ఐన్‌స్టీన్ సాపేక్ష సిద్ధాంత ప్రభావం కనిపిస్తుంది. ఈ సిద్ధాంతానికనుగుణంగా కాలంతో ముందుకీ, వెనక్కీ ప్రయాణించడం సాధ్యమనే ఊహని ప్రవేశపెట్టారు శ్రీ శ్రీ. దీన్లో 21వ శతాబ్దంలోని ఒక జీవి, 25వ శతాబ్దంలోకి పరిశోధనకని బయల్దేరుతుంది. అయితే యాంత్రిక లోపాల వల్ల 20వ శతాబ్దంలోకి వస్తుంది. కొందరు యువతీ యువకుల ప్రశ్నల వల్ల 21వ శతాబ్దంలోని పరిస్థితుల్ని కనుపాప తెలియపరుస్తుంది. భవిష్యన్మానవుడికి శ్రీ శ్రీ పెట్టిన పేరు కనుపాప. ఈ విధంగా భావిని గురించి అంటే, రెండువేల సంవత్సరంతో ప్రారంభమయ్యే కాలాన్ని గురించి తన ఆకాంక్షలను వ్యక్తం చెయ్యడానికి శ్రీ శ్రీకి ఆస్కారం లభించింది.

"మేమసలు మాట్లాడుకోము. భాష చాలా అసమగ్రమైన పనిముట్టు. ఏ ఊహనీ అది విస్పష్టంగా, అసందిగ్ధంగా తెలియజెయ్యలేదు. నామాటలు కూడా మీకు సరిగా అర్థమవుతున్నాయో లేదో తెలియదు. ఇరవయ్యో

శతాబ్దం లో తెలుగు జనుల మధ్య ఉన్నాను. కాబట్టి నాఊహా యంత్రాలు తెలుగు ధ్వనులు చేస్తున్నాయి."

--అని శ్రీ శ్రీ 'మరోప్రపంచం'లో కనుపాప చేత అనిపిస్తారు[26]-పరస్పర భావ వినిమయం ఊహలతో జరుగుతుందని, చెట్లే అందుకు మార్గాన్ని వేశాయని శ్రీ శ్రీ అంటారు.[27] కనుపాపని ఆకుపచ్చని గాజుబంతిగా చెప్తారు. ఈ ఊహల్ని అర్థం చేసుకోవాలంటే గతి తార్కిక భౌతికవాదం తరిచి చూడాలి. గతితార్కిక భౌతిక వాదం ప్రకారం సృష్టిలోని పరస్పర విరుద్ధమైన తత్త్వాల సంఘర్షణలోంచి సృష్టి పరిణామమంతా జరిగింది. శ్రీ శ్రీ ఈ భావాల్ని తనకనుగుణంగా మలచుకొంటూ కనుపాపచేత ఎన్నెన్నో విషయాలు చెప్పించారు. రెండో పరమాణుయుద్ధం వరకూ ప్రాణికోటి పరిణామంలో జంతుతత్వం, వృక్షతత్వం విడివిడిగా అభివృద్ధి చెందుతూ వచ్చాయి. ఒకప్పుడు వృక్షజాతికీ, జంతుజాతికీ మూల జీవపదార్థం ఒకటే. ద్వితీయ పరమాణు సంగ్రామం మానవునిలో జంతుతత్వానికీ, వృక్షతత్వానికీ మధ్య జరిగిన యుద్ధం. ఈ యుద్ధంలో ఏ తత్వమూ జయించలేదు. కానీ వృక్షాల ఆధారంగా జంతువులు, జంతువుల ఆధారంగా వృక్షాలు జీవించే ఒక పరిణామం ఏర్పడింది. దాని ఫలితమే భవిష్యన్మానవుని ఆవిర్భావం.[25] ఇక్కడ 'డార్విన్ పరిణామ సిద్ధాంత' ప్రభావముంది.

'కమ్యూనిజం' అనే పదానికి సమష్టి వాదం అని అర్థం దీన్ని బలపరుస్తూ శ్రీ శ్రీ కనుపాపచేత సమష్టిపరిశోధనలు చేస్తున్నామనీ, ఏదైనా సమష్టిమీదనే అర్థమవుతుందనీ చెప్పిస్తారు. ఒక యువకుడు 'మీలో ఎవరికీ వ్యక్తిత్వం లేదా?' అని ప్రశ్నిస్తే

-"ఏం ప్రశ్న ఇది. సమిష్టి బాధ్యతలో వ్యక్తిత్వం ఎన్నడూ హరించుకు పోనక్కరలేదు. నేనున్నానా? సమగ్రసమాజ జీవితంలో నా వ్యక్తిత్వం సంపూర్ణంగా వికసిస్తుంది. వ్యక్తిత్వమంటే ఏకాంతం అనుకుంటారు మీరు. కాబట్టే మీకందరికీ ఇంత ఒంటరితనం."

-అని కనుపాప జవాబిచ్చినట్లు శ్రీ శ్రీ రాశారు.[29] కనుపాప అంటే భావి మానవుడు. యువకులకే తప్ప వృద్ధులకు కనపడడు. వారు "అదంతా భ్రమ" అని కొట్టి పారేస్తారు.[30] యువకులకీ, వృద్ధు లకీ మధ్యజరిగే వాగ్వివాదం నాటికలో ఎంతో ఎక్కువ. మధ్య మధ్య యువకులచేత 'మరో ప్రపంచం' గేయంలోని పాదాలు బృందగానంగా పాడింపజేస్తూ, ఆ గేయానికి తనకేర్పడిన కొత్త అవగాహనతో, కొత్త వ్యాఖ్యానాన్ని చెప్తారు శ్రీ శ్రీ. ఈ నాటికలో మానవాళికి భవిష్యత్ప్రయాణానికి కనుపాప సూచనలిస్తాడు. ఇవి కవిసూచనలే. శాస్త్రసహాయంతో భౌతికావసరాలు అవలీలగా తీర్చుకోవచ్చని కనుపాప చెప్పే మాటల వెనక, శ్రీ శ్రీకి విజ్ఞానశాస్త్రం పట్ల ఏర్పడిన గురి దాగి ఉంది. అధికాధిక సమస్యలన్నిటినీ విజ్ఞానశాస్త్ర సహాయంతో పరిష్కరించుకోవచ్చనే విశ్వాసాన్ని వ్యక్తి పరుస్తుందీ నాటిక.

ఇతివృత్తం

రైల్లో, మొదటి తరగతిలో రంగారావు అనే తత్వ శాస్త్రాధ్యాపకుడు, కాంతం, సరళ అనే అక్కచెల్లెళ్ళు ప్రయాణంచేస్తుంటారు. సరిగ్గా ఆరుగంటల దగ్గర రంగారావు, సరళలవాచీలాగిపోతాయి. పెట్లో దాచిన కాంతం వాచీ ఆగిందో లేదో తెలియదు. సరళ కీడుని శంకిస్తే కాంతం తేలిగ్గా కొట్టిపారేస్తుంది. ఇంతలో రైలు ప్రమాదం జరిగి, రంగారావు మరణించగా, అతని ఆత్మ అనంతంలో విహరిస్తుంటుంది. రంగారావు ఆత్మ తనకు జరిగే సంతాప సభలో హిపోక్రాట్స్ ధోరణిని అసహ్యించుకుంటుంది. కాంతం వాచీ ఆరు దగ్గరాగిందో లేదో తెలుసుకోవాలని తపిస్తుంది. కాంతం, సరళ, శర్మ సంభాషించుకుంటుంటే అక్కడే తచ్చాడుతుంటుంది. అక్కడి పిల్లలు భూలోకంలో 'బతుకు' గురించి ఉత్సాహాన్ని వ్యక్తపరచగా ఆ ఆత్మ వాళ్ళని నిరుత్సాహ పరుస్తుంది. అయితే, పిల్లలా మాటల్ని వినిపించుకోరు. మూడో వాచీ గురించిన సందేహం తీరకపోయినా "అతని అనంతర యాత్ర అనంతంగా సాగిపోవలసిందే" అనే ప్రకటనతో నాటిక సమాప్తమవుతుంది.

విశ్లేషణః

ఇది కూడా కాలానికీ, సాపేక్ష సిద్ధాంతానికీ సంబంధించిన నాటికే! ఐన్‌స్టీన్ సిద్ధాంతంలో కాలపరిణామం భూమి మీద జీవులకొకరకంగా, నక్షత్రమండలంలోని వారికొకరకంగా ఉంటుందని ఉంది. పురాణాల్లో దేవతల కాలపరిణామం, మానవుల కాల పరిణామం వేరువేరు. పురాణాల మీదా, విజ్ఞానశాస్త్రం మీదా సాధికారంగల శ్రీ శ్రీ ఈ భావాలనాధారం చేసుకొని 'అనంతయాత్ర' నాటికను

> "కాలం అంతా ఒకటేగాని అందరికీ ఒకటి కాదు. జీవిస్తున్నవారి కాలం వేరు. మరణించినవారి కాలంవేరు. గర్భంలో ఉన్న శిశువుదొక కాలం. ఇక గర్భస్థంకాని జీవిదింకో కాలం. స్టీమర్‌లోనో విమానంలోనో ప్రయాణం చేస్తున్న వాడికీ, నిద్రపోయి కలలు గంటున్న వాడికీ, మతిపోయినవాడికీ, వైరాగ్యనైరాశ్యాలవల్ల కాషాయం ధరించినవాడికీ, కాలం ఒకే విధంగా గడవదు".

అనే ప్రకటనతో ప్రారంభిస్తారు.[31] కాలపరిణామాల్లో వైరుధ్యాన్ని రెండు వాచీలు సరైన సమయాన్ని చూపించకపోవడంతో చెప్పక చెప్తారు శ్రీ శ్రీ. రైలు ప్రమాదానికి పూర్వం జీవుల కాలాన ఉన్న రంగారావు, ప్రమాదానంతరం మృతుల జాబితాలో చేరిపోవడంతో, వారి కాలప్రవాహంలో కలిసిపోతాడు. ప్రమాదానికి ఉభయదశల్లో మానవజీవనకాల ప్రమాణాలు వేరువేరు. జన్మించబోయే శిశువుల కాలంలోకి వెళితే, వాళ్ళ కాల ప్రమాణాలు వేరవడం వల్ల, వాళ్ళు రంగారావు మాటలను లక్ష్యపెట్టరు. రంగారావు అనుభవ సారాంశమైన సందేశాన్ని తృణీకరించి, వాళ్ళు జన్మించడానికే నిర్ణయించుకుంటారు. కాలం అనంతమేకాదు. నిశ్చలమైనది కూడా. సమస్త చలనాలకూ

ఆధార భూతం మనిషి జీవితం. మానవ జీవితావధి తాత్కాలికం, ప్రదేశ సంబంధితం. మానవ మస్తిష్కంలో పొడమే ప్రతి ప్రశ్నకూ స్పష్టమైన సమాధానం లభించదు. సంశయాత్ముడైన రంగారావు మానవలోకం నుంచి విడివడి, మృతలోకంలోకీ, అక్కణ్ణించి పుట్టని శిశువులలోకంలోకీ, ఆపై పుట్టిన వాళ్ళలోకంలోకీ-చక్రనేమిక్రమంలో అనంతంగా సంచరిస్తుండక తప్పదు. ఎక్కడా, ఎప్పుడూ కాలప్రమాణాలు ఒకటి అవ్వవు. ఒకరి కాలప్రమాణం మరొకరి కర్థం కాదు. ఒకరి అనుభవం మరొకరికి పరిత్యాజ్యం. ఆఖర్లో రంగారావు ఆత్మ కాలం ఆగిందా, లేదా? ఎలా తీరుతుందీ సందేహం?" అనుకోగా, ప్రకటనలో " ఈ సందేహం తీరదు. అనంతరయాత్ర అనంతంగా సాగిపోవలసిందే." అని వినిపిస్తుంది.[32] మనిషి అత్యున్నతమైన విలువల్ని అనాయాసంగా వదిలేసి, అత్యల్ప విషయాలకు ప్రాధాన్యమివ్వడం ఎందుకో? తెలుస్తుందీ నాటికవల్ల. జీవికీ, నిర్జీవికీ – మానవుడి గమ్యానికీ, మృతుడి అగమ్యానికీ – జీవితపు విలువల పోరాటానికీ, మరణానంతర పోరాటానికీ వ్యత్యాసం ఏమిటి? అనంత మానవ యాత్ర ఆఖరి గమ్యమేమిటి? – అనేవి శేషప్రశ్నలు. వీటిని ధ్వనింపజేసే ఈనాటికలో మానవ జీవితం ఆద్యంతరహితమైన, భావజాలానికి మరణం ఉండదని శ్రీ శ్రీ చెప్పారు. మరణం భౌతిక వాంఛలకు భరతవాక్యం. దీన్ని వ్యక్తం చేస్తూ రంగారావు ఆత్మ

– 'చావులో చాలా హాయి ఉంది. కాఫీ అక్కర్లేదు. తిండితిప్పలక్కర్లేదు. బట్టలక్కర్లేదు. ఇల్లూ, వాకిలి అవసరముండదు"

-అనుకుంటుంది.[33] 'సంశయాత్మ వినశ్యతి' అని ఆర్యోక్తి. సందేహం తీరని ఆత్మలు నిర్విరామంగా అనంతాకాశంలో పరిభ్రమిస్తుంటాయి. పుట్టని పిల్లలు తమ అనుభవాలను తామే చవిచూడాలని ఉవ్విళ్ళూరడంలో 'సార్త్రే' అస్తిత్వవాద ప్రభావముంది.[34]

గవేషణ

**ఇతివృత్తం:**

భూలోకాన ఒక మానవుడు చనిపోయాడు. మృత్యుదూత లతన్ని మరో ప్రపంచానికి తీసికెళ్తుంటారు. మానవుడు మధ్యదారిలో మేల్కొని, తాను మరణించలేదనీ, వదిలిపెట్టమనీ వాదిస్తాడు. వాళ్ళు పొరపాటునంగీకరించి న్యాయదేవత ఎదుట అతన్ని హాజరుపరుస్తారు. ఆ దేవత పొరపాటొప్పుకొని అతన్ని మళ్ళీ భూలోకానికి పంపుతుంది. అయితే, అలోపలే భూలోకంలో అతని దేహానికి దహన సంస్కారాలు జరిగిపోతాయి. శరీరంలేక అల్లాడిపోయిన ఆ ఆత్మ, ఆనందం అనే మరో ఆత్మ సాయంతో మరల న్యాయదేవతను దర్శిస్తాడు. దేవతతో వాగ్వాదానంతరం అతనికి పూర్ణాయుర్దాయం లభిస్తుంది. భూలోకాన, ఆంధ్ర దేశాన న్యాయదేవత ఆదేశానుసారం ఓ యువతికన్న మృత శిశువులో ఆత్మ ప్రవేశించగా,రోదన ధ్వనితో నాటిక అంతమవుతుంది.

విశ్లేషణ :

మానవుడే ప్రధానపాత్రధారిగా రచించిన నాటిక ఇది. భూలోకంలో మానవుడి ఆయువు ఇంకా అయిదేళ్ళుండగానే అతన్ని మృత్యుదూతలు పరలోకానికి తెస్తారు. ఈ పొరపాటు దైవన్యాయస్థానంలోని ఒక ఉద్యోగిది కనుక తనకు మళ్ళీ శరీరం ఇమ్మంటాడు మానవుడు. న్యాయదేవత తాను అశక్తురాలనని ధర్మదేవత దర్శన మిప్పిస్తుంది. ధర్మదేవత కూడా తానేమీ చెయ్యలేనంటుంది. మానవుడు తాను వారి చేతిలో ఆటబొమ్మైతే, ఆ ఉభయులు వేరొకరికీ, ఆ ఒకరు మరొకరికీ, ఆ మరొకరు ఇంకొకరికి ఆటబొమ్మలనీ, అది అనంతంగా సాగుతుందనీ అంటే, ధర్మదేవత ఒప్పుకుంటుంది.

"సృష్టి రహస్యమంతా ఇంతే"[35] అంటుంది. ఈ సంఘటనలు సమస్త సృష్టీ ఏదో అతీతశక్తికి అధీనమై ఎలానడుస్తూందో, తాత్త్విక ధోరణిలో చెప్తాయి. బలవంతుల చేతిలో బలహీనులు బానిసల పరంపరగా ఎలా మారతారో మార్క్సిస్టు సిద్ధాంతానుగుణంగా వివరిస్తుంది.

ధర్మదేవతని అర్థించి, ఒక ప్రాణంలేని శిశువు శరీరంలో ప్రవేశిస్తాడు మానవుడు. ఆ శిశువు కెవ్వుమని కేకపెడితే ఆ కేక అర్థాన్ని

"నేను చచ్చిపోలేదు. నమ్మండి. నేను బతికే ఉన్నాను"[36] అనే వ్యాఖ్యానాన్ని మానవుడి గొంతు చేత చేయిస్తారు శ్రీ శ్రీ. సరిగ్గా ఇవే మాటలు మానవుడు మొదట్లో మృత్యుదూతలతో అంటాడు[37]. మొదటి, చివరి వాక్యాల్లో మానవుడు పుడుతూ, చస్తూ ఉన్నా మానవత్వం అనేది ఎప్పటికీ మిగిలే ఉంటుందనే ధ్వని ఉంది. మానవత్వం ఆద్యంత రహితం.

శ్రీ శ్రీ దేవతల Hierarchy గురించి తన వ్యాఖ్యానం చేశారు. మృత్యుదేవత, న్యాయ దేవత, ధర్మదేవత లాంటి చిన్న దేవతలు భగవంతుడని పిలవబడే ఒక తత్త్వపు అధీనంలో నియంత్రింపబడే అస్వతంత్రతత్వాలు. సర్వస్వాతంత్ర్యం ఏ శక్తికీ లేదు. అంతా విద్యుక్త కార్యక్రమాల ప్రకారం సాగుతుంది. శ్రీ శ్రీ దేవతలచేత మానవుడితో 'దేవతలను నమ్మకపోయినా, మానవత్వం మీద నమ్మకాన్ని పోగొట్టుకోవద్దని' చెప్పిస్తారు. దేవతే మానవుణ్ణి క్షమాపణ అడిగేలా చేస్తారు. వెంటనే మానవుడిచేత

"ఈ అల్ప మానవుడా, దేవతలను క్షమించవలసినవాడు." అని అనిపించి,

"ఇందుచేతనే దేవతలు మానవుణ్ణి ప్రేమిస్తారు. ఈ హృదయ వైశాల్యాన్ని చూచి!"

- అని ధర్మదేవత చేత అనిపిస్తారు[38]. ఇక్కడ మానవుని విచక్షణ దేవతలకూ కూడా భయం కలిగిస్తోంది. దేవతలు మానవుణ్ణి విచారించడం కాదు. మానవుడే దేవతల్ని విచారించే స్థితిని కలిగించారు శ్రీ శ్రీ. మానవుని చుట్టూ పరిభ్రమించే ఈ నాటికలో

మానవుడి ఔన్నత్యాన్ని నొక్కి చెప్పడానికై శ్రీ శ్రీ దేవతలు మానవుణ్ణి క్షమించమన్నట్లు రాస్తారు. మానవుడే దేవతల్ని, వారి పొరపాట్లనీ నిలదీసి ప్రశ్నిస్తాడు.

ఈ నాటికలో మానవుడి ఆత్మను మృత్యుదూతలు ఒక వయస్సులేని, నేత్రాలు లేని స్త్రీమూర్తి దగ్గరకు తీసికెళ్తారు. ఆమే ఆ న్యాయస్థానంలోని న్యాయమూర్తి. న్యాయస్థానాలు సాక్ష్యాధారాలమీద ఆధారపడి పని చేస్తాయనీ, చట్టానికి చెవులేగాని కళ్ళుండవని తెలియ జేసేందుకు కళ్ళకి గంతలతో చేతిలో న్యాయపు త్రాసుతో ఉన్న స్త్రీమూర్తి బొమ్మ నుంచుతారు. ఈ న్యాయ స్థానాల ప్రభావం శ్రీ శ్రీ ఊహమీద పనిచేసింది. న్యాయదేవతకి కళ్ళు లేకపోవడం, స్వపర భేదాలెంచని గొప్ప ఆదర్శానికి చిహ్నం. స్వజనులైనా దుష్టశిక్షణ గావిస్తాననీ, పరులైనా శిష్టరక్షణ చేస్తాననీ చెప్పక చెప్తుంది ఆ అంధమూర్తి.

ఇహలోకాన ఏ అత్యున్నత న్యాయస్థానమూ మానవుడికి న్యాయం చెయ్యకపోయినా, పరలోకాన న్యాయదేవత సమక్షాన అతనికి పరిపూర్ణ న్యాయం జరిగినట్లుగా చిత్రించారు శ్రీ శ్రీ. న్యాయదేవత్పై అధికారి ధర్మదేవత కూడా స్త్రీయే. "చతురస్రం"లో దైవం కూడా స్త్రీమూర్తే. ప్రపంచంలో ఏ నాగరికతలో నైనా సృష్టి స్త్రీనుంచి వచ్చింది. కాబట్టి స్త్రీయే మొదటిదైవం. శ్రీ శ్రీకి స్త్రీలమీద ఉన్న సదభిప్రాయానికి తార్కాణాలుగా నిలుస్తాయీ పాత్రలు.

సృష్టి అంతా ఒక క్రమబద్ధమైన సూత్రాలమీద ఆధార పడినట్లు కనిపిస్తుంది. ఈ సూత్రాల నెవ్వరూ మార్చలేరు. మనక్కనపడని దేవతలంటూ ఎవరైనా ఉంటే వాళ్ళు కూడా, ఈ సూత్రాల నమలు పరచవలసిందే తప్ప ఏ మాత్రమూ మార్చలేరు.

"ఎవడూ సర్వశక్తి మంతుడుకాడు" అనే ఈ విశ్వాసాన్ని

"బ్రహ్మదేవుడు కూడా తలరాతని మార్చలేడు" అని వ్యక్తం చేస్తారు మన దేశంలో.

"Even Gods have their own problems". అని God Jeus అంటాడు[39]. వీటిని మార్చగలిగిన పెద్ద భగవంతుడంటూ ఉంటే, అతనెవరికీ ఎప్పుడూ కనపడడు. కనుక ఎప్పుడైనా ఎక్కడైనా, ఏదైనా పొరపాటు జరిగితే ఎవరికీ చెప్పుకోడానికుండదు. ఒక పెద్ద రాజభవనంలో ఎప్పుడూ ఎవరికీ కనిపించని రాజుగారి కింద పనిచేసే రాజోద్యోగుల్లాంటి వాళ్ళు దేవతలు. వాళ్లు ఆ రాజు చట్టాల నమలు పరచవలసిందే తప్ప మార్చలేరు. ఆ రాజును వాళ్ళెప్పుడూ చూడరు. మూడుసార్లు మృత్యుముఖంలోకి ప్రవేశించిన శ్రీ శ్రీకి మరణాన్ని గురించీ, పునర్జన్మ గురించీ రకరకాల ఆలోచనలు రావడం సహజం. స్వర్గ నరకాలు, పాపపుణ్యాలు మానవుడు సృష్టించుకున్నవి. నిజానికి ఏదీలేదు. ఏమీలేవు. దేవతలనే వాళ్ళున్నారనుకుంటే వాళ్ళు ఏ విధంగానూ మానవుడి కంటే అధికులు కారు. జ్ఞానవంతుడు విశాల హృదయుడు, క్షమాశీలి, సహన శీలి అయిన మానవుడే అత్యుత్తమ ప్రాణి అని కవి అభిప్రాయం.

శ్రీ శ్రీకి కూపస్థమండూకంలాగా బతకడం ఇష్టముండదనీ, స్వంత ప్రయోగాలు చేస్తారనీ పూర్వం చెప్పడం జరిగింది. ఈనాటికలో నూతిలో కప్పలాగా బతకలేక వచ్చేస్తాడు మానవుడు. అలాగే మానవుడు మరొక మానవుడి శరీరంలోకి ప్రవేశించడాని కిష్టపడడు. కప్పబతుకు అందులోనూ నూతిలో కప్పబతుకు ఉక్కిరి బిక్కిరిగా ఉందం టాడు. అయినా అయిదేళ్ళూ నాబతుకు నేను బతక్క ఇంకో జంతువుని ఎందుకు కావాలని ప్రశ్నిస్తాడు. ఇంకొక మనిషిగా బతకడానికి వాడి ఆలోచనలు, వాడి అలవాట్లు నేర్చుకున్నప్పటికీ అబద్ధపు బతుకే అవుతుందంటాడు[40]. ఇక్కడ మానవుడి స్వభావంలో శ్రీ శ్రీ ధ్వనిస్తున్నారు. 'మానవుడే నా సందేశం. మనుష్యుడే నా సంగీతం' అని ఎలుగెత్తి చాటిన శ్రీ శ్రీ ఈ నాటికలో మానవుడికి పెద్దపీట వేశారు. 'మానవుడు' అనేపేరులో నిత్య మానవతా స్ఫూర్తి, మానవత్వానికి చావుండబోదనే కవి విశ్వాసం వెల్లడవుతున్నాయి.

ఒంటరి బావి

ఇతివృత్తం

ఒక ఊరిలో చీకటితోనిండిన బావిగురించి రెండు గొంతుకలు వివరిస్తాయి. ఆ బావి గురించి బోలెడన్ని కథలున్నాయి. అందులో అసిరిగాడి పదేళ్ళకూతురి కథొకటి. ఆ పిల్ల కడియాలకోసం ఆశపడి చంపేశాడని కొందరంటారు. ఆ పిల్లని పాడుచేసి చంపేశాడని మరికొందరంటారు. అర్ధరాత్రి అరుపువిన్న పోలిగాడి సాక్ష్యం కూడా ఆ కథకి బలమిస్తుంది. ఇంతకీ అసిరిగాడి కూతురి శవం బావిలో దొరకలేదు. అసలక్కడొక బావి ఉందో, లేదో కూడా శ్రోతలకి తెలియదు. ఎందుకంటే కథనకంఠమే ప్రజల నోళ్ళల్లో పడ్డకథలే ఆ బావిరూపు తాల్చాయేమో? అంటుంది. ఆ కథనకంఠం శ్రీ శ్రీది.

విశ్లేషణ

'నోరుజారితే ఊరు దాటుతుంద'ని 'నరుని నాలికకు నరం లేద'ని తెలుగువారికి లోకోక్తులున్నాయి. మనిషి ఎంత మంచి వాడో అంత భయంకరుడు. అందులోనూ నలుగురి విషయాల గురించి మాట్లాడేటపుడు మనిషిలో దాగిన రాక్షసత్వం, కర్కశత్వం ప్రస్ఫుటమౌతాయి. ఏ మాటలు ఏ అమాయకుల జీవితాలతో చెలగాటాలాడతాయో తెలీని మనిషి చిత్తశుద్ధి లేకుండా మాట్లాడతాడు. ఉబుసుపోకకి చెప్పుకునే దారుణ విషయాలు కథల రూపాల్ని పొంది ఎలా వ్యాపిస్తాయో నర్సిగాడి వంటి అమాయకుల్ని ఎలా బాధితుల్ని (Victims) చేస్తాయో ఈ నాటికలో చెప్పారు శ్రీ శ్రీ. అలాంటి కథల్ని దాచుకున్న మనిషి అంతరంగమే ఒంటరిబావి. ఆ అంతరంగాన్ని విప్పి చూపించడం విషాల సంచి తెరవడం. భీకర బీభత్స విపంచిని సవరించడం. ఒక్కొక్క కథ పాతాళ లోకానికి సోపానాల్లా అమరాయి. ఎన్నెన్నో రహస్యాలు జీబుగా, చీదరగా, శాఖోపశాఖలుగా విస్తరిల్లిన చెట్టు చేమల్లా ఉన్నాయి. ఒకే కథకు ఎన్నెన్నో రంగులు పూసే మానవ మనస్తత్వాలు, కాలాలు మారినా వికారాల నొదలక, 'కాలం కాలిన పొగవాసన' వ్యాపింప

జేస్తున్నాయి. ఒకే కథకి రూపాంతరాలుగా నాలుగైదుకథలు వెలసి, నాటకరంగం మీద నటుల్లా నర్తన మాడతాయి.

అసిరిగాడి కూతురు అమాయకురాలని, ఆ పిల్ల కాలికడియాలకోసం నర్శిగాడు చంపేశాడని ఒక కథ. అసిరిగాడి కూతురి మీద బోలెడంత సానుభూతి. నర్శిగాడు అసిరిగాడి పదేళ్ళ కూతురిమీద ఏదైనా ఘోరం చేసుంటాడేమోనని ఒక అనుమానపుకథ.

'అబ్బే! నర్శిగాడు అలాంటివాడు క్కాదు' అని ఎంతో సదభిప్రాయాన్ని వెళ్ళబోస్తూ మొదటి అనుమానపు కథకి మరింత బలాన్ని చేకూరుస్తుంది మరొక కథ. అది ఒకవైపు నర్శిగాడి మీద సదభిప్రాయాన్ని వ్యక్తం చేస్తూనే, 'ఏమో? ఏ కాలాని కేమి బుద్ధులో?' అంటూ అనుమానపు కథకి బలాన్ని చేకూర్చే దారుణప్పనికి ఒడిగడుతుంది. ఈ కథలకి మరొక ఆకర్షణగా మారిన కథ పోలిగాడి సాక్ష్యం. పోలిగాడు అసిరిగాడి కూతుర్ని చంపడం గానీ, చంపిన తరువాత బావిలో పడేయడంగానీ చూడలేదు. అలాంటి వాడికి సాక్ష్యం చెప్పే అర్హత లేదు. అయినా సాక్ష్యానికి తయారయ్యాడు. తాను అర్ధరాత్రి ఒక అరుపు విన్నానన్నాడు. ఆ అరుపు అసిరిగాడి పదేళ్ళ కూతురిదేనన్నాడు. కథ చెప్పే కథకుడు ఆ అరుపు అసిరిగాడి కూతురిదేనని 'చెప్పలేం' అంటాడు. అసిరిగాడి కూతురి శవం బావిలో ఎంత వెదికినా దొరకలేదన్న నిజాన్ని చల్లగా చెప్తాడు. బావి అస్తిత్వాన్ని గూర్చి కూడా అపనమ్మకాన్ని వ్యక్తం చేస్తూ, 'ప్రజలనోళ్ళల్లో నానిన కథలే బావిరూపు దాల్చాయేమో? అని అంటాడు.

పులి ఉనికి ఉందోలేదో ఖచ్చితంగా తెలియకపోయినా, ఇదిగో పులి అంటే 'అదిగో తోక' అంటారు లోకులు. అందుకే లోకుల్ని పలుకాకులంటారు. ఒంటరిబావి నాటికకి మూలం ఈ భావమే.

**భూతాల కొలిమి**

**ఇతివృత్తం**

నాటికారంభంలో ఒక స్త్రీ, పాదాలు రక్తం కారుతూ మండుతున్నా, చీర చిరిగి జీరాడుతున్నా, ప్రాణాలకు తెగించి పరిగెడుతూ ఉంటుంది. ఆమెని ప్రశ్నిస్తే తన పరుగు భూతాల కొలిమికనీ, తన ప్రియుణ్ణి నరికి పారేశారనీ చెప్తుంది. అంతకు ముందు రోజురాత్రి అతను తనకు కన్పించాడనీ, అతనిని చుంబిస్తే తన పెదవి కాలిందనీ చెప్తుంది. ఆమాట తల్లితో చెప్తే ఏడ్చిందనీ, చచ్చిన మనిషి తిరిగిరాడనీ ఆ దారిన వెళ్ళొద్దనీ, ఇంటిపట్టునే ఉండమని హితవు చెప్పిందనీ చెబుతుంది. తల్లి మాటలు పట్టించుకోకుండా తాను 'భూతాల కొలిమి'కి వెళ్తున్నాననీ, తానక్కడికి వెంటనే చేరాలనీ అంటుంది.

**విశ్లేషణ**

'ఒంటరి బావి' 'భూతాల కొలిమి' కవితాత్మక నాటికల్లా రచించారు శ్రీ శ్రీ. మంత్రతంత్రాల వాతావరణంలోకి శ్రోతల్ని తీసుకెళ్ళడానికి శిల్ప చమత్కృతిని

జోడించారు. ఈ నాటికలో ఆద్యంతాల భయానక వాతావరణ సృష్టి అద్భుతంగా ఉంటుంది. ఇళ్ళు తగలబడుతున్నట్లు, రాళ్ళు తిరగబడుతున్నట్లు భయంకరమైన వాద్య సంగీతంతో నేపథ్యాన్నమర్చేటట్లు రాశారు శ్రీ శ్రీ. ఇది నాటికకి మొదలు. నాటికాంతంలో 'భూతాల కొలిమి' ఎక్కడోగాక సందుచివరే ఉందనడంతో శ్రోత గుండె ఝల్లుమంటుంది. శ్రీ శ్రీ శిల్ప చమత్కృతిలో భాగంగా మెదడులో ఖడ్గాలూ, చుంబిస్తే అధరాల అగ్గిమంటలూ, కాకులతో - గుడ్లగూబలతో పలకరింతలూ, రాత్రి స్వారీపోయే రాకాసి మూకలూ కనిపిస్తాయి. భయంకరత్వాన్ని వీనులద్వారా కళ్ళకు కట్టించేందుకై స్త్రీమూర్తి పెన్నిధానంగా భావించే ప్రియుణ్ణి నరికి పారెయ్యడం, ఆ వ్యక్తి భూతాలకొలిమిలో పుష్యరాగంలాగా పునర్దర్శనమివ్వడం, ఉన్నాడో లేడో తెలియని ఆ వ్యక్తి కళ్ళు కొలిమి నిప్పుల్లాగా ఉండడం, మొఖం అంతా పొగచూరి పోవడం- వంటి చిత్ర విచిత్రాలెన్నో జరుపుతారు శ్రీ శ్రీ.

ఇందులో ఇద్దరు స్త్రీమూర్తుల పాత్రలున్నాయి. కూతురు ప్రేమికురాలు గనుక భావుకురాలు. ప్రియుడే లోకంగా బతికే పిచ్చిది గనుక చనిపోయిన మనిషిని దర్శించ గలుగుతుంది. ఉన్మాదిలా పెట్టే పరుగే ఆమె రొమాంటిసిజానికి చిహ్నం. తల్లి భావలోకాల్లో విహరించక ఇహలోకంలో జీవించే మనిషి. కూతురి ఉన్మాదానికి ఏడ్చిందామె. నువ్వు 'భూతాల కొలిమి'లో బొబ్బిలి పులిని చూసుంటావని, మంటల్లో నీడనే మనిషిగా భావించి ముద్దిడగా నీ పెదవి చురికుంటుంది-అని అంటుంది. "చచ్చిపోయిన మనిషి వచ్చి చూస్తాడటే?" అని నిలదీసి ప్రశ్నిస్తుంది. ఇంటిపట్టును వదిలి పోవద్దని ప్రాధేయ పడుతుంది. శ్రీ శ్రీలో ఉండే భావుకత్వ, భౌతికవాద ధోరణులకు ప్రతిబింబాలు ఈ తల్లీ కూతుళ్ళ పాత్రలు.

సుప్తాస్థికలు

ఇతివృత్తం

ఇది గాంధీజీ హత్యోదంతంతో ప్రేరణ పొంది రాశారు. అయినా ఎక్కడా ఆయన పేరు రాదు. సుప్తాస్థికల గురించి ప్రకటన. ఆపై కవి శ్మశానం గురించి చదివిన కవిత. ఆపై మళ్ళీ ప్రకటన. ఆప్రకటనలో మహాత్ముడు పోయాడనీ, కొన్ని విషాద కంఠాలు రోదిస్తూ ఏదో ఉపద్రవం జరిగిందంటాయి. "ఏమని చెప్పమంటావు"? అంటూ మొదలెట్టి, ప్రపంచమంతా ఎలా దుఃఖంలో మునిగి ఉందో చెప్తాయి. మళ్ళీ ప్రకటనలో శ్మశానమెంత హెచ్చు తగ్గులు లేని ప్రశాంతతతో నిండిన ప్రాంతమో తెలుస్తుంది. సంధ్య, అంధకారం, నక్షత్రం తమ గొంతులు వినిపిస్తాయి. కొన్ని గొంతులు మహాత్ముడికి మరణం లేదని బృందగీతి నాలపిస్తాయి. ప్రకటనలో "మహాత్ముని ఆత్మ అనశ్వరము"ని తెలుస్తుంది. చీకట్లో ఒక సోదర, సోదరీ తారకలు హస్తినలో గాంధీజీ హత్య గావించబడ్డ ఉదంతం గురించి సంభాషించుకుంటూ, అదిహింస, అహింసల యుద్ధమని అభివర్ణిస్తాయి. ఆరంభంలో వినిపించే "పరిత్రాణాయ సాధూనాం" అనే గీతాశ్లోకమే అంతంలో

వినిపిస్తుండగా నాటిక ఐపోతుంది.

ఈ నాటికలో ఎక్కడా గాంధీ అనేపేరు ప్రత్యక్షంగా లేదు. ఎవరూ చెప్పకపోతే ఇది గాంధీ గారి గురించి అని తెలీదు. తెలిశాక బాగా అర్థమౌతుంది. 1929లో రాసిన 'ప్రభవ' కావ్యంలోని 'సుప్తాస్థికలు' అనే కవితను ఈ నాటికలో ఉపయోగించు కున్నారు. 'సుప్తాస్థికలు' అనే సమాసానికి 'నిద్రపోతున్న ఎముకలు' అని అర్థం. ఎన్నో అందమైన అద్భుతమైన విచిత్రమైన సమాసాల్లాగానే ఈ సమాసం కూడా శ్రీ శ్రీ తయారుచేసిందే. ఈ సుప్తాస్థికలు మరణానికి చిహ్నం. ఇక్కడి మరణం ఒక మహాత్ముడిది. ఈ మరణానికి ప్రపంచమంతా దుఃఖించింది. కవులు మహాత్ముల జననానికి ప్రకృతి పులకించినట్లు, మరణానికి స్తంభించినట్లు రాస్తారు. శ్రీ శ్రీ ఇక్కడ మహాత్మాగాంధీ మరణాన్ని అటువంటి కవితాదృష్టితో వర్ణిస్తున్నాడు. ఈ భూమిక తెలిస్తే నాటిక సులభంగా అర్థమౌతుంది. తారలు మాట్లాడుకోవడం, నాలుగుసార్లు రివాల్వరు పేలడం, 'హేరాం, హేరాం' అనే గద్గదస్వరాలు వినబడడం – ఇదంతా మహాత్ముని హత్య ఉదంతమే. సంధ్య, అంధకారం, నక్షత్రం- అనే మూడు పాత్రల్ని ఎందుకు తీసుకున్నారు? అనే సందేహానికి – అద్దేపల్లి రామమోహనరావు, "ఈ మూడూ వరసగా మృత్యువుకీ, నిరాశకీ, ప్రేమకీ సంకేతాల"ని సమాధానం చెప్పారు[41]. ఈ నాటిక శీర్షికకు సార్థక్యం బృందగీతిలో వ్యక్తమౌతుంది. ఈ గీతిలో 'ఎముకల నిద్రలో ఇంపైన కలలు' అనే దానికి వివరణ 'మహాత్ముడి అనశ్వరాత్మ కనేకలలు' అని ఇచ్చారు. అద్దేపల్లివారు[42].

"అతడు సామాన్య వ్యక్తి
అతడసామాన్యవ్యక్తి...."

-అని అంటూ గాంధీజీలో ఉన్న ద్వివిధ లక్షణాల్ని వర్ణించారు శ్రీ శ్రీ[43].

"మృత్యువు జగద్విజేత కావచ్చును.
కాని మరణాన్ని ప్రేమ జయిస్తుంది."

– అనే వాక్యాలు

"Death, be not proud
......thou shalt die."

అనే John Donne వాక్యాలను గుర్తుచేస్తాయి[44]. నాటిక మొదట్లోనూ, చివర్లోనూ గల "పరిత్రాణాయ సాధూనాం" అనే గీతాశ్లోకం గాంధీజీ విశ్వమానవ ప్రేమను సూచిస్తుంది.

**విదూషకుడి ఆత్మహత్య**

**ఇతివృత్తం**

ప్రయోక్త, ఆటంకంల సంభాషణలో విదూషకుడి ఆత్మహత్య ప్రసక్తి వస్తుంది. ఆంజనేయులు, సత్యం విదూషకుడి ఇంటి తలుపులు కొట్టగా పొరుగింటావిడొస్తుంది. అడక్కుండానే విదూషకుడూ, అతని భార్యా అనుభవించిన కష్టాలు వివరిస్తుంది. ఆమె

మాటల్లోనే విదూషకుడి అప్పులబాధా, పుత్రశోకం, భార్యరోగ ప్రసక్తి వస్తాయి. ఆంజనేయులి చెల్లెలే విదూషకుడి భార్య. సత్యం, ఆంజనేయులు చెప్పిన మీదట తలుపు బలంగా తోస్తాడు. విషంతాగి మరణించిన విదూషకుడూ, అతని ఉత్తరం కనిపిస్తాయి. అందర్నీ నవ్వించి, నటుడిగా జీవించే ఓ అమాయకుడు, సన్మానాలు చేయించుకునే స్థాయి కెదిగినా, అభాగ్యుడిగా ఆలుబిడ్డల్ని పోషించలేని అసమర్థుడిగా మిగిలిపోతాడు. చివరికి భార్యాబిడ్డల్ని పుట్టింటికి పంపి, ఆత్మహత్య చేసుకున్న విదూషకుడి విషాదాంతం తెలుస్తుంది ఉత్తరంద్వారా. అయితే ఆటంకం, ప్రయోక్త, ఆంజనేయులు ఆ ఆత్మహత్య గురించి మాట్లాడుకుంటుంటే అకస్మాత్తుగా విదూషకుడు బతికొస్తాడు. ఆటంకం ఎవరో ఒకరు చావాలని పేచీ పెట్టగా ప్రయోక్తే చచ్చిపోతాడు.

విశ్లేషణ

శ్రీ శ్రీకి నలుగుర్నీ నవ్వించే మనుషుల వెనక ఉండే విషాదం మీద దృష్టి ఎక్కువ. "విదూషకుడి temperament, ఏదో ఒక Discontent" అని చెప్పిన శ్రీ శ్రీకి, తాను విదూషకుడిగా ఉండడం మీద దృష్టి ఎక్కువగా ఉండడమే గాకుండా, తన విదూషకుడి temperament వెనక దాగివున్న discontent కూడా తెలుసు. ప్రతి నవ్వించే మనిషి వెనకా బాధల అగాధాలు దాగున్నాయోమోనని వెతుకుతారు శ్రీ శ్రీ. సర్కస్‌లలోని విదూషకులు, నాటకాలలోని విదూషకులు వీళ్ళందరి జీవితాల్లోనూ ఎన్ని కష్టాల కడగండ్లు ఉన్నాయోనని ఆలోచిస్తారు. కళాకారుడు కళకోసం జీవిస్తూ, ప్రపంచాన్ని కడుపుబ్బ నవ్విస్తూ, తాను జీవితపు టిరుసులలోపడి కుచించుకు పోతుంటాడని శ్రీ శ్రీ ఆవేదన చెందుతారు. నిజమైనహాస్యం విషాదంలోనుంచి పుడుతుందన డానికి ప్రతీక విదూషకుడు. శ్రీ శ్రీకి ఈ విషయంలో చార్లీచాప్లిన్ ఒక టిపికల్ నమూనా. చార్లీచాప్లిన్ అంతరంగంలోని విషాదాన్ని చూడగల్గిన క్రాంతదర్శి శ్రీ శ్రీ. శ్రీ శ్రీ చార్లీచాప్లిన్‌ని విపరీతంగా అభిమానించారు.

'కన్యాశుల్కం' ఎందరో విమర్శకులకి హాస్య నాటకంగా కనిపిస్తే, శ్రీ శ్రీకి ఆ నాటకం 'భీభత్సరస ప్రధానమైన విషాదాంత నాటకం'గా కనిపించింది. విదూషకుడి ఉత్తరం అతి హృదయ విదారకంగా ఉంటుంది. నటులు, ముఖ్యంగా రంగస్థల నటులు పడుతున్న కష్టాలకు అద్దం పడుతుంది.

"బతికి చచ్చిపోయాను. చచ్చి బతికిపోయాను[45].

-అని అనడంలో బతికినంత కాలమూ కష్టపడ్డాననీ, చచ్చిపోయాక ఇప్పుడు తనకి హాయిగా ఉందని చెప్పినట్లైంది. నాటకమంతా ప్రయోక్త, ఆటంకం ఒకళ్ళతో ఒకళ్ళు హాస్యం ఉట్టిపడేటట్లు మాట్లాడుకుంటారు. హాస్యంలోనే విదూషకుడి జీవితంలోని కష్టాలన్నీ స్ఫురింపజేస్తూ హాస్యంలో విషాదాన్నీ, విషాదంలో హాస్యాన్నీ - ఈ అనుభూతిని శ్రోతలకు కలిగిస్తారు. విదూషకుడి ప్రవర్తనలో క్రమశిక్షణ లేనట్లే కవి లేక ప్రయోక్త conscious గానే పేర్లు మారుస్తాడు. ఆటంకం అడుగడుగునా అడ్డుపడడం, ప్రయోక్త

విదూషకుడికి వివిధ నామధేయాలుంచడం వంటి వాటిద్వారా అబ్సర్డ్ నాటకపు ధోరణులను ఈ నాటికలోకి తీసుకు వచ్చారు శ్రీ శ్రీ. కళాకారులు పడే కష్టాల గురించి కాస్త సీరియస్‌గా ఆలోచించమని శ్రోతలకి సూచించారు శ్రీ శ్రీ ఈ నాటికద్వారా.

## గుమస్తాకల

### ఇతివృత్తం

కోనేటి రావుకి యాభై ఏళ్ళు. పాతికేళ్ళ సర్వీసు. నూట పాతికజీతం. భార్యా, కూతురూ, కొడుకులూ అందరూ ఒకే ఇరుగ్గదిలో ఉండాలి. కోనేటిరావు కచేరీ కాగితాల రాతకోతలకీ, అతని భార్య చేసే వంటా-వార్పులకీ, పిల్లల చదువు-సంధ్యలకీ వాళ్ళందరి తిండి-తిప్పలకీ అందులోనే నానాహైరానా పడాలి. తప్పని పరిస్థితుల్లో ఇరుగ్గదిలో ఇరుక్కుపోయిన కోనేటిరావు స్వాప్నిక ప్రపంచంలో విహరిస్తుంటాడు. తెల్లారేలోగా మూడు కలలు కంటాడు. తెల్లారేసరికల్లా ఆ కలలు కల్లలౌతాయి. మళ్ళీ అదే ఇరుగ్గది చెక్కు చెదరకుండా అతని కళ్ళ ముందుంటుంది.

### విశ్లేషణ

'చరమరాత్రి' కథానికల సంపుటంలోని 'కోనేటిదినం', 'కోనేటి రాత్రి', 'కోనేటి జన్మ' అనే మూడు కథానికలకి రేడియో నాటికీకరణే 'గుమస్తాకల'.

కోనేటి రావుకి వచ్చిన మూడు కలల్లోని మొదటి కలలో- అమెరికా, ప్రపంచం మొత్తంలో కోనేటి రావుని మించిన ఇంజనీరు మరొకడు లేడని ఆహ్వానిస్తుంది. టెన్నెస్సీలోయనుతనిఖీ చేయమని ప్రాధేయపడుతుంది. అందుకతను ఎంతో మోడెస్టీతో జవాబిస్తుంటాడు. ఇంతలో చంటిపిల్ల ఏడుపుతో కల చెదిరిపోతుంది.

గుమస్తా కోనేటి రావు ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన ఇంజనీరవడం కలల్లోనే సాధ్యం. భారతీయుల ప్రజ్ఞను ఎప్పుడూ తక్కువగా అంచనా వేసే అమెరికా ఒక భారతీయుణ్ణి ఆహ్వానించడం కూడా కల్లోనే జరిగేపని. అమెరికా అంతటి సుసంపన్నదేశం కోనేటిరావుని ప్రాధేయపడడం, కోనేటిరావు ఏమాత్రం గర్వపడకపోవడం స్వప్న సాధ్యాలే. సామాన్యుడు అసామాన్యుడవ్వాలని కాంక్షిస్తాడు. భౌతిక ప్రపంచంలో ఆకాంక్షలు తీరే అవకాశం లేనపుడు వాటిని అంతశ్చేతనలో అణిచేస్తాడు. స్వాప్నిక ప్రపంచంలో, అంతశ్చేతనలో అణిచేసిన ఆకాంక్షలు విజృంభిస్తాయి. గుమస్తాగా కొంతకాలం పనిచేసిన శ్రీ శ్రీ ఫ్రాయిడ్ స్వప్న సిద్ధాంతాల పఠనంవల్ల కోనేటిరావు ఇలాంటి కలకన్నట్లు రాశారు.

రెండో కలలో - పంచమ ప్రపంచ సంగ్రామాన, జపాన్ సబ్‌మెరేన్ కమాండర్ జటావల్ కోనేట్ ఉరఫ్ కోనేటి రావు కల్లోల మహాసముద్రాంతరంగాన, జలాంతర్గామిలో వీరవిహారం చేస్తుంటాడు. శత్రునౌకని పసిగట్టి మెషీన్‌గన్లతో పేలుస్తుంటాడు. ఎదుటి పక్షం సైనికుల్ని మహారెచ్చిపోయి నాశనం చేసేస్తుంటాడు. ఇంతలో పిల్లి పాలగిన్నె

తోసిన చప్పుడుతో ఆకల చెదిరిపోతుంది.

శ్రీ శ్రీ ద్వితీయ ప్రపంచ సంగ్రామం ఎంత భయంకరంగా జరిగిందో చూశారు. మధ్యతరగతి మనుషులు వార్తలు వింటూ కర్కశత్వానికి, వీరత్వానికి మారుపేరైన జర్మన్ సైనికులుగా తమని తాము ఊహించుకోవడం సహజం. ప్రతి మనిషిలో హింసాత్మక భావాలుంటాయి. అలాగే హింస చేసే వాడి నారాధించే స్వభావమూ ఉండొచ్చు. సభ్య ప్రపంచంలో హింసని మెచ్చుకున్నా, హింసించేవాడి నారాధించినా విమర్శలకి గురికాక తప్పదు. అందుకే మనిషి ఆ నిషిద్ధ భావాలను సుప్త చేతనలోకి పంపించేస్తాడు. నిద్ర పోయేటపుడు సుప్తచేతనలోని అణచిపెట్టిన భావాలు కలలుగా మారురూపం దాలుస్తాయి. అందుకే సాదాసీదా కోనేటిరావు జర్మన్ సబ్‌మెరీన్ కమాండర్ జటావల్ కోనేట్ ఐపోగలిగాడు స్వాప్నిక ప్రపంచంలో. శ్రీ శ్రీకి ప్రతిపాత్రకీ ఇంటిపేర్లు ఉంచడం అంటే చాలా యిష్టం. ఆధునిక సాహిత్యంలో పాత్రలకి ఇంటిపేర్లుండడం చాలా అవసరమంటారాయన[46]. ఆ కారణంవల్లే జర్మన్ కమాండరైన కోనేటి రావుకి ఇంటిపేరు పెట్టారు. అయితే ఫాషన్‌గా ఉండేలా 'జటావల్లభుల' అనేదాన్ని 'జటావల్'గా మార్చారు. కోనేటిరావు భారతీయుడవడం వల్ల, జర్మన్ భాషలో ప్రవేశం లేకపోవడం వల్ల జర్మనేమో అనిపించేలా, కలగాపులగపు జర్మన్ పదాలు గడగడా మాట్లాడేస్తుంటాడు. నిజానికి అవి సంపూర్ణ వాక్యార్థం ఇవ్వని, కొన్ని వేర్వేరు జర్మన్ పదాల కలగలుపు మాత్రమే!

మూడో కలలో - కోనేటిరావు అందమైన, ఆజానుబాహువైన, పాతికేళ్ళ యువకుడుగా, హీరోగా మారిపోయి తన స్వప్న సుందరి అయిన సినిమా హీరోయిన్‌తో యుగళగీతాలు పాడేస్తూ ఉంటాడు. ఇంతలో కోనేటి రావు కొడుకు "తెల్లారిపోయింది నాన్నా!" అనడంతో కోనేటినిద్ర, ఆ నిద్రలో కనేకలా కొండెక్కిపోయాయి.

మధ్యతరగతి మనిషి కాపురం సజావుగా సాగడానికి తనకి నచ్చిన అమ్మాయిని పెళ్ళి చేసుకుంటాడు. అయితే, అర్ధాంగి అందం అంతగా అతనికి తృప్తి కలిగించదు. సినిమా హీరోయిన్ల అందాలు కావాలన్పిస్తుంది కొందరికి. దీనివల్ల అంతరాంతరాల్లో సినిమా హీరోయిన్లని ఆరాధించేలా చేస్తుంది. భార్య ఉండగా పరస్త్రీని, ఆమె ఎంత సినిమా హీరోయిన్ అయినా కామించడాన్ని సమాజం హర్షించదు. సమాజపు భయం వల్ల సామాన్యుడు ఆ కామవాంఛల్ని అంతశ్చేతనలోకి అణగదొక్కేస్తాడు. స్వప్నాలకి 'సెన్సార్' ఉండదు. స్వప్నాల్లో విహరించే సగటు మనిషికి సమాజపు భయం ఉండదు. ఆ కారణం వల్లే ఆనందంగా కోనేటిరావు తానారాధించే హీరోయిన్‌తో యుగళగీతాలు పాడుకోగలుగుతాడు.

కోనేటిరావు పగటి, రాత్రి జీవితాల్లో యింత విపరీతమైన వ్యత్యాసం ఏర్పడడానికి కారణం - అతన్లో అంతర్గతమైన ఆశా, భయాలేననీ వాటి రెండు గొంతుల సంభాషణల వల్ల శ్రోతలకి తెలుస్తుంది. అతనిలోని అణిచేసిన ఆశలూ, సమాజంపట్ల ఏర్పడిన భయాలూ వీటివల్ల సమాజానికి లోపలా వెలుపలా ఉండే మనిషి రెండుగా చీలిపోవడం

సహజమే! ఈ ద్వంద్వ మనస్తత్వం (Splitt personality) 'గుమస్తాకల' నాటిక మొత్తంలో ప్రస్ఫుటమౌతుంది.

స్వప్న ప్రపంచం తాత్కాలికం, అవాస్తవం. తాను గడుపుతున్న జీవితమే సగటు మనిషికి చివరికి మిగులుతుంది, అతనెంత ఏవగించుకున్నా. అందుకే కోనేటి రావుకి మూడుసార్లు స్వప్న భంగమైంది. కలలు కూడా నిర్విఘ్నంగా సాగకుండా నిద్రాభంగ మౌతుంది. మళ్ళీ దైనందిన కార్యక్రమాలూ, యాంత్రికమైన జీవితమూ ప్రారంభమౌతాయి.

శిరస్సు చెప్పిన రహస్యం

ఇతివృత్తం

కైలాసం అనే ఒక చిత్రకారుడి జీవితంలో ఎదురైన కష్టాలు, నిరాశల కథ ఈ నాటిక. కైలాసం శిల్పేగాక కవి, గాయకుడు కూడా.

"నేనో శిరస్సుని, కైలాసం అనే శిల్పి తయారు చేసిన శిలాసరస్సుని. సరిగ్గా అతని మొగమే నాది"[47].

అనే శిరస్సు మాటలతో నాటిక ప్రారంభమౌతుంది. అన్ని లలిత కళలూ అతను పిలిస్తే పలికేవనీ, కానీ జీవితమంతా అమిత దారిద్ర్యం అనుభవించాడనీ శ్రోతలకు శిరస్సు మాటలవల్ల తెలుస్తుంది. అతని చిత్రాలను చిత్రకళా ప్రదర్శనాధికారులు నిరాకరించారు. దాంతో నిరాశ చెందిన కైలాసం తానిక ఏ ప్రదర్శనకీ చిత్రాలను పంపకూడదని నిశ్చయించు కుంటాడు. అతను తయారు చేసిన శిలా శిరస్సే దారిద్ర్యాన్ని అంతం చేసుకోవడానికి కళని నడిబజార్లో అమ్మమంటుంది. కైలాసం ప్రాణమైనా వదులుకోడానికిష్టపడతాడు గానీ తనకళ నమ్ముకోవడాని కిష్టపడడు. అతని కాత్మాభిమానం అధికం. అతని స్నేహితులు సహాయ పడబోతే కాదనేవాడు. అయితే, 'అచ్యుతం' అనే ఆప్తమిత్రుడు ఢిల్లీకి పిలిపించి రెండునెలలు తన దగ్గరుంచుకున్నాడు. ఆ రెండు నెలలూ కైలాసం ఎంతో సుఖపడినా అచ్యుతం మరొక వారం రోజాలుండమంటే అంగీకరించడు. బ్రిటీషు దొరగారి ఆదేశానుసారం ఢిల్లీలో మిలటరీ అధికారులకోసం కట్టిన భవంతిలో కుడ్యచిత్ర రచన ఆరంభించిన కైలాసం చివర్లో మహాత్ముని 'దండియాత్ర' విశేషాలను తెలుసుకొని, ఆ యాత్రా విశేషాలతో చిత్రాన్నంతా నింపాడు. దొర చిత్రాన్ని శ్లాఘిస్తాడుగానీ బైటికి రానివ్వడు. అచ్యుతం కైలాసం దారిద్ర్యాన్ని పోగొట్టడానికి ఏదో శుభవార్త తెస్తూ ఉంటాడు. దానికై నిరీక్షించక కైలాసమెటో వెళ్ళిపోయాడు.

ద్వితీయాంకంలో అచ్యుతం, ధనం, కైలాసం గురించి మాట్లాడుకుంటారు. అతను నిగర్వి అని అచ్యుతం చెప్తాడు. కైలాసం ఉత్తరం రాసి శాశ్వతంగా నిష్క్రమించాడు. కానీ బ్రిటీషు పాలన అంతమై, భారతదేశానికి స్వాతంత్ర్యసిద్ధి జరిగింది. ఆ సందర్భంలో దొరబైటికి రాకుండా చేసిన కుడ్య చిత్రపు ఫోటోలే లక్షల ప్రతులు అమ్ముడుపోయి కనకవర్షం కురిసి 'ధనం'చేతికొస్తుంది. 'ధనం' అమ్మకాల్లో బేడవాటా కైలాసం కివ్వదలచాడు.

శిరస్సును పట్టణంలో ప్రతిష్టింప దలచాడు. శిరస్సు శిల్పులను చంపి శిలా విగ్రహాలను గౌరవించే సంస్కృతిని అభిశంసించింది. ఆ శిరస్సు మాటలకు ప్రాణంపోస్తూ - సోక్రటీసు నుండి గురజాడ వరకూ ఎందరో మహానుభావులు తమనూ తమ కళనూ నిరసించిన మానవాళి తమకు శిలా విగ్రహాలను ప్రతిష్టించి, తమనెలా అపహాస్యం చేస్తున్నారో వివరిస్తారు.

### విశ్లేషణ

'విదూషకుడి ఆత్మహత్య'లో కళాకారుల కష్టాలను కళ్ళకి కట్టినట్లు వినిపించిన శ్రీ శ్రీ, ఈ నాటికలో మానవులు మహామహులకు ఎలాంటి అపచారం చేస్తున్నారో వివరించి, ఇకనైనా అజ్ఞానపు సుషుప్తిలోంచి మేలుకొమ్మని హెచ్చరిస్తారు. శిరస్సు తరతరాలుగా మానవజాతి అజ్ఞానానికీ, అహంకారానికీ బలిఐపోయిన మహామనీషులకు ప్రతీక. తత్త్వవేత్తలు, కళాకారులు, సంస్కర్తలు, స్వేచ్ఛాప్రియులు ఎందరో తమ జీవితాలను మానవజాతి పురోగతికి అర్పించారు. వారినెవరినీ బతికుండగా ఈ మానవసమాజం గౌరవించలేదు. శిరస్సు చెప్పే రహస్యమిదే. విషాదాన్ని తగ్గించి, అద్భుత కరుణ రసాలను మేళవించి రచించడం శ్రీ శ్రీ ప్రత్యేకత. శ్రీ శ్రీ దారిద్ర్య బాధను బాగా అనుభవించడం వల్ల, తాననుభవించిన బాధల సారాన్నంతా ఈ నాటికల్లో పొందుపరిచి, ఏ కళాకారుడికీ కష్టాల దెబ్బలు పడకూడదనే కాంక్షను వెల్లడిస్తారు. శిలా విగ్రహాలను ప్రతిష్టించడం కన్నా బతికున్న కళాకారుల్ని ఆదరించడం ఎంతో మహత్తర కార్యమనే సందేశాన్నిస్తారు.

ఈనాటికలో శ్రీ శ్రీ 'అంతేలే పేదల గుండెలు[48]' అనే గేయాన్నుపయోగించు కున్నారు. కళ నమ్ముకోలేని కళాకారుడు, తన కళాసృష్టిలో పడే తపన, చేసే తపస్సులను సూచించడానికి తన కవిత "కవితా, ఓ కవితా[49]" నుపయోగించుకున్నారు. చివరికి గెలీలియో, సోక్రటీస్, వంజెట్టి, షెల్లీ- వీళ్ళందరి జీవితాల్లో ఉన్న కష్టాలను స్ఫురింప జేయడానికి తానీ నాటిక రాసినట్లు చెప్పకుండా చెప్తారు శ్రీ శ్రీ.

Laurence Campbell అనే శిల్పి Bronzeతో Maud Gonne అనే ఆమె శిలా విగ్రహాన్ని తయారు చేశాడు. ఇది డబ్లిన్ నగరంలోని ఆర్ట్‌గేలరీ ముఖద్వారం వద్ద ఉంది. దాన్ని చూసిన స్ఫూర్తితో W. B. yeats 'A Bronze head' అనే కవితను రచించాడు[50]. శిరస్సు చెప్పిన రహస్యం నాటిక ఆ కవితను గుర్తు చేస్తుంది.

## గ్రామఫోను రికార్డుల తిరుగుబాటు

### ఇతివృత్తం

సూత్రధారుడు "తుదిపలుకు" అనే పేరుగల, ముందే రికార్డు చేసి ఉంచిన రేడియో నాటికను ఆ రోజు శ్రోతలకి వినిపించాలి. అయితే, కుర్రాడు సొరుగులో పెట్టిన విరిగిపోయిన రికార్డుల్ని తెచ్చిస్తాడు. రికార్డు వేసీ వేయగానే పొరపాటు గ్రహించిన సూత్రధారుడు సమయస్ఫూర్తితో శ్రోతల్ని ఋకాయించ నారంభిస్తాడు. విరిగిన రికార్డులు

వినిపించే అప్రశుతుల సంగీతమే, ఆధునిక సంగీతమనీ, రికార్డులు తమ జన్మహక్కుల కోసం తిరుగుబాటు చేసి, సమ్మెకట్టి, సహాయ నిరాకరణోద్యమా న్నారంభించాయనీ నమ్మిస్తాడు. గొంతుమార్చి, తనతో తనే వాదించుకొని, అప్పటి కప్పుడు కల్పించిన నాటిక 'తుదిపలుకులు'. ఆ మర్నాటి నుండీ శ్రోతలనుంచి వచ్చే ఉత్తరాల్లోని ప్రశంసలూ, అభిశంసనలూ తుదిపలుకులవుతాయి.

విశ్లేషణ

ఆబ్‌స్ట్రాక్ట్ ధోరణిలో సాగుతుందీ నాటిక. జీవితంలో, కళల్లో రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత గందరగోళ మేర్పడింది. అనంతమైన బాధకూడా ఉంది. ఒక రకంగా ఆగందర గోళపు చిత్రణ ఈ నాటిక. ఇందులోని రికార్డులు రికార్డులు కావు. సూత్రధారుడు, సూత్రధారుడు కాదు. 'తుదిపలుకు' నాటిక పేరు. నిజానికి తొలిపలుకు కూడా అవలేదు. గ్రామఫోను రికార్డుల నాయకుని తిరుగుబాటు మనిషి తనలోతాను వివాదపడి సంఘర్షించుకొన్న వైనంగా చెప్పుకోవచ్చు. యథాతథస్థితికి భిన్నమైన వ్యతిరేకమైన స్వరం గ్రామఫోన్‌ది. Thesis, Antithesis, Synthesis అనే మూడు భావనలకు రూపం ఈ నాటిక. సూత్రధారుడు వరుసగా రెండు మూడు రికార్డులు వేసి చెడిపోయాయని గ్రహించి, గొంతుమార్చి తిరుగుబాటు చేసిన అన్ని గ్రామఫోన్ ప్లేట్లకు నాయకుణ్ణని చెప్పి, పీడిత సంగీతలోకపు హక్కులను నిలవేసి అడగడానికి వచ్చానంటాడు. సూత్రధారుడు, 'మేము రికార్డులేస్తే పాడడమేమీపని. మీకు హక్కులేమిటం'టాడు. ఎక్కడ పడితే అక్కడ రికార్డులు వేసి రాచి రంపాన పెట్టారనీ, సంగీతం సమ్మె కట్టిందనీ అంటాడు రికార్డుల నాయకుడు. చివరికి రికార్డు మాట్లాడడం అసందర్భం గనుక, డైరెక్టర్‌తో, చిన్నకల్పన చేసి తానే గొంతు మార్చానని చెప్తాడు సూత్రధారుడు. ఈ నాటిక విప్లవ భావాన్ని సూచిస్తుంది. రికార్డులు బానిసలైన మనుషులకు సంకేతం. ఇది ఆధునిక సంగీతం మీద శ్రీ శ్రీ వ్యంగ్య వ్యాఖ్యానం. శ్రీ శ్రీ ఈ నాటికలో సంగీత కారుల పక్షం వహిస్తారు. ప్రాణరహితమైన రికార్డులు తమ జన్మహక్కుల కోసం తిరుగుబాటు చేయడమన్నా, సమ్మెకట్టడమన్నా, అప్రశుతుల సంగీతాన్ని ఆధునిక సంగీతమని వాదించినా – ఇదంతా జీవచ్ఛవాల్లా బతుకుతున్న సంగీత గాయకుల పక్షం వహించి శ్రీ శ్రీ వినిపించే యథార్థ జీవిత వ్యథార్తగాథలే!

బలి

ఇతివృత్తం:

'బలి'ని విష్ణుమూర్తి వామనావతారం దాల్చి పాతాళానికి అణగదొక్కిన కథను పోతన గొంతుతో వినిపిస్తారు శ్రీ శ్రీ. ఆ తర్వాత ఇంద్రుడున్న స్వర్గ దృశ్యం కళ్ళకు కట్టిస్తూ, అపూర్వంగా నాట్యం చేసిన మదాలసపుత్రిక 'జలాంతశ్చంద్ర చపల'పై ఇంద్రుడు కన్నేసి, ఆమెను శయ్యా మందిరానికి ఆహ్వానిస్తాడు. అదే సమయాన బలి అక్కడికి వచ్చి ఆమెకి రక్షణ కల్పిస్తూ పాతాళానికి (నరకానికి) తీసుకు వెళతాడు. బలివంటి

పుణ్యాత్ముడూ, పరస్త్రీ వ్యామోహం లేనివాడూ ఉండే నరకం ఇంద్రుడి వంటి భోగలాలసుడూ, కాముకుడూ ఉండే స్వర్గం కన్నా వెయ్యిరెట్లు మిన్న. ఆ కారణం వల్లే నిర్జీవి తను స్వర్గంలో చిరంజీవిగా ఉండేకన్నా, నరకంలో నిర్జీవిగా ఉండడమే ఆనందమంటూ బలిని అనుసరిస్తాడు.

విశ్లేషణ

ఈ నాటిక, పోతన కృత భాగవతాంతర్గత వామనావతార గాథకు వినూత్నమైన మార్పు కూర్పులతో శ్రీ శ్రీ ఇచ్చిన నవీన వ్యాఖ్యానం. త్రివిక్రమవతార కథ విన్నప్పుడు సాధారణంగా చాలామందికి ఈ సందేహాలు వచ్చేవీలుంది. చాలామంచి వాడుగా చెప్పబడే బలిని పాతాళాని కణగ దొక్కడమేమిటి? చాలా దుర్మార్గుడిగా-కనపడే ఇంద్రుడికోసం దేవుడు మంచి రాక్షసుడైన బలిని అణచి వేయడమేమిటి? అని. ఈ పురాణ గాథల్లోని ఇటువంటి అసంబద్ధతలు చూస్తే వాటి వెనుక సామాజిక స్వరూపాలున్నాయోమో నన్పిస్తుంది. శ్రీ శ్రీ ఇక్కడ బలి చక్రవర్తి పాతాళానికి అణచివేయ బడడాన్ని ఒక మహానుభావుడు పతితులను, భ్రష్టులను ఓదార్చి సముద్ధరించడం కోసం, వాళ్ళ దగ్గరికిపోయి, వాళ్ళతో జీవించడంతో పోలుస్తున్నారు. 'డార్విన్ - పరిణామ సిద్ధాంతం'తో దశావతారాల్ని వాఖ్యానించిన వారున్నారు[51]. పాతాళలోకంలోకి అతను వెళ్ళడానికి ఇంకొక కారణం కూడా ఉంది. ఆలోకంలో ఎన్నో అందమైన వస్తువులు, అప్సరసలు ఉన్నారు. వీళ్ళను బలిలాంటి మహానుభావుడు కాపాడకపోతే ఇంద్రుడు అప్సరసలను చెరపడతాడని శ్రీ శ్రీ ఊహ. ఈ ఊహ ఆధారంగా కథ పెంచారు. స్వర్గానికీ, భూమికీ, నరకానికీ ఏమీ తేడా లేదనీ, జీవికీ నిర్జీవికీ కూడా ఏమీ తేడా ఉండదని శ్రీ శ్రీ విశ్వాసం. జీవి పాతాళానికొచ్చి నిర్జీవిగా మారి పోతుంది. అక్కడ బలి చక్రవర్తితో పాటుగా 'జలజాంతశ్చంద్ర చంద్రిక'ను కాపాడుతూ ఉంటుంది. బలి చక్రవర్తిలాగా అన్నిటినీ అనుభవించిన ఐశ్వర్య వంతుడికీ, అన్నిటినీ జయించిన మహావీరుడికీ పాతాళానికి కూడా పోగలిగిన ఔదార్యం ఉంటుంది. నిర్జీవులతో సహా అందరినీ ఒకే రకంగా చూడగలిగిన సమభావం ఉంటుంది. భూమిమీద పతితులనూ, భ్రష్టులనూ ఉద్ధరించే నాయకులు అలాటివారే. బహుశా భగవంతుడు పతిత జనసముద్ధరణకోసమే వారిని పాతాళానికి తొక్కేస్తాడు. ఈ వ్యాఖ్యానాన్ని దృష్టిలో పెట్టుకొని, కొన్ని గొంతులచేతా, నిర్జీవిచేతా, మాట్లాడించి మధ్యలో ఫ్లాష్‌బాక్ పద్ధతిలో కృతయుగంలోని వామనావతార ఘట్టాన్ని వినిపించడానికి పోతన భాగవతాన్ని యథాతథంగా ఉపయోగించుకున్నారు. శ్రీ శ్రీకి పోతన అన్నా, భాగవతమన్నా ప్రాణం. అయితే పీడనకి గురయ్యే వాళ్ళ పక్షాన్ని వహించే సద్బుద్ధి కలిగిన వారవడం వల్ల వామనావతార గాథను సమర్థించలేక పోయారు. ఆ గాథనే తీసుకొని బలిని వామనమూర్తి పాతాళానికి అణగదొక్కిన కథను పోతనగొంతు తోనూ, సుదీర్ఘ సమాస భరిత వచన రచనతో చేసిన తన కల్పిత కథను తనగొంతుతోనూ చక్కని వ్యవహారిక భాషతో నడిపిస్తారు.

మరణానంతర జీవితం అన్నా పరలోకయానం అన్నా శ్రీ శ్రీకి విపరీతమైన obsession ఈ నాటికలోని నిర్జీవిపాత్రా, అతను నిర్జీవిగా ఉండడానికే ఎక్కువ మక్కువ చూపించడమూ శ్రీ శ్రీకి ఉండే obsessionని పట్టిస్తాయి. శ్రీ శ్రీకి నరకం అంటే ఇష్టం. గొప్పవాళ్ళు నరకంలోనే ఉంటారని కవుల భావన. ఈ భావన కనుగుణంగానే శ్రీ శ్రీ 'నరకంలో గురజాడ' అనేవ్యాసం రాశారు. శ్రీ శ్రీకి నరకానికి వెళ్ళాలనే తప్ప స్వర్గానికెళ్ళాలనే కాంక్షలేదు[52]. తన అభిప్రాయాల కనుగుణంగానే శ్రీ శ్రీ ఈ నాటికలో పాపాత్ములుండే స్వర్గం కన్నా మహాత్ములుండే నరకమే మేలుతరమని ప్రతిపాదిస్తారు. Milton "Paradise Lost" కావ్యంలో Satan పాత్రచేత

"Better to reign in Hell

than serve in Heaven"

-అని అనిపించడాన్ని గుర్తు తెస్తాయి[53].

మిల్టన్ రచనల్ని గురజాడ అధ్యయనం చేసినట్లే, మిల్టన్, గురజాడల రచనల్ని శ్రీ శ్రీ అధ్యయనం చేశారు. గురజాడలాగే శ్రీ శ్రీ స్వర్గం కంటే నరకాన్నే అధికంగా ప్రేమిస్తారు. ఈ భావైక్యత పతితుల్నీ, పదభ్రష్టుల్నీ ఒకేలా ప్రేమించే సుగుణం ఉండడం వల్ల వారిలో ఏర్పడింది.

నీటి అలలతోపాటు కదిలే చంద్రుడి ప్రతిబింబాన్ని 'జలాంతశ్చంద్రచపల' అనే అప్సరసగా చెప్పడంలో అందమైన భావుకత ఇమిడి ఉంది. పతిత జన సముద్ధరణ కోసం పాతాళ జీవితానికి బలిఐపోయే ప్రతిమహానుభావుడూ బలి చక్రవర్తేననే ధ్వని కూడా ఉంది. అత్యున్నత మానవత్వమే శ్రీ శ్రీ దృష్టిలో దైవత్వం. బలి మానవత్వం మూర్తీభవించిన దేవుడు. పలుప్రాంతాలలో బలి మీద ఇంకా ఆదరాభిమానాలున్నాయి. 'ఓణం' పండుగకి బలి చక్రవర్తి భూలోకానికి వస్తాడనీ, సమలంకృతమైన గృహాలను వీక్షించి, ఆనందించి శుభాలను కలగజేస్తాడని కేరళీయుల విశ్వాసం. ఆ కారణంవల్లే వివిధ పుష్పాల రేకులతో గృహ ప్రాంగణాలలో రంగవల్లులు తీర్చి దిద్దుతారు కేరళస్త్రీలు. ఆంధ్ర దేశాన కూడా సంక్రాంతి పండుగకు బలిని ఆహ్వానించడానికి ఇంటి ముంగిట రంగవల్లులు తీర్చి, గొబ్బెమ్మల నుంచి, పువ్వులను చెరుకు గడలను ఉంచుతారు తెలుగువారు. ఇవి బలిమీదున్న మక్కువకి నిదర్శనాలు.

**దడిగాడు వానసిరా**

**ఇతివృత్తం**

ప్రొడ్యూసర్ శ్రీనివాస్, భార్యలత ప్రోత్సాహంతో ఒక పాత నవల సినిమా హక్కులు కొంటాడు. ఆ నవల రాసిన 'జింటాన్' తర్వాత కాలానికి ఉడిపిశ్రీ అవుతాడు. ఆ నవలని హీరో, డైరెక్టరూ, ప్రొడ్యూసరూ ఇష్టమొచ్చినట్లు మార్చేస్తారు. 'ముద్దులు- హద్దులు' పేర రిలీజై 100 రోజులు విజయవంతంగా నడుస్తుంది. పాటలకవీ, హీరోయిన్, సంగీత దర్శకుడూ, హీరో, దర్శకుడూ- ఎవరికివారు ఆ విజయం

తమదేనని భావిస్తూ తెగ వాదించుకుంటారు. వీళ్ళందరి నీడల్లో తన అస్తిత్వాన్ని పోగొట్టుకున్న కవి 'గాడిద'గా మిగిలిపోతాడు. రాసిన వాడెప్పుడూ చిత్ర పరిశ్రమలో 'దడిగా'నే మిగుల్తాడనే సందేశాన్నందిస్తారు శ్రీ శ్రీ ఈ నాటిక ద్వారా.

**విశ్లేషణ**

'విదూషకుడి ఆత్మహత్య'లో రంగస్థల నటుల వేదనను గురించీ 'శిరస్సు చెప్పిన రహస్యం'లో చిత్రకారుల వెతలను గురించీ వివరించిన శ్రీ శ్రీ ఈ నాటికలో చలనచిత్ర పరిశ్రమలో రచయిత స్థితి ఎంత దిగజారిందో వివరిస్తూ ఆవేదన చెందుతారు. సినీరంగంలో కవికి ప్రాధాన్యం ఉండాలని, పెట్టుబడి దారులైన ప్రొడ్యూసర్లు పెత్తనం చేసి తమకి ప్రవేశంగానీ, ప్రావీణ్యంగానీ లేని సాహిత్యరంగంలో అడుగుపెడితే అది భ్రష్టుపట్టక తప్పదని శ్రీ శ్రీ నొక్కి చెప్తారు.

**స్వామి : భూస్వామి**

**ఇతివృత్తం**

భూ పరిమితి చట్టం రాగానే ఒక భూస్వామి తన రెండవ భార్యకు విడాకులిచ్చి, కూతురి వయస్సున్న ధనలక్ష్మిని మూడోపెళ్ళి చేసుకుంటాడు. అయితే, ఒక స్వాములవారి బోధనతో, స్వంత ఆస్తిని పరిరక్షించు కోవడానికై ఆమెకు విడాకు లిస్తాడు. శివాలయం కట్టించి, తమ భూముల్లో కొన్నింటిని ఆ శివాలయానికి బట్వాడాచేసి, ధనలక్ష్మిని ధర్మకర్త గా నియమిస్తాడు. ఆయోచన చెప్పిన స్వామీజీకి తన భార్యని అప్పగిస్తాడు. భూస్వామి చేసిన ఈ విధమైన దుర్మార్గపు పనులన్నిటికీ ప్రస్తుత వ్యవస్థలో పరాన్న భుక్కుగా తయారైన కవి వంతపాడుతూ ఉంటాడు. అంతేగాక తన కావ్యాలను స్వామికీ, భూస్వామికీ అంకితాలిస్తూ ఉంటాడు. ఆ కావ్యాలన్నీ పూర్వ కవుల కావ్యాలకు నకళ్ళే!

**విశ్లేషణ**

ఈ నాటికలో రకరకాల సామాజిక రుగ్మతలను స్పృశించడం వల్ల, సామాజిక ప్రయోజనాన్నాశిస్తూ రచించిన రేడియో నాటికగా దీన్ని అభినందించవచ్చు. భూ పరిమితుల చట్టం రాగానే భూస్వాములు స్వప్రయోజనాలకి జరుపుతున్న అనర్థాలూ, కుహనా స్వాములవార్లూ, ఈ ఉభయుల నాశ్రయించుకున్న కవిబృందాలూ, ఆ కవి బృందాలు పూర్వకవుల కావ్యాలను కాస్త అటూయిటూగా మార్చి రచనా వ్యాపారం సాగించడాలూ – వంటి ఎన్నెన్నో సామాజిక సమస్యల్ని చేపట్టి, ఈ నాటిక రూపాన ఆయా సమస్యలకు కారకులైన వారిని శ్రీ శ్రీ దుయ్యబట్టారు. ఈ నాటికలో కవిహైన్యాన్ని ఎంత తీవ్రంగా దుయ్యబట్టినా, ఆ హీనస్థితికి దిగజారిన కవిమీద శ్రీ శ్రీకి సానుభూతి ఉండడం వల్ల శ్రోతలకి ఆ పాత్రమీద అసహ్యం జనించదు. కవులవంటి మేధో జీవులను భ్రష్టు పట్టించిన ధన ప్రాధాన్యంగల వ్యవస్థమీదే జుగుప్స కలిగింపజేసే ప్రయత్నాల్లో శ్రీ శ్రీ కృతకృత్యులయ్యారు. కరణం, కవి, స్వామి, భూస్వామి వ్యవస్థ తాలూకు నాలుగు మూలస్తంభాలు. కరణం పాలనా వ్యవస్థకి చిహ్నం. కవి మేధావి

వర్గానికి ప్రతినిధి. సంప్రదాయ వ్యవస్థకి ప్రతీకస్వామి. భూస్వామ్య వ్యవస్థకి సంకేతం భూస్వామి. ఈ భావాన్ని స్ఫురింప జేయడానికై స్వామినోట

"మన ఇద్దర్నీ కలుపుకునే నాలుగు దిట్టమైన స్తంభాలు. యథా
తథస్థితిని చెక్కుచెదరకుండా అట్టేపెట్టడానికే మనం ఉన్నాం".

-అని అనిపింపజేస్తారు శ్రీ శ్రీ[54].

చరిత్ర చెప్పని సందేశం

ఇతివృత్తం

రామచంద్రరావు చెన్నపట్టణంలో చదువుకుంటున్న సైన్స్ విద్యార్థి, కవికూడా. ధ్వని ప్రసరణ యంత్రాన్ని కనిపెడతాడు. దాని సహాయంతో భూత కాలపు సంఘటనల్ని వినవచ్చు. ఒక సభపెట్టి, రామచంద్రరావుని అధ్యక్షుణ్ణి చేసి ప్రసంగించమంటారు కొందరు ప్రముఖులు. అతడు 'దేశ చరిత్రలు' గేయంపాడి ఉపన్యాసం అయిందన్నట్లుగా సభకి నమస్కరించి కూచుంటాడు. ప్రతినిధులుగా వచ్చిన కొందరు పెద్దలు అవమానంగా భావించి నిష్క్రమిస్తారు. రామచంద్రరావుని అదేమిటని అడిగితే తాను చిత్తశుద్ధితో నమ్మినదాన్ని చెప్పానంటాడు. తర్వాత రోజు జరగబోయే సభలో భూతకాల శబ్ద గ్రహణ యంత్రాన్ని ప్రదర్శిస్తూ దానిమీద తయారు చేసిన థీసిస్ చదివితే సభ జయప్రదమౌతుందంటారు. అల్లసాని పెద్దన రాయలసభలో గండపెండేరానికి ముందు చదివిన ఉత్పలమాలికను శ్రమపడి రికార్డు చేశానంటాడు రామచంద్రరావు. అవి వెయ్యి కాపీలు తీసి కాపీ నూరు రూపాయల కమ్మితే లక్షరూపాయ లొస్తుందంటాడు శ్యామశాస్త్రి. ఆ దృక్పధానికి తాను విరోధిననీ తన పరిశోధన మానవజాతి మొత్తానికనీ, అమ్మడానికి వీల్లేదనీ రామచంద్రరావు అంటాడు. పెద్దన ఉత్పల మాలికను చదివి వినిపిస్తే అందరూ "సెభాష్" అంటారు. ఆ యంత్రంతో మహాభారత యుద్ధకాలం నాటి వరకూ వెళ్ళ గలిగాననీ, ప్రయత్నిస్తే మహర్షులు ఋగ్వేదం ఎలా పఠించిందీ, వానరభాష నుండి ఆది మానవుల భాష ఏ విధంగా పరిణమించిందో తెలుసుకోవచ్చుననీ తనకీ పదవులొద్దనీ, ప్రశాంతంగా పరిశోధన చేసుకోనిస్తే చాలుననీ అని వెళ్ళిపోతాడు. అలా వెళ్ళిన రామచంద్రరావు ఏమైపోయాడో ఎవరికీ తెలీదు. చివరికి రామచంద్రరావు పిచ్చివాడైనా అయి ఉండాలి. లేకపోతే నరసింహం ప్రభృతులు కలైనా కని ఉండాలి అనే కథనకంఠం మాటలతో నాటిక ముగుస్తుంది.

విశ్లేషణ

ఈ నాటికలో సందర్భానుసారంగా తన 'దేశ చరిత్రలు' కవితనేగాక, అల్లసాని పెద్దన ఆశువుగా చెప్పిన ఉత్పలమాలికను కూడా చేర్చారు శ్రీ శ్రీ. శ్రీ శ్రీ నాటికల్లో ఏ రంగానికి ప్రసిద్ధి చెందిన ప్రముఖుడి పాత్ర ఉన్నా, ఆ పాత్ర తప్పనిసరిగా సాహిత్యరంగంలో అభినివేశం కలిగినదై ఉంటుంది. 'శిరస్సు చెప్పిన రహస్యం'లో కైలాసం శిల్పేకాక కవికూడా. అతను శ్రీ శ్రీ 'మహాప్రస్థానం'లోని 'కవితా! ఓ కవితా!' కవితను

చదివితే, ఈ నాటికలో సైంటిస్టైన రామచంద్రరావు 'దేశ చరిత్రలు' కవితను నిండుసభలో పఠిస్తాడు. ఆ నాటికలో కళమీద దోపిడీ ఎలాసాగుతుందో, కళకి 'ఖరీదు కట్టేషరాబు' లెలా బయల్దేరుతారో వివరించిన శ్రీ శ్రీ ఈనాటికలో విజ్ఞానం ఎలా బజారు సరుకుగా మార్చబడుతోందో, విజ్ఞానానికి క్రయవిక్రేతలెలా తయారవుతారో వివరించారు. ఉన్నతమైన విలువలూ, ఉత్తమాభిరుచులూ నశించిపోతున్నందుకు ఆవేదనను వ్యక్తంచేస్తూ ప్రజల్లో వ్యాపార దృక్పథం ఎంతగా ముదిరిపోయిందో చెప్పడానికి శ్యామశాస్త్రి పాత్రచేత లక్షరూపాయలెలా సంపాయించవచ్చో చెప్పిస్తారు. ఉదాత్తమైన ఆశయాలు గల రామచంద్రరావు శ్యామశాస్త్రి వంటివాళ్ళతో, అతని చుట్టూఉన్న అటువంటి సమాజంతో విభేదించి నిష్క్రమిస్తాడు. అతన్ని అభిమానించే నరసింహం వంటివారికి అతనొక ఆదర్శమైనా, గాలి వార్తలకే అత్యంత ప్రాధాన్యమిచ్చే పత్రికల వాళ్ళకీ, ఆ పత్రికలు ప్రచురింపబడి ప్రాచుర్యంలోకి వచ్చే సమాజానికీ రామచంద్రరావు ఒక ఉన్మాది మాత్రమే! నరసింహం వంటి వాళ్ళు రామచంద్రరావు లాంటివాళ్ళని కలలో మాత్రమే దర్శించ గలుగుతారని నొక్కి చెప్తుంది ఈ నాటిక.

మొత్తం మానవజాతి కుపయోగపడవలసిన యంత్రాలన్నీ కొందరు వ్యక్తులపరమై, కొన్ని వ్యాపార సంస్థలపరమై, మానవ సమాజంలో ఎగుడు దిగుళ్ళు హెచ్చు తగ్గులు, ద్వేషాలు, కుట్రలు, కార్పణ్యాలు మొదలైన అమానుషాలకు దారి ఏర్పడింది. ఈ భూగోళంపై లభించే వనరులు, సంపద, మానవుడు సృష్టించిన విజ్ఞానం యావత్ప్రపంచాన్నీ సుఖ సంతోషాలతో ఉంచగల ప్రమాణాలతో ఉన్నప్పటికీ ప్రపంచంలో దారిద్ర్యం పోలేదు. మనిషిని సుఖపెట్టడానికి, అతనికి సౌకర్యాలు కలిగించడానికి ఉపయోగపడవలసిన శాస్త్రం, మనిషిని ఆహ్లాదపరిచి, ఆవేశపెట్టి మానవత్వం వికసింప జేసే కళ రెండూ మానవజాతికి దూరమై పోయాయి. వ్యక్తిగతమైన ఆస్తి, హక్కుల వ్యవస్థ ఉన్నంతకాలం మానవుడు సాధించిన విజయాలు మానవత్వ స్పర్శను కోల్పోయి, అమానుషీకరణలో భాగం పంచుకుంటాయి. మహర్షుల ఋగ్వేద కాలం నుంచీ అత్యాధునిక కాలం వరకూ పరిఢవిల్లిన విజ్ఞానమైనా, కళైనా మానవాళికి ప్రయోజనకారిగా వారి అభ్యుదయానికి దోహదకారిగా కావాలన్న శ్రీ శ్రీ సత్సంకల్పం ఈ నాటికలో శ్రోతలకి విశదమవుతుంది.

**జడభరతుడు**

**ఇతివృత్తం**

కవీ, డైరెక్టర్ల సంభాషణతో నాటిక మొదలౌతుంది. కవితన నాటకం పౌరాణికమనీ, తానీ నాటకంలో అన్ని సంస్థల్నీ ముఖ్యంగా విప్లవవాదుల్నీ ఏకిపారేశాననీ చెప్తాడు. డైరెక్టర్ అభ్యర్థనతో కవి కథ వినిపిస్తాడు. కావలి వాడికి సుదీర్ఘ స్వగతం ఉన్నందుకు డైరెక్టర్ అడ్డు చెప్తాడు. డైరెక్టర్ భావాల కనుగుణంగా కథని మార్చేస్తాడు కవి. కవికి నాటకం సినిమాగా రూపొందాలన్న ఆశైతే, కావలివాడికి టీ దొరికితే బాగుండునన్న

ఆశ. 'టీ' గురించి డైరెక్టరూ, కవీ ఘర్షణ పడతారు. కవి నాటకకథలో ఆర్యవీరసేనుడు జడభరతుణ్ణి 'ఒక్కరాత్రి తన ఉద్యోగం నిర్వహించమ'ని వేడుకుంటాడు. కథలో పునరుక్తులకి డైరెక్టర్ విసుక్కుంటాడు. కావలి వాడి భార్యకోసం కవిరాసిన సుదీర్ఘ గ్రాంధిక వాక్యాలినామె సరిగ్గా పలకలేకపోతే డైరెక్టర్ కవిని అపహాస్యం చేస్తాడు. కవి అందుకేమాత్రం బాధపడకుండా తేలిగ్గా తీసుకుంటాడు.

విశ్లేషణ

ఈ నాటికలో ఇదమిత్థంగా కథ అనేదిలేదు. జడభరతుడు పౌరాణిక పాత్ర. ఈ పాత్రకి, నాటికకి పెద్దగా సంబంధం ఉండదు. 'స్వామి-భూస్వామి' నాటికలో భ్రష్టత్వాన్ని పొందిన కవి దుస్థితిని చూపించినట్లే ఈ నాటికలో కూడా అదే దుస్థితికి లోబడిన కవినీ, అతని నిర్లజ్జనీ దర్శింప జేస్తాడు. గ్రాంధికం మీద శ్రీ శ్రీకి ఏవగింపు ఉంది. గ్రాంధిక భాషలో రచనలు గావిస్తున్న పౌరాణిక నాటక కర్తలందరిపైనా శ్రీ శ్రీ డైరెక్టర్ చేత హేళన చేయిస్తారు. కవి తదితర వర్గాలకి పట్టిన సినిమా మోజు, రుగ్మతల్ని నిరసిస్తూనే, అణగారిన వర్గానికి కప్పు టీ దొరకడం ఎంత కష్టమై పోయిందో వివరిస్తారు శ్రీ శ్రీ. శ్రోతలకి, కవిపాత్రపైనా, ఆ తరహా వ్యక్తులందరిపైనా జుగుప్సని కలిగించేలా ఉంది. పౌరాణిక నాటకం రాస్తున్నా సబబూ, సందర్భమూ లేకుండా రాజకీయాలను ధ్వనింప జేయడమే గాక, విప్లవ వాదులను ఏకి పారేయడం వంటి కుయుక్తులకి దాన్ని ఆలవాలంగా మార్చిన కవిమీదా, అతని అవకాశంమీదా విపరీతమైన ఆగ్రహం శ్రోతలకి కలిగేలా చేస్తారు శ్రీ శ్రీ. తనమనసులో ఎవరెవర్ని నిందించాలో ముందుగా ప్లాన్‌వేసి పెట్టుకొని, దాని కనుగుణంగా రచనలు గావిస్తూ మెహర్బానీకి ఈ నాటిక "ఎవర్నీ ఉద్దేశించి రాసింది కాదు" అని ప్రకటించే రచయితల మీద శ్రీ శ్రీకి ఏమాత్రం సదభిప్రాయం లేదు. ఈ నాటికలో అది స్పష్టంగా తెలుస్తుంది.

ఇంతవరకూ శ్రీ శ్రీ రేడియో నాటికలను, వాటిలోని విషయాన్ని అవగాహన చేసుకోవడానికి అవసరమైన భూమికను అందించడం జరిగింది. శ్రీ శ్రీ నాటికలన్నీ ప్రధానంగా మూడునాలుగు సమస్యలమీద రాయబడ్డాయి. మానవత్వం, సమత,కాలం, మృత్యువు ప్రత్యక్షం గానో పరోక్షంగానో ఈ సమస్యలో దేనినో ఒకదాన్ని స్పృశించని నాటిక లేదంటే అతిశయోక్తి కాదు.

శ్రీ శ్రీ నాటికల్లో ఆది మధ్యాంతాలుండవు. ధ్వని మయాలు. భావగర్భితాలు[55].

"కథ ఉండదు. కథా వస్తువుంటుంది. Bernard Shaw నాటకాలు కూడా ఇలాగే ఉంటాయి. So plays of ideas like Shaw's plays. హృదయ స్పందనను గమనించవచ్చు. So plays of feelings also."

–అని అంటారు అబ్బూరి గోపాలకృష్ణ[56]. వస్తువుకీ, ప్రక్రియకీ అవినాభావ సంబంధ ముంటుంది. రచయిత ఆలోచనలు సమాజంలో వస్తున్న బహుముఖమైన పరిణామాల కనుగుణంగా ఆర్థికంగా, రాజకీయంగా తాత్త్వికంగా, వైజ్ఞానికంగా వికసించి అంతర్గత

చైతన్యానికి దారి తీస్తాయి. సమాజం వర్ణ వర్గరహిత సమసమాజ వ్యవస్థగా రూపొందడానికి ఘర్షణ చెందే అవస్థలో ఉంది. ఘర్షణ కూడా అనివార్యం. సాహితీ రంగంలోని మేధావి వర్గం ఈ స్వరూపాన్ని అర్థం చేసుకుంది. సమసమాజ నిర్మాణం వైపుకి మొగ్గుచూపిన రచయితలలో శ్రీ శ్రీ ముఖ్యులు. శ్రీ శ్రీకి ప్రాచీన తెలుగు సాహిత్యంతోనూ, ఆధునిక యూరప్ సాహిత్యంతోనూ గాఢమైన పరిచయం ఉంది. 20వ శతాబ్దంలోయూరప్ కళా ప్రపంచంలో డాడాయిజమ్, సర్రియలిజమ్, ఎగ్జిస్టెన్షియలిజమ్ మొదలైన కళా సిద్ధాంతాలు అనేకం ఈ శతాబ్దంలోనే ఉద్భవించి, వికసించాయి. సహజంగా ఆయా ప్రభావాలు శ్రీ శ్రీ లాంటి ఆసక్తి పరునిమీద పనిచేయటంలో ఆశ్చర్యమేమీలేదు.

శ్రీ శ్రీకి అంతర్జాతీయత అంటే ఎంత మోజుందో, జాతీయత అన్నా, ఉపజాతీయత (ఆంధ్రత్వం) అన్నా అంత మోజుంది. విజ్ఞాన శాస్త్రం ఆయనకు ఇంచుమించు ఒక 'మూఢ విశ్వాసం'. కళకూ, విజ్ఞాన శాస్త్రానికీ వైరుధ్యం లేదని మరో నమ్మకం.

బహుముఖంగా ఆధునికయుగంలో ఉవ్వెత్తున వచ్చిన వికాసాన్ని ఏకోన్ముఖంగా సమసమాజ నిర్మాణ సాధన కుపయోగించడమే శ్రీ శ్రీ లక్ష్యం. పండిత పామరులను సమంగా ఆకర్షించగలిగే సత్తా ఉన్న రేడియో అతని దృష్టి నాకర్షించింది. శ్రీ శ్రీ తన రేడియో నాటికలను స్వల్ప పరిమాణం కల ఇతివృత్తంలో అత్యంత గంభీరార్థాలను శ్రోతల హృదయాలలో స్ఫురింప జేయాలనే ఉద్దేశ్యంతో ప్రయోగించారు. అందుకే ఈ నాటికలకు స్వతంత్ర అస్తిత్వం తక్కువ. వైజ్ఞానిక నేపథ్యంతో హేతుబద్ధ దృక్పథంతో పరిశీలించినపుడు- అగాధమైన ఈ ఇతివృత్తాల గంభీరార్థాలు శ్రోతలకు విశదమౌతాయి. ప్రతి నాటికలోనూ ఒక విచిత్రమైన కొత్త వస్తువుని ఎన్నుకోవడమే వస్తువుకి సంబంధించి నంతవరకూ ప్రయోగం. ఆ వస్తువు కనుగుణంగా స్వరూపాన్ని రూపొందించడంలో తీసుకున్న శ్రద్ధ ఎటువంటిదో, ఆ శ్రద్ధతో ఎలాంటి వినూత్న ప్రయోగాలు చేశారో నాలుగో అధ్యాయంలో పరిశీలిద్దాం.

  

అధ్యాయం 4

# శ్రీ శ్రీ రేడియో నాటికలు : వివిధ ప్రయోగాలు

సాహిత్యంలో ఆధునికత పేరిట యూరప్‌లో సింబాలిజమ్, ఇమేజిజమ్ ఇంప్రెషనిజమ్, ఫ్యూచరిజమ్, డాడాయిజమ్, నేచురలిజమ్, సర్రియలిజమ్ మొదలైన ఇజాలన్నీ ప్రయోగవాదంలోని భాగాలు. దాదాపు ఈ వాదాల నినాదం ఒకటే! అది 'కళ కళకోసమే[1]'. ఈ నినాదాన్నాధారం గావించుకొని ప్రయోగవాద మనేది ప్రధానంగా శిల్పానికి సంబంధించినదని చెప్పవచ్చు. అయితే, రియలిజం మాత్రం అందుకు భిన్నమైంది. ఇది వస్తు ప్రాధాన్యాన్ని ఇనుమడింప జేస్తూ, వాస్తవిక పరిస్థితుల్ని యథాతథంగా కళ్ళ ముందుంచే ఉత్తమమైన ప్రయోగం[2]. పాశ్చాత్య దేశాల్లో శిల్ప ప్రాధాన్య ధోరణులెన్ని వచ్చినా, ఆధోరణులన్నీ శ్రీ శ్రీ చేపట్టలేదు. కేవలం అధివాస్తవికవాదం మాత్రమే అతన్నాకర్షించి, కొంతవరకు దానిని తెలుగులోకి తీసుకువచ్చేలా చేసింది[3]. మిగిలిన వాదాలన్నింటికీ తగిన పరిస్థితులాంధ్రదేశంలో లేవని గ్రహించి ఉంటారు శ్రీ శ్రీ.

> "గుడ్డిలో మెల్లగా శ్రీ శ్రీ శ్రీరంగం నారాయణ బాబులా అగమ్య గోచరమైన అధివాస్తవిక కవిత్వాన్ని రాయలేదు. ఎందుచేతనంటే రాయలేడు కనుకనే. క్రియలో గుణంలో మంచిదీ, మిన్నైనదీ దానినెప్పుడూ విస్మరించ లేకపోయాడు శ్రీ శ్రీ."

అని అంటారు నగ్నముని[4]. శ్రీ శ్రీ రాసిన అధివాస్తవిక రచనలను జాగ్రత్తగా పరిశీలిస్తే ప్రయత్న పూర్వకంగా అధివాస్తవిక ధోరణులను వాస్తవికతా మార్గంవైపు మళ్ళించినట్లు గ్రహించవచ్చు.

వస్తువుతో సంబంధం లేకుండా స్వరూపం దానంతటదే మారిపోదు. అందువల్లే ప్రయోగవాద నాటక రంగంలో వచ్చిన ప్రతి ప్రయోగం కొత్త వస్తువుతో పాటు, కొత్త స్వరూపాన్ని కూడా తీసుకొచ్చింది. వస్తువు, స్వరూపం రెండిటి సమ్యక్స్వరూపమే శిల్పం.

శ్రీ శ్రీ కవిత్వంలో ప్రయోగాలు చేసే ధోరణి విశిష్ట లక్షణంగా అమరినట్లే ఆయన నాటికల్లో కూడా అమరింది. శ్రీ శ్రీ నాటికల్లో వస్తువులోనూ, శిల్పంలోనూ ప్రస్ఫుటంగా కన్పించే ప్రయోగాలను ఈ అధ్యాయంలో పరిశీలించవచ్చు. ఈ పరిశీలనకు ముందు ప్రయోగానికి ఎంతగానో దోహదం చేసే రేడియో నాటిక లక్షణాలు, రచనా పద్ధతులు, నిర్మాణ పద్ధతులు మొదలైన వాటిని గురించి క్షుణ్ణమైన అవగాహన అవసరం.

బాలాంత్రపు రజనీ కాంతరావు[5], మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి[6], గొల్లపూడి మారుతీరావు[7], ఇంద్రగంటి శ్రీకాంతశర్మ[8], పి.వి. రాజమన్నార్[9], నార్ల వెంకటేశ్వరరావు[10],

శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి[11], దివాకర్ల వెంకటావధాని[12], భమిడిపాటి కామేశ్వరరావు[13], పింగళి నాగేంద్రరావు[14], సముద్రాల రాఘవాచార్యులు[15], లక్ష్మీకాంతకవి[16], మొదలి నాగభూషణ శర్మ[17], ఎన్.ఆర్. చందూర్[18], కె. చిరంజీవి[19], ఆర్. అనంత పద్మనాభరావు[20], అమరేంద్ర[21], మొదలైనవారు రేడియో నాటికల గురించి తమ అమూల్యాభిప్రాయాల్ని వెల్లడిస్తూ వ్యాసాలు రాశారు. తమ వ్యాసాల్లో వీరు - రచన, నిర్మాణం, లక్షణాలు వంటి వాటిల్లో ఏదో ఒక అంశాన్ని మాత్రమే స్పృశిస్తూ రాశారు. అందువల్ల ఇవి సమగ్రమైనవి కావు. పైగా వీరంతా దాదాపుగా లక్షణాలనే చెప్పారు.

> "ఆంగ్ల సాహిత్యంలో రేడియో నాటక రచయితగా విశిష్టమైన స్థానాన్ని సంపాదించుకున్న ఆధునికకవి లూయీమెక్నీస్. ఆయన ప్రసారం చేసిన రసవంతమైన రూపకాలని "క్రిస్టఫర్ కొలంబస్" "ది డార్క్ టవర్" అనే సంపుటాలలో ప్రచురించాడు. ఆ గ్రంథాలకి పీఠికల రూపంలో మెక్నీసు రేడియో రూపకాల స్వరూప స్వభావాలని గురించీ, వాటి నిర్వహణలోని సాధక బాధకాలని గురించీ కొన్ని అమూల్యమైన అభిప్రాయాలు వెల్లడించాడు. కొత్త రచయితలకి దారి చూపగల సూచనలెన్నో ఈ పీఠికల్లో కనిపిస్తయ్-రేడియో నాటక రచయితలందరూ పరిశీలించి, గుర్తించి, అనుసరించదగిన అంశాలు మెక్నీసు పీఠికల్లో ఎన్నో ఉన్నయ్[22]."

అని అంటారు అమరేంద్ర. అమరేంద్ర ప్రశంసించిన లూయీమెక్నీస్‌ని గురించి Ian Rodger తన "Radio Drama" అనే గ్రంథంలో ఇలా అంటారు.-

"Macniece's plays are classics of the radio genre and his work had enormous influence upon the work of younger generations[23]."

అందువలన రేడియో నాటక రచయితగా ప్రపంచ ప్రసిద్ధిగాంచి, అద్భుతమైన రూపకాలు రచించిన లూయీమెక్నీస్ రేడియో రచనల గురించి వెలువరించిన అభిప్రాయాల నిక్కడ ప్రస్తావిస్తున్నాను.

**రేడియో రచన – లక్షణాలు[24]**

మామూలుగా పత్రికలకోసం, పుస్తకాలకోసం, ప్రదర్శనల కోసం నవల, నాటిక, కవిత్వం ఏదిరాసినా అది జనంలో ప్రచారమయ్యే అవకాశం ఉంది. కానీ రేడియోకోసం చేసిన రచనలవల్ల అంత ప్రచారాన్ని ఆశించే అవకాశం లేదు. రేడియోలో వచ్చిన కార్యక్రమం ఒక్కసారి విన్న తర్వాత మళ్ళీ దాన్ని పునః పరిశీలించుకోవడానికి గానీ, ఆలోచించుకోవడానికి గానీ వీలుండదు.

ధ్వని ప్రసార సాధనం రేడియో. దీని శక్తి అంతా ధ్వనిలోనే. ఒక మంచి నాటిక ప్రసారమయిందంటే ఒక మంచి రేడియోస్క్రిప్ట్ ఉందన్నమాట. ఒకవేళ అది గొప్ప స్క్రిప్ట్ కాకపోయినప్పటికీ, రచయిత ధ్వనిని అర్థవంతం చేశాడని అర్థం. మంచి రచయిత తనతో సంబంధం ఉన్న పదాలతోనే రచన అల్లుతాడు. కానీ రేడియో రచయిత నటులనోటి నుంచి వచ్చే పదాల గురించి ఆలోచించవలసి ఉంటుంది. మామూలు రచయిత ఉపయోగించే పదగాంభీర్యం గానీ, ఆలోచనా ధోరణిగానీ రేడియో రచయితకు తరచూ ప్రతిబంధకంగా ఉంటుంది. అయితే శ్రోతలకు రేడియో నటులు

కనిపించరు. కనుక కొన్నిసార్లు సాహిత్య ప్రయోగాలు లేకుండా తప్పించుకోగలగడమనే సౌలభ్యం కూడా ఉంటుంది.

మాట్లాడబడే పదాలకు లొంగిపోవడం రేడియో రచయితకు తప్పనిసరి. కానీ దీనివల్ల లాభాలూ నష్టాలూ ఉన్నాయి. రేడియో రచయిత రాసిన వాక్యం విలువను ఆ వాక్యం ఉచ్చరించే కంఠం పెంచుతుంది. ఒకే వాక్యం రాసి, దాన్ని పలురకాలుగా ఉచ్చరించి, పలు ప్రయోజనాలు సాధించవచ్చు. మామూలు రచనలో ఈ ప్రయోజనాలు సాధించాలంటే భాష గాంభీర్యాన్ని పెంచి పలు ప్రయోగాలు చేయాలి. రేడియో రచయిత ముఖ్యంగా సరళత్వాన్నీ, శబ్దాలు సాధించే ప్రయోజనాలనీ గుర్తుపెట్టుకోవాలి. అతని వ్యాపారమంతా మాట్లాడే పదాలు, వినబడే పదాలతోనే.

## శ్రోతలకి తగ్గట్లు రాయాల్సిన ఆవశ్యకత

రేడియో రచయిత రేడియో పరిమితులకు తగ్గట్లే గాక, తన శ్రోతలకు తగ్గట్లు కూడా పరిమితమై రాయవలసి ఉంటుంది. ఈ శ్రోతలు లక్షల్లో ఉండవచ్చు. కానీ వీరందరూ ఒక రేడియో రచయిత రాసిన రచనని వినాలనే నిబంధనేం లేదు. ఎక్కువమందిని ఆకర్షించేటట్లుగా రేడియో రచయిత రాయాలి. శ్రోతలకు అర్థం గాకుండా, వారి ప్రమాణాలకు సరిపోకుండా, వారిని బాగా ఇబ్బంది పెట్టే రచనలవల్ల ఫలితం ఉండదు. సభ్యతనీ, ప్రజాదరణనీ దృష్టిలో ఉంచుకొని రాయాలి.

రేడియో నాటిక ఇతర నాటికలలాగా కాదు. హేతుబద్ధత కంటే ఉద్వేగాలకు ప్రాధాన్యం ఇవ్వాలి. విద్యాధిక శ్రోతలకంటే సునిశితమనస్కులైన శ్రోతలకు విలువివ్వాలి. విద్య ద్వారానే కళాత్మక సున్నితత్వాన్ని మెరుగు పరచవచ్చు. అలాగని విద్యాధికులు కాని వారంతా సున్నిత మనస్కులు కారనీ, ఉద్వేగం చెందరనీ కాదు.

## రేడియో నాటిక – కవిత్వం

అన్ని కళలూ ఏదో ఒక స్థాయిలో రాజీ పడక తప్పదు. రేడియో నాటిక కూడా అంతే. తన ప్రమాణాలను కోల్పోకుండా రచయిత తాను ప్రజల్లోకి ఎంతదూరం పోగలడో గ్రహించాలి. అయితే కాగితంపై రాసే కవిత్వానికి ఉండే స్వేచ్ఛ అతని కుండదు. ప్రసార సాధనం, శ్రోతలసంఖ్య, వైవిధ్యం దృష్టిలో ఉంచుకొని రేడియో రచయిత చాలా ప్రాథమిక స్థాయి నుండి వారిని అర్థం చేసుకోవలసి ఉంది. ప్రాథమికస్థాయి అంటే బాల్యదశకు చెందిందని కాదు. ప్రతిమనిషీ పుడుతూనే కొంత కవితాత్మతో జన్మిస్తాడని గుర్తుంచుకోవాలి. అందుకే బాల్య దశలో కవిత్వ రూపంలో ఉన్న నర్సరీరైమ్స్‌తో మొదలుపెట్టి నేర్చుకుంటాడు. వచనం కన్నా కవిత్వం ప్రాచీనమైనది. మెదడుపై తక్కువభారం వేసి చెవికి సులభంగా అందించేది కవిత్వం. అందువల్ల శ్రోతల ప్రాథమిక స్థాయిని దృష్టిలో ఉంచుకొని రేడియో నాటిక రాసేటపుడు కవిత్వ దృక్పథంతో వ్యవహరించాలి. కవిత్వ దృక్పథమంటే కవిత్వం రాయాలని కాదు. రేడియో శ్రోత కవసరమైన శక్తిమంతమైన లయపూరకమైన భాష రేడియో నాటికకు అవసరం.

## రేడియో నాటిక – నిర్మాణం

రేడియో స్క్రిప్ట్ నిర్మాణ ప్రధానమై ఉండాలి. తేలికైన లయతో కూడిన పదాలతో జాగ్రత్తగా రచన చేయవలసి ఉంటుంది. దృశ్యాల ఎంపికలో సమగ్రత ఉండాలి.

వాస్తవాన్ని నాటకీకరణ చేసి సమర్పించాలి. ఉన్న అంశాన్ని శక్తిమంతం చేయాలి. సమయం తక్కువ కాబట్టి ప్రతిమాటా పొదుపుగా వాడాలి. శ్రోతలకి వినడం ద్వారా పరిస్థితి స్ఫురించాలి. నేపథ్యాలు, ఫ్లాష్‌బాక్‌లు అవసరమైనంత వరకే వాడుతూ శ్రోత జ్ఞాపకాలను దెబ్బతీయకుండా సృష్టించాలి. నాటిక కొనసాగుతుండగా దృశ్యాలు, సంఘటనలు కాలం మారుతున్నట్లు శ్రోతకు స్పష్టంగా తెలియాలి.

రంగస్థల నాటికలో సన్నివేశాలు మార్చగలిగే సౌలభ్యం ఉంటుంది. ఉదాహరణకు 1066 కాలంనాటి భారతదేశం నుంచి ఒకేసారి 1943 నాటి అమెరికాకు సన్నివేశాన్ని మార్చవచ్చు. సంగీతం, రికార్డు చేసిన ధ్వనులతో అనేకరకాల దృశ్యాలను ఏర్పరచవచ్చు. రకరకాల కోరస్‌లు సృష్టించవచ్చు. సెట్టింగులు మార్చి వాస్తవంలోకి ప్రేక్షకులను విహరింపజేయవచ్చు. వీటన్నిటి వల్ల నేత్రానందం కూడా కలుగుతుంది.

కానీ రేడియోలో శ్రవణానందం కలిగిస్తూ అన్నీ స్ఫురింపజేయాలి. కేవలం ధ్వని- అంటే పదాలను సరిగా ఉపయోగించుకోవడం ద్వారానే నిలదొక్కుకోవాలి.

## రేడియో–నిర్మాణకౌశల్యం

రేడియో నాటికను తయారు చేయడానికి కొంత సృజనాత్మక కళాహృదయం అవసరం. అంతేగాక రేడియో నాటిక మొదట్నించీ పూర్తయ్యేవరకూ నిర్మాణకౌశల్యం కూడా అవసరం. రేడియో రచయిత ఒక ఖచ్చితమైన కొలమానంలో రాయాలి. ప్రతిలింకూ గట్టిగా ఉండాలి. పేలవమైన ముగింపు ఉండకూడదు. తన శ్రోతలను తెలివిగా వశపరుచు కోవడమే గాక వారిలో ఆసక్తి నిలిచేలా చేయగలగాలి. నాటిక మొత్తం మీద ఎంత బాగున్నా మధ్యలో రెండుమూడు నిమిషాలు బోరుగా అనిపిస్తే శ్రోత రేడియో కట్టేసే ప్రమాదముంది. అందువల్ల నిర్మాణం జాగ్రత్తగా ఉండాలి. సాధారణంగా వృత్తిపరమైన నైపుణ్యం సంపాదించినవారినే రేడియో అధికారులు నాటికలు రాయడానికి పిలుస్తారు.

## కథ – ప్రాధాన్యం

రేడియో నాటికకు ఎన్నుకోవాల్సిన కథాంశమేమిటి? మామూలు రచన కవసరమయ్యే కథ ఏదైనా కావచ్చు. కథ విశాలంగా, వైవిధ్యంగా, నాటకీయంగా ఉండాలి.కథాసారాంశం, పాత్రలు అనువైనవిగా ఉండాలి.

రేడియో నాటిక కనువైన, అత్యద్భుతమైన పాపులర్ కథకు ఉదాహరణగా D.G. Bridson రాసిన "The March of the 45"ను చెప్పుకోవచ్చు[25]. ఈ నాటిక రేడియో ద్వారా సాధించిన ప్రతిస్పందన రంగస్థలంపై కానీ వెండితెరపై కానీ సాధించడం అసంభవం.

బ్రిటిష్ రేడియోలో యుద్ధకాలంలో తాజా వార్తలప్రాధాన్యం గల కథలతో నాటికలు వచ్చాయి. తాజా సన్నివేశాలకు, వాస్తవ దృశ్యానుకరణకు రేడియో సరైన సాధనం. అయితే కథాంశం| మరింత విస్తృతమై, జీవితం కన్నా సరళమై, కొంతమేరకు శిల్పంగా మలచబడినప్పుడు రేడియో నాటిక ప్రయోగాలు విజయం సాధించగలవు. వెండితెరపై కొంతమంది పాశ్చాత్య మేధావులను నిరుత్సాహ పరచిన ఐజెన్‌స్టీన్ (Eisenstein) సినిమా 'అలెగ్జాండర్ నెవెస్కీ' (Alexander Nevsky)ని లూయీమెక్నీస్ రేడియో

నాటికగా అనుసరణ చేసి అద్భుతమైన ఫలితాలను సాధించాడు. పాత్రల చిత్రీకరణలో లోపాలు మానసిక సంఘర్షణను ప్రదర్శించ లేక పోవడం మొదలైన సినిమాలోని లోపాలను రేడియో నాటికలో అధిగమించాడు.

రేడియో–నిర్వహణ (Production)

రేడియో రచయిత పదాలను, ధ్వనిని దృష్టిలో పెట్టుకోవాలని చెప్పుకున్నాం. స్టుడియో గురించి క్షుణ్ణంగా తెలియాలి. ఉన్న మైక్రోఫోన్లతో, కంట్రోల్ పానెల్ తో, గ్రామఫోన్ తో ఏ ఫలితాలు సాధించగలడో తెలుసుకోవాలి. చాలామంది బ్రాడ్ కాస్టింగ్ ప్రముఖులు రేడియో స్క్రిప్ట్ కేవలం ముడిసరుకేననీ, ప్రసారమైన తర్వాతే దానికి పూర్తిరూపం వస్తుందనీ అంటారు. ఇది అహంభావ పూరితమైన వ్యాఖ్య. నిజానికి ఒక మంచి స్క్రిప్ట్ ఉంటే, నిర్వహణ ఎలా ఉన్నా మంచి ఫలితాలొస్తాయి. మంచి స్క్రిప్ట్ రాసేటపుడు దాన్ని గ్రహించే మైక్రోఫోన్ ను, దాన్ని ప్రసారం చేసే లౌడ్ స్పీకర్ ను కూడా దృష్టిలో ఉంచుకోవాలి.

చాలామందికి రేడియో నాటిక ఎలా ప్రసార మౌతుందో తెలియదు. రిహార్సల్ అవసరమే లేదనుకుంటారు. రేడియో నాటికకు ఎన్నో సాంకేతికమైన అవసరాలున్నప్పటికీ ప్రధానంగా మూడు ముఖ్యం. అవి స్వరాలు, సంగీతం, నాటిక శ్రోతల మనస్సుకి హత్తుకునేలా చేసే ఎఫెక్ట్స్.

కంఠాలు (Voices)

రేడియోనటుల కంఠాలపై చాలా విమర్శలున్నాయి. రేడియో నటుడు రంగస్థలంపై వలె కనిపించడు. కనుకపూర్తిగా తన కంఠంపైనే ఆధారపడాలి. తన కంఠం ద్వారానే అతనొక పాత్రగా గుర్తించబడాలి. శ్రోత ఇంట్లోనే నటుడు రేడియో నుంచి రంగస్థలాన్ని సృష్టించాలి. రేడియో నాటక రచయిత తలచుకుంటే నటుడి పాత్రను సులభం చేయవచ్చు. వైవిధ్యం గల స్వరాని కనువైన సంభాషణలు రాయవచ్చు.

సంగీతం (Music)

రేడియో ప్రక్రియల్లో సంగీతం వాడడమనేది మొదట్నించీ వివాదాస్పదంగా ఉంది. కేవలం వైవిధ్యం కోసం సుదీర్ఘమైన డైలాగుల ద్వారా శ్రోతకు విసుగురాకుండా సంగీతం వాడుతున్నారనే విమర్శ ఉంది. నేత్రానందం కలిగించలేని లోపాన్ని భర్తీ చేసేందుకు, ఉద్వేగమైన వాతావరణం కోసం, మనస్థితి మార్పును చిత్రించడం కోసం సంగీతాన్ని వాడుకుంటాడు. డైలాగులకన్నా సంగీతం త్వరగా అనుకున్న లక్ష్యాన్ని సాధించ గలుగుతుంది. రేడియోలో సంభాషణలకు పూర్వం మధ్య నేపథ్యంగా సంగీతాన్ని ఉపయోగిస్తారు.

వాస్తవ సన్నివేశాల్లో నేపథ్య సంగీతం వాడరాదు. కొన్ని చోట్ల తప్పనిసరిగా వాడాలి. ఉదాహరణకు ప్రేమికులు డాన్స్ చేస్తున్నప్పుడు నేపథ్యసంగీతం అవసరం.

నాటక ప్రయోజనానికి తోడ్పడే విధంగా సంగీతం ఉండాలి. కానీ అదే ప్రధానపాత్ర వహించి నాటికను సంగీత కచేరీలా మార్చకూడదు.

ధ్వని ప్రభావాలు (Sound Effects)

'ఎఫెక్ట్స్' అంటే వాస్తవాన్ని ప్రతిబింబించే వాతావరణాని కవసరమైన సహజధ్వనులు. ఇవి రెండు రకాలు. ఒకటి గ్రామఫోన్ రికార్డులు. రెండు స్టుడియోలో అప్పటి కప్పుడు పలికించే ధ్వనులు. వాతావరణాన్ని శ్రోతహృదయానికి గోచరించే విధంగా పలికించే ధ్వనులే గాక వైవిధ్యానికీ, పొదుపుకోసం పలికించే ధ్వనులు కూడా ఉంటాయి. ఆవులు 'అంబా' అని అరచినప్పుడు వినిపించే ధ్వనులను బట్టి శ్రోత అదొక పశువులశాల అని అర్థం చేసుకుంటాడు. కొన్ని కొన్నిసార్లు సహజమైన ధ్వనులను రికార్డు చేసే బదులు సంగీత వాద్యాల ద్వారా ధ్వనులను సృజించడం మంచిది. తుఫాను, పిడుగు, వాన మొదలైన దృశ్యాలను సంగీత వాద్యాల ద్వారా సృజించవచ్చు. రచయిత కేవలం సహజ ధ్వనులతోనేగాక పదాలద్వారా కూడా దృశ్యాలను కళ్ళకు కట్టినట్లు చిత్రించగలగాలి. లేకపోతే రికార్డయిన ధ్వనులు శ్రోతలకు అలవాటై అవాస్తవికంగా గోచరించే ప్రమాదముంది. అందువల్ల రచయిత ఆచరణీయమైన, తన కథకు బలం చేకూర్చే సహజధ్వనులనే కోరాలి.

ఇంతవరకూ వివరించిన రేడియో నాటక లక్షణాలు, రచన, నిర్మాణం – నిర్వహణ పద్ధతుల్ని దృష్టిలో ఉంచుకొని గానీ, మొదటి అధ్యాయంలో వివరించిన ప్రయోగవాద లక్షణాల్ని అనుసరించి గానీ సహజ శక్తిమంతుడైన ఏ రచయితా రచనలు చేయడానికి ప్రయత్నించడు. అందువల్లే, శ్రీ శ్రీ ఫలానావాదంకోసం ఫలానా నాటిక రాశారని చెప్పలేం. ప్రయోగవాదపు స్ఫూర్తి, ప్రయోగాలు చేయడానికి అనువైన వాతావరణం శ్రీ శ్రీ మీద గాఢంగా ప్రభావాన్ని చూపించాయి అనే విషయాన్ని మనం గుర్తించాలి.

వస్తువులో ప్రయోగాలు

రచనా స్వరూపంలోని ప్రయోగం సాధారణంగా దాని వస్తువులోని ప్రయోగం వల్లనే, వస్తువులోని ప్రయోగం కోసమే ఏర్పడుతుంది. ఈ కారణంవల్లే ఏ రచయితైనా రూపంలో ప్రయోగం చేయదల్చి వస్తువు నెన్నుకోడు. వస్తువులో రచయిత చేయదల్చుకున్న ప్రయోగం కోసమే శిల్పంలో ప్రయోగం చేయవలసిన అవసరం ఏర్పడుతుంది. ఈ విషయాన్ని వివరిస్తూ శ్రీ శ్రీ 'కవితా! ఓ కవితా!'లో

"నా విన్నవి కన్నవి విన్నవించగా
మాటలకై వెదుకాడగబోతే-
అవి,
పుంఖానుపుంఖంగా
శ్మశానాలవంటి నిఘంటువులు దాటి,
వ్యాకరణాల సంకెళ్ళు విడిచి,
ఛందస్సుల సర్పపరిష్వంగం వదిలి-
వడిగా, వడివడిగా
వెలువడినై, పరుగిడినై, నాయెదనడుగిడినై!"

–అని అంటారు[26]. "వస్తువులో కొత్త ప్రయోగాలు చెయ్యాలి" అని నిర్దేశిస్తూ కవిత్వం

రాసింది కూడా శ్రీ శ్రీ యే! ఈ కవితా నిర్దేశం కోసమే "ఋక్కులు[27]" అనే కవితను రచించారు. ఈ కవిత ద్వారా 'కుక్కపిల్లా', 'అగ్గిపుల్లా', 'సబ్బుబిళ్ళా' వంటివి కవిత్వాని కనర్హం కాదనీ, దేనినైనా కవితా వస్తువుగా స్వీకరించవచ్చుననీ, అయితే రసనిర్దేశం చేయగలగాలనీ శ్రీ శ్రీ ప్రబోధించారు. శ్రీ శ్రీ రేడియో నాటికల్లో కూడా వీలైనంత కొత్త వస్తువునే తీసుకొని రచించారు. 'చతురస్రం'లోని వస్తువు పూర్తిగా భవిష్యత్కాలానికి సంబంధించింది. మానవుడు సాధించగలిగే అత్యున్నత విజయాన్ని శ్రీ శ్రీ కాలాన్ని జయించడంగా భావించాడు. ఈ వస్తువును శ్రోతలు అవగాహన చేసుకోవడానికి అనువుగా శ్రీ శ్రీ రెండు రంగాలని సృష్టించారు. అవి-విశాల ప్రపంచం ఒకటి. ఆ ప్రపంచాన ఐక్యరాజ్య సమితి సర్వసభ్య సమావేశం. నూటయాభై స్వతంత్ర దేశాలకు ప్రాతినిధ్యం వహించే నూటయాభై సభ్యులు. రెండోది చిన్న ప్రపంచం. జ్ఞానం, రాజ్యం, కవి, కళ - సంభాషించుకొనే చోటు. రెండు రంగాల్లో చర్చించే విషయాలు సామాన్య మానవాళికి సంబంధించినవి. ఈ వాతావరణ చిత్రణతో సాధించిన ప్రయోజనం భవిష్యన్మానవుడు కాలంపై విజయాన్ని సాధించిన అనుభూతిని కలిగించడం. రెండురంగాల్లో జరిగే సంభాషణల ద్వారా శ్రీ శ్రీ ఈ లక్ష్యాన్ని సాధించ గలిగారు. నాటిక రెండు సమాంతర రేఖలుగా నడుస్తుంది. యావత్ప్రపంచాన్నీ ఆయా దేశాలకు ప్రాతినిధ్యం వహించే సభ్యులద్వారా ఒక రేఖలో పొందు పరుస్తారు. భారత దేశానికంతటికీ సంబంధించిన విషయాన్ని నాలుగు పాత్రల ద్వారా మరో రేఖలో చూపిస్తారు. ఇంత ఎక్కువ విస్తృతి (Scope) కలిగిన వస్తువుని చిన్న నాటికలో ఇమడ్చడం గొప్ప ప్రయోగం. ఈ విధంగా తీసుకున్న వస్తువులోని కొత్తదనం, స్వరూపంలోని కొత్త దనాన్నంతటినీ నియంత్రిస్తుందన్న మాట!

"మరో ప్రపంచం"లో వర్తమానం లోంచి భవిష్యత్తులోకీ, భవిష్యత్తులోంచి వర్తమానంలోకీ రంగం మారిపోతూ ఉంటుంది. శ్రీ శ్రీ H.G. Welles ప్రభావంతో, విజ్ఞాన శాస్త్రపు స్ఫూర్తితో, తానూహించే సుగుణాలన్నిటితో 21వ శతాబ్దపు మానవుణ్ణి కలగంటాడు. కవి భావి మానవుణ్ణి కలగనడమే కొత్తదనం! ఇంతేగాక భవిష్యత్తును వస్తువుగా తీసుకోవడం కూడా కొత్తదనమే! భవిష్యత్తులోకి ఆశావాదంతో ముందుకు సాగిపోయే 'నెత్తురు మండే యువకులను' ఒకవైపు చిత్రిస్తూ, 'ఎముకలు కుళ్ళిన, వయస్సు మళ్ళిన ముసలివాళ్ళను" మరొకవైపు చిత్రిస్తూ భవిష్యన్మానవుడు మరో ప్రపంచంలో ఆశించిన విజయాలను కనుపాపచేత చెప్పించడం- వస్తువులో నూతనత్వానికి చిహ్నం.

'గవేషణ', 'అనంతయాత్ర'లలో మానవుడి పరలోక యాత్రను వస్తువుగా తీసుకున్నారు శ్రీ శ్రీ. 'గవేషణ'లో మానవుణ్ణి దేవుడితో పోల్చి, అతని విశాల దృక్పథాన్నీ, ఘనతనీ, వైయక్తికతనూ నిరూపిస్తారు. శ్రీ శ్రీ ఈ నాటికను రాసేటప్పటికి ఈ వస్తువెంతో కొత్తది[28]. 'అనంతయాత్ర'లో మానవుడి జీవితయాత్ర అనంతంగా కొనసాగడమనేది వస్తువు.

'సుప్తాస్థికలు'లో గాంధీజీ ప్రస్తావన ఏమాత్రం తీసుకురాకుండానే మహాత్మాగాంధీ మహోన్నత వ్యక్తిత్వాన్ని శ్రోతల కళ్ళముందుంచడం వినూత్న ప్రయత్నం.

'ఒంటరిబావి', 'భూతాలకొలిమి' నాటికలలో వస్తువుకోసం శిల్పం కాకుండా, శిల్పాన్ని పరిపోషించడం కోసం వస్తువుని తీసుకున్నట్లుగా కనపడుతుంది. జానపద కథలు ఇచ్చిన ప్రేరణతో వస్తు స్వీకరణలో ప్రాధాన్యం వహించిన జానపద కథల్లోని భయానక వాతావరణాన్ని సృష్టించడానికి వీలుగా శిల్పాన్ని ఉపయోగించుకున్నారు శ్రీ శ్రీ.

'విదూషకుడి ఆత్మహత్య', 'గుమస్తాకల', మధ్యతరగతి మనిషి జీవితాన్ని పట్టిస్తాయి. సగటు మనిషి కలల్నీ, ఆ కలలు కల్లలుగా మారే కాలాన్నీ కళ్ళముందుంచుతాయి.

'బలి' – భాగవత కథకు సరికొత్త వ్యాఖ్యానం చేస్తుంది. గ్రీకు పురాణాలనూ, రోమన్ చారిత్రక గాథలనూ మారిన పరిస్థితుల కనుగుణంగా విశ్లేషిస్తూ చేసిన రచనలు ఆధునిక యూరప్ సాహిత్యంలో వచ్చాయి[29]. శ్రీ శ్రీ యూరప్ సాహిత్య ప్రభావంతో మానవత్వం, కరుణ మొదలైన లక్షణాలను పౌరాణిక పాత్ర అయిన బలికి అనువర్తింపజేస్తూ ఈ నాటిక రచించారు.

'శిరస్సు చెప్పిన రహస్యం', 'చెప్పని సందేశం' – నాటికలలో 'గొప్ప గొప్ప కళాకారుల్ని సమాజం వారు బతికుండగా గుర్తించడం లేదు' అనే ఆవేదన ప్రస్ఫుటమౌతుంది.

'జడభరతుడు', 'దడిగాడు వానసిరా'లు – రచయితలకు విలువ నివ్వని వ్యవస్థమీద వ్యంగ్యంగా వ్యాఖ్యానాలు చేస్తాయి.

'గ్రామఫోన్ రికార్డుల తిరుగుబాటు'లో పొరపాట్లనుంచి ఆవిర్భవించిన సమయస్ఫూర్తితో కూడిన చమత్కారం కొత్త ప్రయోగం[30].

'స్వామి-భూస్వామి' నాటిక భూస్వామ్య వ్యవస్థలోని అవలక్షణాలను కళ్ళకు కట్టినట్లు చిత్రిస్తుంది.

నాటికలన్నిట్లో సామాన్యాంశమైన వస్తువు మానవుడి జీవిత సమస్యలు. సమస్యల్లో వైవిధ్యాన్ని బట్టి శిల్ప ప్రయోగంలో వైవిధ్యం ఏర్పడినట్లుగా విదితమవుతోంది.

**రేడియో నాటిక లక్షణాలు – శ్రీ శ్రీ నాటికల్లో అవి ప్రతిఫలించిన తీరు**

లూయీ మెక్నీస్, "మంచి రచయిత తనకు బాగా తెలిసిన పదాలతోనే, ప్రజలకు పరిచితమైన పదాలతోనే రచన గావిస్తాడు[31]." – అంటాడు. శ్రీ శ్రీ తనకెంత సంస్కృత పాండిత్యమున్నా, జాతీయాలు, సామెతలతో నిండిన తేటతెలుగులో పండిత పామర సుబోధకంగా రాసేందుకు ప్రయత్నించారు. ఉదాహరణకి శ్రీ శ్రీ 'రష్యా' ప్రతినిధి చేత మాట్లాడిస్తూ – "దోస్తులారా, నేస్తులారా" అని అనిపిస్తారు[32]. జ్ఞానం, సిరి మాట్లాడే మాటల్లో అధికాధికభాగం తెలుగు కుటుంబాల్లో వినిపించే మాటలే.

"సిరి : కూర్చోండి తాతయ్యా

జ్ఞానం : కూర్చోడానికి వేళలేదు[33]."

–ఇలా రాసే శ్రీ శ్రీలో కవి అప్పుడప్పుడూ డామినేట్ చేసి, పదాలతో శ్లేషలతో గందరగోళం సృష్టిస్తారు.

"జ్ఞానం :... ఒరేయ్, సిరా!

సిరి : సిరాకాదు, సిరి.

జ్ఞానం : సారీ, సిరీ[34]."

–పై ఉదాహరణలో కథకేమాత్రం ప్రయోజనం కలిగించని ఒకే విధంగా ధ్వనించే పదాలను ప్రయోగించాలనే కుతూహలం కనిపిస్తుంది –

"రచనలో ఒకేవాక్యం రాసి, దాన్ని పలురకాలుగా ఉచ్చరించి పలుప్రయోజనాలు సాధించవచ్చు" – అని అంటారు లూయీమెక్నీస్[35] ఈ విషయాన్ని బాగా అవగతం చేసుకున్న శ్రీ శ్రీ 'దడిగాడు వానసిరా'లో

"డైరెక్టర్ : (విజిల్) ఒక రహస్యం బయటపడింది. మీరు రిజిస్టర్ మారేజి చేసుకున్నది భామగారి నన్నమాట.

భామ: (ఏడుస్తూ) అప్పుడే నన్ను బామ్మగార్ని చేసేశారా? మీకు న్యాయమేనా[36]?"

– అనే వాక్యాలలో నటుడి ఉచ్చారణకు ఎంతో ప్రాధాన్యముంటుంది. 'భామ' అనే పదాన్ని సరళంగా ధ్వనింపజేస్తూ, మహాప్రాణాన్ని అల్ప ప్రాణంగా పలికినట్లు పలుకుతాడు. అప్పుడు 'భామ' అనేపదం శ్రోతలందరికీ 'బామ్మ'లా వినిపిస్తుంది. అయితే రచయిత మామూలుగానే... అంటే మహాప్రాణంగానే రాస్తారు. కేవలం నటుడు ఉచ్చరించే తీరులో స్వల్పంగా మార్పుతెచ్చి అదివేరేమాటన్నట్లుగా భ్రమింపజేస్తారు.

"శబ్దాలు సాధించలేని ప్రయోజనాల కోసం రేడియో నాటిక
రచయిత ప్రయత్నించలేదు. మాట్లాడే పదాలు, వినపడే
పదాలతోటే రేడియో రచయిత వ్యాపారమంతా."

– అని అంటాడు మెక్నీస్[37]. "భూతాలకొలిమి" నాటికలో

"ఒక గొంతుక : అమ్మాయీ! ఏయ్! అమ్మాయీ
అదేమిటలా పరిగెత్తుతున్నావు?
ఆగవూ? అయ్యోపాపం! ఆగవూ?
నామాటవిను. అమ్మాయీ ఆగు!
అదేమిటి కాళ్ళనిండా రక్తం?
ఎక్కడ కమ్మాయి ఈ పరుగు?
ఏముంది ఈ సందుచివర?"

–అనే వాక్యాలున్నాయి[38]. ఈ నాటికను ప్రసారాని కనువుగా మార్చేటప్పుడు, ఆతృతతో ప్రశ్నించే గొంతుక మాటల్తోపాటు పరిగెత్తే శబ్దాన్ని కూడా Synchronise చేయవలసి ఉంటుంది. కాళ్ళనిండా రక్తాన్ని శ్రోతలకి చూపించడం సాధ్యంకాదు. వినబడే పదాల ఆధారంతో కాళ్ళరక్తాన్ని కళ్ళముందుంచుతున్నారు శ్రీ శ్రీ. 'అమ్మాయీ!' 'ఆగవూ?' అనే పదాలు మళ్ళీ మళ్ళీ రావడం, చదివే పాఠకుడికి విసుగు పుట్టించవచ్చు. కానీ నాటిక వినే శ్రోతకి ఎంత ఆపినా ఆగని నాయిక పరుగును కళ్ళముందు కనిపించేలా చేస్తాయి. అమ్మాయీ! అనేది మామూలుపదం. దీన్ని పలురకాలుగా ఉచ్చరించి పలు ప్రయోజనాలని

ఎలా సాధించవచ్చో శ్రీ శ్రీ రాసిన పైవాక్యాలను ఒకటికి మూడుసార్లు బయటికి ఉచ్చరిస్తే తెలుస్తుంది. దృశ్యనాటికకే సాధ్యమయ్యే పల్లెటూళ్ళో సందులు, పాలంగట్లు, చీరుకు పోతున్న పాదాల మంటలు, చిరిగి జీరాడే చీర పదాం ఆధారంగా కళ్ళముందు కనిపించేలా చేస్తారు. వినపడే పదాలతో, మాట్లాడే పదాలతో వినిపించని ఆకాశంలో ఆత్మలనీ, రాత్రి స్వారీపోయే రాకాసి మూకల్నీ దృశ్యమానంగావిస్తారు శ్రీ శ్రీ.

"అసభ్యంగా ఉంటే ప్రజాదరణ ఉంటుందనుకోవడం కూడా అపోహ". అని అంటాడు లూయీ మెక్నీస్[39].

'స్వామి - భూస్వామి' నాటికలో శరభయ్య తన భార్య ధనలక్ష్మిని స్వామీజీకి నియోగిస్తాడు. ఈ సందర్భాన్ని శ్రోతలకి తెలియజేసేటపుడు అసభ్యతకి తావిచ్చే అశ్లీలపదాలను ఉపయోగించే అవకాశం ఎంతైనా ఉంది. అయితే, వాటిని ఉపసంహరిస్తూ క్లుప్తంగా రాస్తారిలా -

"స్వామి : ధనలక్ష్మి కొంతకాలంపాటు మా ఆశ్రమంలోనే ఉంటుంది.

శర: స్త్రీలకు మీ ఆశ్రమంలో చోటు లేదన్నారు?

స్వామి: నీ క్షేమంకోసం మా నియమాలు కొన్ని సడలించదలచాం[40]."

"రేడియోనాటిక హేతుబద్ధతకంటే ఉద్వేగాలకు ప్రాధాన్యం ఇవ్వాలి. విద్యాధిక శ్రోతలకంటే సునిశిత మనస్కులైన శ్రోతలకు విలువ నివ్వాలి." అంటాడు మెక్నీస్[41].

బలి నాటికలో హేతుబద్ధంగా వాదిస్తున్నామనుకునే వాళ్ళు స్వర్గాన్ని గొప్పగా, నరకాన్ని హీనంగా భావించినా శ్రీ శ్రీ ఆ హేతుబద్ధమైన సాంప్రదాయిక భావనల్ని తలక్రిందులు చేస్తూ రచించారు. పోతన భాగవతం చదివి జీర్ణించుకున్న విద్యాధిక ప్రేక్షకులకు విష్ణువు గొప్పవాడుగా, బలి దుర్మార్గుడుగా కనిపిస్తాడు. అందుకు హేతువాదంతో చాలా సబబులు చూపించవచ్చు. అయితే మానవోద్వేగాలకు ప్రాముఖ్యమిచ్చే సునిశిత మనస్కులు బలి గొప్పతనాన్ని గుర్తిస్తారు. శ్రీ శ్రీ అటువంటి శ్రోతల్ని దృష్టిలో పెట్టుకొని వారికోసం బలిపాత్ర చిత్రీకరణని ఎంతో గొప్పగా చిత్రించారు. సామాన్య శ్రోతలు పరస్త్రీ వ్యామోహంగల ఇంద్రుణ్ణి అడుగడుగునా కాపాడుతూ, అవిరళ దానతత్పరుడైన బలిని అథఃపాతాళానికి హరి అణచివేయడాన్ని అనుచితంగా భావిస్తారు. హరిని ఎక్కడా తప్పుపట్టకుండానే శ్రీ శ్రీ విమర్శిస్తారు. ఇంద్రుడుండే స్వర్గంకంటే బలివంటి ధర్మమూర్తి గలనరకమే గొప్పదని నాటిక చివరి వరకూ వాదించి శ్రోతలు ఒప్పుకొనేలా చేస్తారు శ్రీ శ్రీ. శ్రీ శ్రీలోని ఈ భావాలు 'నరకంలో గురజాడ'లో కూడా కనిపిస్తాయి[42]. 'C.E.M. Joad' అనే ప్రసిద్ధ తత్త్వవేత్త బెర్నార్డ్‌షాని నరకంలో కలిసినట్లుగా, అతనితో ఎంతోఆప్యాయంగా సంభాషించినట్లుగా 'An Imaginary Dialogue' అనే రచనలో రాస్తాడు[43].

"రేడియో నాటికా రచయితలు సాహిత్యాన్ని మర్చిపోయి ధ్వనిపై ఎక్కువగా ఆధారపడాలి. ధ్వని ద్వారా సాహిత్యాన్ని అందించే దశకు చేరుకోవాలి. ధ్వని ద్వారా

శ్రోతల్ని వశపరుచుకోవాలి[44]."
-అంటాడు మెక్నీస్. శ్రీ శ్రీ రేడియో నాటిక ధ్వనులతోనే బాగా రక్తికడుతుందన్న సంగతి బాగా గ్రహించారు. "గవేషణ"లో న్యాయమూర్తి భూలోకానికి వెళ్ళమని చెప్తాడు. మృత్యులోకం నుంచి భూలోకానికి అతని ఆత్మపయనించాలి. ఆత్మ ప్రయాణానికి అత్యల్ప కాలం చాలు. అయితే ఆ అత్యల్ప కాలంలో ఆత్మ సాగించిన పయనం శ్రోతల కళ్ళముందు సాక్షాత్కరించాలి. అది ధ్వనుల సాయంతోనే జరగాలి. వివిధ వాద్య సమ్మిశ్రితమైన సంగీతం ఆపని చేస్తుంది. ఆ అంశాన్ని రేడియోలో పనిచేసే సాంకేతిక నిపుణులకు సూచిస్తూ శ్రీ శ్రీ బ్రాకెట్లలో 'అరనిమిషం సేపు జంత్ర సంగీతం', అని రాశారు[45].

మానవుని ఆత్మ మరో ప్రపంచపు న్యాయస్థానం వరకూ వెళుతుంది. మరో ప్రపంచం అంటే ఏమిటో, మానవాత్మ చేసే మహాప్రస్థాన పథయాత్ర ఎటువంటిదో సామాన్యుడైన శ్రోత కళ్ళకు కట్టేలా శబ్దాలతో చూపించ వలసిన అవసరం ఎంతైనా ఉందిక్కడ. అలా వినిపిస్తేనే శ్రోత ఆ ప్రయాణం తాను చేస్తున్నట్లుగా అనుభూతి చెందుతాడు. ఈ చిన్న విషయాన్ని శ్రీ శ్రీ విస్మరించలేదు. "మరో ప్రపంచపు న్యాయస్థానం వెలుపల పెద్దపెద్ద సొరంగాలవంటి వరండాలు, కీచురాళ్ళ చప్పుడు[46]" అని సూచించారు రేడియో అధికారులకు. రేడియో స్టేషన్ లో లైబ్రరీ స్టాక్ లో రికార్డు చేసిన వివిధ శబ్దాలుంటాయి. ఆ శబ్దాల సాయంతో గుహల్లోకి ప్రయాణం చేసే ఎఫెక్ట్నీ, కీచురాళ్ళు అరుస్తున్న ఎఫెక్ట్నీ శ్రోతలకి కలిగించడం ద్వారా మహాప్రస్థాన పథయాత్రను సునాయాసంగా స్ఫురింపచేయవచ్చు.

"శ్రోతల ప్రాథమిక స్థాయిని దృష్టిలో ఉంచుకొని రేడియో నాటిక రాసేటప్పుడు కవిత్వ దృక్పథంతో వ్యవహరించాలి. లయతో కూడిన భాష రేడియో నాటికకి అవసరం."
-అని అంటాడు మెక్నీస్[47]. శ్రీ శ్రీ కవిత్వ రచనానంతరమే నాటకకర్త అయ్యారు. 'ఒంటరిబావి', 'భూతాలకొలిమి' కేవలం కవిత్వం మీదే ఆధారపడ్డ నాటికలు. నాటిక ఆరంభంలోనే కథనకంఠం.

"నోరావులించి
ఊరికి దూరాన పొంచి
నీరింకి పోయి నిలుచుందొక ఒంటరిబావిః
దారుణములైన కథలున్నవి దాని గురించిః
చెప్పనా, చెప్పనా, ఆ బావి గురించి?
విప్పనా, విప్పనా నా విషాలసంచి[48]?"

- ఈ ఎత్తుగడ శ్రోతలకి ఎంతో ఉత్సుకత కలిగిస్తుంది. శ్రోతల ప్రాథమికస్థాయి కనుగుణంగా లయతో కూడిన భాష వాడారు శ్రీ శ్రీ. ఇందులో అంత్య ప్రాస కవిత్వంతో పాటు, కవితాత్మతో జన్మించే మనిషి మనసుకి ఉల్లాసం కలిగించే గుణాన్ని కలిగి ఉంది. ఆ

మాటకొస్తే ప్రతిమనిషికీ కొంత కవితాత్మ ఉంటుందంటాడు Carlyle-

"A vein of poetry exists in the hearts of all men; no man is made altogether of poetry. We areall poets when we read a poem well. All men, like poets, have some touches of the Universal[49]."

మొదట్లో సాహిత్యం మొత్తం శ్రవ్యరూపంలో ఉంది. ఒకప్పుడు సకలమైన చదువులు ఒకరు చదవగా కొంతమంది వినేవారు. అచ్చుయంత్రాలూ, రాత పరికరాలూ లేని కాలంలో సాహిత్యం చెవిమీద ఆధారపడి వినడం ద్వారా శ్రోతని కదిలించేది. చదువరి బాగా పఠిస్తే మామూలు మనిషి కూడా విని స్పందిస్తాడు. ఈ విషయాన్ని గ్రహించిన శ్రీ శ్రీ తన ప్రవృత్తిలోనే ఉన్న కవిత్వ లక్షణాన్ని పూర్తిగా పుణికి పుచ్చుకొని, రేడియో నాటికల Alchemyలోని శబ్ద రహస్యాన్ని పట్టేసుకుని, కొన్ని పదాలను పలికించడం, వినిపించడం ద్వారా అన్ని తరగతుల శ్రోతలను ఆకట్టుకునేలా రాశారు. 'నోరావులించి' అనే పదం ఎంతో అర్థాన్ని తన గర్భాన దాచుకొని, బావితాలూకు భయంకరత్వాన్ని చెప్పక చెప్తుంది. అలాగే 'విషాలసంచి' అనేపదం పుకార్లను పుట్టించే పనిలేని సోమరుల మస్తిష్కం ఎంత హీనస్థితిలో ఉందో సూచిస్తుంది. కథనకంఠం శ్రోతలకి ఉత్సుకత కలిగించడంతో తన పనిని విరమించుకోక, దాన్ని మరింత తీవ్రతరం గావిస్తూ ఇలా అంటుంది.

"భూతాలూ, భేతాళాలూ దాగుడు
మూతలాడుతాయా నూతిలోతులో
పాతాళలోకానికి పావంచాలా
నూతి దిగువనే ఉన్నాయట[50]!"

సామాన్య శ్రోతలకి జానపద కథలతో పరిచయమెక్కువగా ఉంటుంది. భూతాలూ, భేతాళ మాంత్రికులూ ఆ కథల్లో ఉంటారు. అటువంటి వారికి ఆ నూతిభయంకరత్వం అవలీలగా సాక్షాత్కరిస్తుంది. అలాగే 'పావంచా' అన్నమాట ఆంధ్ర దేశంలో తెలుగిళ్ళలోని లోగిళ్ళతో దాని Architectureతో పరిచయం ఉన్న శ్రోతలకే బాగా తెలుస్తుంది. పదాలని ప్రయోగించడంతో పాటు, అక్షరాల్ని పదేపదే ఆవృతం గావిస్తూ శ్రోతల్ని తబ్బిబ్బు చేయడంలో శ్రీ శ్రీ అందెవేసిన చేయి. 'తో' కారప్రయోగం నిరూపించేదదే! పాతాళ లోకాన్నందు కున్నట్లున్న పాడుబడ్డ బావిని శ్రోతల కళ్ళముందుంచడమే గాక, ఆ బావిలో శ్రోతపడిపోతున్న అనుభూతిని కూడా పొందేలా చేస్తారు. ఈ నాటికలో కథనకంఠాలకి తోడుగా ఫ్లాష్‌బాక్ టెక్నిక్‌ని ప్రయోగిస్తూ రచించారు శ్రీ శ్రీ. తీరా చూస్తే కథలో అది ఫ్లాష్ బ్యాకే కాదు. రూపు దిద్దుకున్న పుకారది. మూడు కథన కంఠాలద్వారా కథనడిపిస్తారు. 'తందానతాన' అనే వంత లేకుండా ఆధునికంగా బుర్రకథ చెప్పినట్లుంటుంది.

"మామూలు నాటక రచయిత కన్నా రేడియో నాటక రచయిత పొదుపుగా ఉండాలి. ఎందుకంటే సమయం తక్కువ".
-అంటాడు లూయీ మెక్నీస్[51].

'గుమస్తాకల' నాటికలో శ్రీ శ్రీ కోనేటి రావ్నూ, అతని భార్యా పిల్లల పరిస్థితినీ, అతనుంటున్న ఇంటి పరిస్థితినీ, మొత్తం సమాచారాన్నందించడానికి అతి చిన్న పదాలను ఉపయోగిస్తారు శ్రీ శ్రీ. ఆ పదాలు కూడా కొంత వ్యంగ్యాన్నీ, మరికొంత గందరగోళాన్నీ కలగలుపుకొని ఉంటాయి. మాట్లాడుకోనేవి 1, 2 ద్వారా సూచించబడే రెండు ఘోస్ట్‌ల గొంతుకలు.

"1. సొంత యిల్లేనా?

2. కాదు అద్దెకొంప

1. పంతులుగారేం చేస్తున్నారు?

2. నిద్రపోతున్నారు.

1. వారి వయసెంత

2. రెండు పాతికలు

1. ఉద్యోగం వయసెంత?

2. ఒక పాతిక

1. జీతం ఎంత?

2. అయిదు పాతికలు[52]."

– ఇలా తక్కువ మాటలతో ఎక్కువ వివరాలను అందించడంలో శ్రీ శ్రీ ఘనత ఎటువంటిదో పై సంభాషణ నిరూపిస్తుంది. పాతిక సంవత్సరాల నుంచీ గొడ్డు చాకిరీ చేస్తున్నా, ఎదుగూ బొదుగూ లేని గొర్రెతోక జీతంతో సగటు మనిషి బతుకు నిజంగా బతుకేనా? ఈ ప్రశ్న శ్రీ శ్రీ తాను వేయకుండా తన శ్రోత వేసుకునేలా చేస్తారు. పగలంతా కచేరీ చాకిరీతో అలసిపోయే మామూలు మనుషులు సుఖపడేది నిద్రావస్థలోనే. ఈ విషయాన్ని వివిధ శబ్దాలతో తేలికైన పదాలతో శ్రోతలకి తెలియజేస్తారు శ్రీ శ్రీ.

> "రేడియో నాటికను తయారు చేయడానికి కొంత సృజనాత్మక కళాహృదయం అవసరం. అంతేగాక రేడియో నాటిక మొదట్నించీ పూర్తయ్యేవరకూ నిర్మాణ కౌశల్యం కూడా అవసరం. రేడియో రచయిత ఒక ఖచ్చిత కొలమానంలో రాయాలి. ప్రతిలింకూ గట్టిగా ఉండాలి. పేలవమైన ముగింపు ఉండకూడదు."

– అని అంటాడు లూయీ మెక్నీస్[53].

శ్రీ శ్రీ సృజనాత్మక కళాహృదయం ఉన్నవాడవడం వల్ల రేడియో నాటికలను తనదైన బాణీలో రచించారు. పోతన భాగవతంలోని వామనావతార గాధను 'బలి' నాటికకోసం తీసుకున్నా, వినూత్నమైన మార్పులను చేశారు. భక్తిరస పూరితమైన పోతన రచనకి ఎటువంటి కళంకం తేకుండానే, పోతన పాత్రలను తారుమారు గావించారు. 'విదూషకుడి ఆత్మహత్య' నాటికను ఆదినుంచి, అంతంవరకూ నిర్మాణ శిల్పం చెడకుండా రచించడంలో జాగ్రత్త వహించారు. 'ఏం చెప్పాలి' అనేది ముందే నిర్ణయించుకొని, నాటిక రచనకు ఖచ్చితమైన కొలమానాలు ఏర్పరచుకున్నారాయన. ఈ విషయానికి కొంత వివరణ అవసరం.

1940-50లలో సమర్థులైన రచయితలనూ, కవులనూ ఎన్నుకొని వారి, వారి రచనా సామర్థ్యాని కనుగుణంగా రేడియో కార్యక్రమ నిర్వాహకులు కొన్ని శీర్షికలను ఇచ్చేవారు. ఆ శీర్షికల కనుగుణంగా నాటికలు తయారయ్యేవి. ఆ కాలంలో నాటికలు షెడ్యూల్స్ చేసే విధానం అలా ఉండేది. బాలాంత్రపు రజనీకాంతరావు రేడియో కార్యక్రమ నిర్వాహకుడుగా ఉండి, శ్రీ శ్రీ శక్తియుక్తుల్ని దృష్టిలో ఉంచుకొని, కొంగ్రొత్త శీర్షికలను సృష్టించి వాటి కనుగుణమైన రచనలను గావింప జేశారు. మానవత గురించి, మృత్యువును గురించి ఎంతవరకు చెప్పాలో ఖచ్చితంగా నిర్ణయించుకొని శ్రీ శ్రీ రేడియో నాటికలు రాశారు. 'గవేషణ' నాటికలో గాని, 'శిరస్సు చెప్పిన రహస్యం' నాటికలో గాని ప్రతివాక్యానికీ మరో వాక్యంతో ఉండే లింకును పరిశీలిస్తే, 'లూయీ మెక్నీస్' చెప్పిన మాటలను 'శ్రీ శ్రీ ఎంతగా దృష్టిలో పెట్టుకున్నారో' అని అనిపిస్తుంది. దేశ, విదేశాల కవిత్వాలు Spencer మొదలు Joyce వరకూ చదివి, అన్నిపోకడలూ తెలిసిన తర్వాతే శ్రీ శ్రీ రేడియో నాటికలు రాశారు. 'అనంతయాత్ర' నాటికలో ముగింపులో కూడా కాంతం పెట్లోని వాచీలో సమయం ఎంతయిందో చెప్పకపోవడం వల్ల కథలో బిగి సడలదు. ముగింపు బాగా రక్తికడుతుంది. శ్రోతలను తెలివిగా వశపరుచుకోవడం వల్ల వారికి నాటిక ముగిసిపోయినా, పెట్లోని వాచీ మీద నుంచిగానీ, ఆవాచీలో సమయం మీదనుంచిగానీ ధ్యాస చెదరదు.

> "రేడియో నాటికకు ఎన్నుకోవాల్సిన కథాంశమేమిటి? మామూలు రచన కవసరమయ్యే కథ ఏదైనా కావచ్చు. కథ విశాలంగా, వైవిధ్యంగా, నాటకీయంగా ఉండాలి. కథా సారాంశం, పాత్రలు అనువైనవిగా ఉండాలి."

- అని అంటాడు లూయీ మెక్నీస్[54].

రచయితలు స్వేచ్ఛాజీవులు. ఒకరిచ్చిన శీర్షికలకు ఏ రచయితైనా అనుగుణమైన కథల్ని ఎన్నుకోవడం అసాధ్యం. ఈ అసాధ్యాన్ని సుసాధ్యం చేశారు శ్రీ శ్రీ. శీర్షిక అనే కేంద్ర బిందువు చుట్టూ సాలీడులా కథనల్లుకొనే వారు. మామూలు రచన కవసరమయ్యే కథ ఆ నాటికలో ఉండేది. కథ విశాలమైన పరిధిని కలిగి ఉండేది. వైవిధ్య పూరితమై ఉండేది. నాటకీయతను పెంపొందించడాని కనువైన మలుపులు కలిగి ఉండేది. పాత్రలు రచయిత చెప్పదలుచుకున్న దాన్ని శ్రోతలకు సులభంగా అవగతం కావడానికి దోహదపడేవిగా ఉండేవి. కథాసారాంశం అతి క్లుప్తమే అయినా, 'కట్టె, కొట్టె, తెచ్చె' అని చెప్పడానికి వీల్లేకుండా ఉండేది. శ్రీ శ్రీ రచనల ఆధారంగాపై అంశాలను పరిశీలిద్దాం.

'గుమాస్తాకల' నాటిక కథావస్తువుని శ్రీ శ్రీ 'చరమరాత్రి' అనే కథల సంపుటిలోని 'కోనేటి రావు కథల' నుంచి సంగ్రహించారు. అది మామూలు రచనే! 'మరో ప్రపంచం'లో కథ విశ్వమంత విశాలమైనది. 'భూతాలకొలిమి' వైవిధ్యంతో అలరారేరచన. 'చతురస్రం' నాటికలో టాబ్లెట్ల రూపంలో, ఇంజెక్షన్ల రూపంలో అమృతాన్నందుకున్న వివిధ ప్రాయాలుగల పాత్రలు ఒకే వయసువారిగా మారిపోవడం, అలా మారినప్పటికీ అణగిపోని అంత

స్వంఘర్షణలు ఎన్నెన్నో మలుపుల కాలవాలమై నాటకీయతను పెంచి పోషిస్తాయి. కథాసారాంశం తేలికగా శ్రోతని చేరుకోవడానికనువైన పాత్రసృష్టిని గావిస్తూ శ్రీ శ్రీ ఇంకా పుట్టని శిశువులనూ, కనుపాపనూ, నిర్జీవినీ పాత్రలుగా చేస్తారు. కథకి అనువైన పాత్రల్నే గాకుండా అరుదైన పాత్రలు కూడా సృష్టించాలనే తపనతో అపాత్ర పాత్రీకరణ జరుపుతూ నక్షత్రం, ఆశ, భయం, అంధకారం వంటి వివిధ వస్తు, భావ సంచయాల్ని శ్రోత కళ్ళ ముందుంచుతారు.

- ఈవిధంగా లూయీమెక్నీస్ చెప్పిన విషయాలను శ్రీ శ్రీ తన రేడియో నాటికల్లో ఎలా పాటించారో ఉదాహరణల సాయంతో రుజువు చేయవచ్చు. కానీ లూయీ మెక్నీస్ విదేశీయుడు. భారతీయ భాషలలో ముఖ్యంగా తెలుగులో ప్రసారమయ్యే నాటికల గురించి అతనికి తెలియక పోవచ్చు- అని ఎవరైనా అభ్యంతర పెట్టవచ్చు. శ్రీ శ్రీ విదేశీయుల ప్రమాణాలకు తగ్గట్లు రచన చేయడమే కాదు, స్వదేశీయులు ముఖ్యంగా తెలుగు విమర్శకులు ఉద్దేశించిన ప్రమాణాలకు అనుగుణంగా రేడియో నాటికల రచన గావించి, ఉన్నత లక్ష్యాలను సాధించారు.

> "రేడియో రచయిత 'మాస్ సైకాలజీ'ని దూరంగా అట్టే పెట్టి వ్యక్తి హృదయపు లోతుల దగ్గరికి వెళ్ళాలి. ఒక పరిమళంతో ఒక దృశ్యం మనకి జ్ఞాపకం వచ్చినట్లు, ఒక్కమాటతో భావ సంచలనాన్ని శ్రోత హృదయంలో తీసుకురాగలగాలి."

-అని అంటారు ఎన్.ఆర్. చందూర్[55]. 'బలి' నాటికలో 'జలాంతశ్చంద్రచపల'ని ఇంద్రుడి బారినుంచి బలి రక్షిస్తాడు. బలికి భయపడి ఇంద్రుడు పారిపోతాడు. కావాలిసినంత 'Melodrama' ఉన్న ఈ సన్నివేశం దృశ్యనాటికలోనే బాగా రాణిస్తుంది. 'జలాంతశ్చంద్రచపల' రక్షణలో బలి పొందిన విజయం, ఇంద్రుడి పరాజయం ప్రేక్షకులు కరతాళధ్వనులు గావించేలా చేస్తాయి. రేడియో నాటిక మాస్' (సమూహం)కి కాదు. 'వ్యక్తి'కి గనుక శ్రీ శ్రీ దృశ్యనాటికకి పనికొచ్చే Melodramని పరిహరించి , గంభీరమైన కంఠస్వరంతో, తేలికైన పదాలతో, ఉభయుల జయాపజయాలను శ్రోతల ముందుంచుతారు. ఎవరెలాంటి వారో శ్రోత భావనాపథంలో అంతర్నేత్రంతో వీక్షిస్తాడు. బలి రక్షించిన, ఇంద్రుడు చెరచదలుచు కున్న అమ్మాయి పేరు 'జలాంతశ్చంద్ర చపల' అని పెట్టడంతో నీటి అలల్లో కనిపించే చంద్రబింబాన్నీ, పరిమళంతో కూడిన దృశ్యాన్నీ జ్ఞాపకానికి తెస్తారు. ఈ పేరే విద్యాధికుడైన శ్రోతకీ, నిరక్ష రాస్యుడైన శ్రోతకీ భావసంచలనాన్ని రేకెత్తిస్తుంది.

> "కుటుంబక్షేమానికీ సాధారణ నీతి నియమాలకీ, భంగకరంగా ఉండేది సామాన్య శ్రోత సహించడు. ఇలాంటివి విని తన పిల్లలూ ఇంట్లో వాళ్ళూ చెడిపోతారను కుంటాడు. అతనికి కావలసింది సత్కాలక్షేపం."

-అని అంటారు ఎన్.ఆర్.చందూర్[56]. 'గుమస్తాకల'లో కోర్కెలు తీరని కోనేటి రావుకి 50 వసంతాలు వెళ్ళిపోయాయి. అతని భార్య పిల్లల తల్లి. నివాసం ఒక ఇరుకుగదిలో ఆమెకి పగలంతా ఇంటి పనులతో, పిల్లల ఆలనాపాలనలతో సరిపోతుంది. రాత్రి

ఆదమరచి నిద్రపోతుంది. పగలు ఆఫీసు పనులతో అలసిపోయిన కోనేటి రావు రాత్రినిద్రనాశ్రయిస్తాడు. ఆమెతో అతనికి సుఖాల ప్రసక్తిలేదు. అయితే, అతని అంతశ్చైతన్యంలో తీరని వాంఛలు సజీవంగా మిగిలున్నాయి. అతనికి పరస్త్రీతో సుఖాలు కావాలి. ఈ జీవిత సంఘర్షణనీ, అంతస్సంఘర్షణనీ అశ్లీలానికి తావులేని విధంగా, ఆబాలగోపాలం ఆనందించడానికి అనుకూలమైన విధంగా శ్రోతల కళ్ళముందుంచాలి శ్రీ శ్రీ. అప్పుడే కుటుంబక్షేమానికీ, సామాజిక నీతి నియమాలకీ భంగకరంగా ఉండదు. సామాన్యశ్రోత సహనశక్తికి పరీక్షకాకూడదు. పిల్లలకి అర్థంకాని రీతిలో, పెద్దలకి అసభ్యం కాదనిపించేరీతిలో, కోనేటిరావు పరస్త్రీ వ్యామోహం ఎలా తీర్చుకుంటున్నాడో చెప్తారిలా శ్రీ శ్రీ -

> ఆశ : సౌందర్యం సమక్షంలో కోనేటిరావు నిలుచున్నాడు. అతని హృదయంలో ప్రేమ సంగీత రూపంలో ప్రవహిస్తోంది. కథానాయిక అతని ప్రేమని గానంతో అంగీకరించింది. కథలో అతడే సత్యవంతుడు. ఆమె సావిత్రి. అతడు రోమియో. ఆమె జూలియట్. అతడు కోనేటిరావు ఆమె కోనేటిరాణి[57]."

-ఇందులో అణుమాత్రంగా ఉన్న అసభ్యతాంశాన్ని విస్మరింప జేయడానికీ, ఉల్లాసాన్ని కలిగించడానికీ హాస్యాన్ని కలగలుపుతారు శ్రీ శ్రీ. కోనేటిరావుతో కోనేటిరాణి డ్యూయెట్ పాడుతుంది – "విడువకోయీ నన్ను వీర రాజకుమారా!" అంటూ[58]. ఈ యుగళగీతం కోనేటిరాణి పాడిందో లేదో తెలీదు. పాడిందని తన చెవులతో వినమని 'ఆశ' చెప్తుతుంది. ఆశ నిజం చెప్పినా, అబద్ధం చెప్పినా శ్రోతకి మాత్రం ఖచ్చితంగా యుగళగీతం వినిపిస్తుంది. శ్రోత యుగళగీతాన్ని వినగానే గుమస్తా కోనేటి రావుని వీరరాజ కుమారుడైన జానపద నాయకుడుగా మలచుకుంటాడు. అలా చేయడంవల్ల కోనేటిరావు మీద అసహ్యం జనించదు. అంతేగాక ఆనందం కూడా పొందుతాడు. శ్రీ శ్రీ ఆశించిన పరమార్థం శ్రోతలు ఆనందం అనుభవించడమే. అది ఈ హాస్య సన్నివేశం వల్ల నెరవేరుతుంది.

> "రంగస్థల నాటకం చూసే ప్రేక్షకుడి ప్రధానసాధనమైన" కన్ను, శ్రవ్య నాటకంలో శ్రోత మనస్సుకి ఉంటుంది. ఈ మనోనేత్రానికి విజయవంతంగా పరితోషం కలిగించాలి రేడియోనాటిక."

-అని అంటారు ఇంద్రగంటి శ్రీకాంతశర్మ[59]. శ్రీ శ్రీ రచించిన 'మరోప్రపంచం'లో ఒక దృశ్యాన్ని కేవలం శబ్దాలసాయంతో శ్రోత అంతశ్చక్షువు ముందుంచాలి. ఆ దృశ్యంలో పొగమంచు లాంటి పుప్పొడి లాంటి అణుధూమాన్ని చీల్చుకొని ఆకుపచ్చని గాజుబంతి, ఆ గాజుబంతి లోంచివినవచ్చే కంఠధ్వని, ఆధ్వనుల నీడల్లోంచి బైటపడే మాటలు - ఇవన్నీ వినిపించటం ద్వారా శ్రోతల మనోనేత్రాలకి మరోప్రపంచాన్ని సాక్షాత్కరింప జెయ్యాలి. ఈ Peculiar taskని శ్రీ శ్రీ ఎలా నిర్వహించారో పరిశీలించండి.

"1వ గొంతుక : చూడు దూరంలో మబ్బులాంటి పొగమంచులాంటి పుప్పొడి దూరం లాంటి దుమారంలో.

2వ గొంతుక : అదేంకాదు. అదంతా ఒక గందరగోళం.

3వ గొంతుక : ఆ గజిబిజిలోంచే ఎవరో వస్తున్నారు.

2వ గొంతుక : ఏదో వస్తున్నది.

3వ గొంతుక : దాన్ని వర్ణించు

2వ గొంతుక : టెన్నిస్ బంతి లాగుంది.

1వ గొంతుక : ఆకుపచ్చని బంతి

3వ గొంతుక : ఆకుపచ్చని గాజుబంతి

1వ గొంతుక : అదంతా ఒక పెద్దకన్నులాగుంది.

2వ గొంతుక : కాదు. అంతా ఒక చెవి.

1వ గొంతుక : అదే. దానినోరులాగా కూడా అగుపడుతోంది.

2వ గొంతుక : అదే దాని

3వ గొంతుక : చాలించు. దగ్గరపడుతున్నాడు.

1వ గొంతుక : ఏదో మాట్లాడబోతున్నాడు.

2వ గొంతుక : ఒళ్ళంతా ఒకేకన్ను చేసుకొని దీక్షగా చూస్తున్నాడు.

1వ గొంతుక : ఎవరు నువ్వు కనుపాపా?

కనుపాప : (లోహకంఠం – తెలివైన కుర్రాడు టెలిఫోన్ లో మాట్లాడినట్టు) నేను ఇరవై ఒకటవ శతాబ్దపు మనిషిని.

2వ గొంతుక : మనిషి, ఆకుపచ్చని గాజుబంతి, కనుపాపా[60]?" – పై సంభాషణలో శ్రీ శ్రీ ఎక్కడా కవిత్వపు పరిభాషను కూడా ఉపయోగించుకోలేదు. అనుభవజ్ఞుడైన రచయిత కావడంవల్లా, 'రేడియోకి రాస్తున్నాను.' అనే స్పృహతో రాయడంవల్లా కవిత్వాన్ని దూరంగా ఉంచారు. రేడియో నాటికకి శబ్దం ప్రాణం అనే విషయాన్ని దృష్టిలో ఉంచుకొని అతితేలికైన పదాలను ప్రయోగిస్తూ, కొన్ని పదాల్ని పలకడం – వినడం ద్వారానే వేగంగా Visual effectని తెచ్చారు.

"ధ్వని ప్రధానంగా ఉండి సంగీతం సమ్మిళితమైతే
శ్రవ్యనాటకం రక్తి కడుతుంది."

–అని అన్నారు ఆత్రేయ[61]. శ్రీ శ్రీ నాటికల్లో "గ్రామఫోను రికార్డుల తిరుగుబాటు" వినూత్న పద్ధతిలో సాగేనాటిక. గొంతులేని గ్రామఫోన్ రికార్డుని మానవుడికి ప్రతినిధిగా మలచి శ్రోతముందు నిలబెట్టి, ఆ ప్రాణంలేని వస్తువుల చేత తిరుగుబాటు చేయిస్తారు విప్లవకవి శ్రీ శ్రీ. ఇది కేవలం ధ్వని నాశ్రయించుకొని రూపొందించిన నాటిక. వివిధ పాత్రల సంభాషణలకు బదులుగా రికార్డులే సంభాషణలు కాని సంభాషణలను వివిధ రకాలుగా వినిపిస్తాయి. విరిగిన రికార్డు విలక్షణమైన సంగీతాన్ని వినిపిస్తుంది. అరవరికార్డు

అరవం వినిపిస్తుంది విరిగిన రికార్డు మీద ఉన్నది శ్రావ్యమైన ఫిడేలు వాద్యమే. కానీ అది విరిగిన రికార్డవడం వలన విరిగిన ఫిడేలులోంచి వచ్చే విచిత్ర సంగీతాన్ని వినిపింప జేస్తుంది. పీడిత సంగీత లోకపు హక్కులకోసం రికార్డులు సామూహికంగా గొంతు విప్పుతాయి. అట్టహాసం చేస్తాయి. హేళనగా అరుస్తాయి. చప్పుడయ్యేలా కొట్టాస్తాయి. రికార్డులవంటి సామాన్యవస్తువుల్ని ఆధారం గావించుకొని వాటిధ్వనుల సమ్మేళనాన్ని ఆలంబన చేసుకొని ఒక కొత్త శ్రవ్య నాటికని సృష్టించి శ్రోతల ముందుంచారు శ్రీ శ్రీ.

"Cut Dialogue రేడియోలో శ్రోతకి ఉత్కంఠని
కలిగించి, నాటిక రక్తి కట్టేలా చేస్తుంది."

-అన్నారు ఆత్రేయ[62]. 'చతురస్రం'లో జ్ఞానంచేత "సిరీ, ఇవాళనాకో అనుమానం' అని అనిపిస్తారు శ్రీ శ్రీ[63]. సాధారణంగా మాట్లాడేభాషలో 'ఇవాళ నాకో అనుమానం' అనే అసంపూర్ణ వాక్యాన్ని ప్రయోగించం. 'నాకో అనుమానం వచ్చింది' అనో 'నాకో అనుమానం ఉంది' అనో అంటారు. శ్రీ శ్రీ ఇక్కడ Cut Dialogue వాడడం, జ్ఞానానికి వచ్చిన అనుమానం ఏమై ఉంటుందా? అని శ్రోతల్లో ఉత్కంఠని కలిగింప జేయడంకోసమే!

"దృశ్య నాటికలో పాత్రలు సజీవంగా కళ్ళెదుట కనిపించి రసోత్పాదన చేస్తాయి. శ్రవ్య నాటికని ఆనందించాలంటే నటులు, ప్రయోక్తతోపాటు శ్రోతలు కూడా తమవంతు ప్రతిస్పందన నందివ్వాలి . So, Audience Response and contribution is very improtant for Radio drama."

-అని అంటారు ఎ.ఆర్.కృష్ణ[64]. 'గవేషణ' నాటికారంభంలో మానవుని గొంతుక, "నేను చచ్చిపోయానా? మీకేం మతిపోయిందా? మనిషంత మనిషిని నేను కనపడలేదూ మీకు[65]? అని వినపడుతుంది. ఈ ఆరంభం శ్రోతల్ని అద్భుతంగా ఆకట్టుకుంటుంది. తమ వంతు ప్రతిస్పందన నిచ్చేలా చేస్తుంది. ఆ ప్రతిస్పందనే శ్రోతలు అందించే సేవ. చివరివరకూ నాటికని ఉత్కంఠతో వినేశ్రోతలకి ఆఖర్లో మళ్ళీ మానవుడి గొంతుక - "నేను చచ్చిపోలేదు. నమ్మండి. నేను బతికే ఉన్నాను[66]." అని వినపడుతుంది. ఈ ఆద్యంతాలు గొప్ప ప్రయోగాలు. ఆద్యంతాల్లో చమత్కారాలూ, శిల్ప విన్యాసాలూ ప్రదర్శించడంలో మెక్నీస్ దిట్ట[67]. ఈ అద్భుత శిల్ప విన్యాసం శ్రీ శ్రీకి కూడా అబ్బింది.

-ఇంతవరకూ వివిధ రచయితలు చెప్పిన లక్షణాలను శ్రీ శ్రీ నాటికలకు అన్వయింప జేయడం జరిగింది. మొదటి అధ్యాయంలో వివరించిన వివిధ ప్రయోగవాద ధోరణులన్నింటిలోనూ అంతస్సూత్రంగా కనిపించే ప్రధానలక్షణం Sigmund Freud ప్రతిపాదించిన 'మనో విశ్లేషణ సిద్ధాంతం'. ఈ సిద్ధాంత ప్రభావం వల్ల ఎక్స్ప్రెషనిజమ్, సర్రియలిజమ్, అబ్సర్డిజమ్ వంటి పలు ప్రయోగాల్లో నాటకంలో కలలాంటి వాతావరణ సృష్టి జరిగింది. ఇలాంటి నాటకాలను ఇంగ్లీష్లో 'Dream Plays' అంటారు[68]. శ్రీ శ్రీ నాటికల్లోని ప్రధాన లక్షణం కూడా ఇవి చాలావరకు Dream plays అయి ఉండడమే! 'చరమరాత్రి'లో కలనేకథగా రాస్తున్నానని స్పష్టంగా చెప్పారు. నాటికల్లో ప్రత్యేకంగా

చెప్పకపోయినా కలలలాంటి నాటికలను సృష్టించారు. 'సుప్తాస్థికలు', 'భూతాల కొలిమి', 'ఒంటరిబావి' - నాటికలలో స్వాప్నిక వాతావరణముంది. 'గుమస్తాకల' మూడు కలల సమ్మేళనం. 'చతురస్రం', 'మరోప్రపంచం' నాటకకర్త భవిష్యత్తుని గురించి కన్నకలలే!

ఇంగ్లీష్‌లోని ఎక్స్‌ప్రెషనిస్టులు, సర్రియలిస్టులు, అబ్సర్డిస్టులు వంటి ఉద్యమకారులు రకరకాల టెక్నిక్స్‌ని ప్రయోగిస్తూ రచనలు చేశారు. శ్రీ శ్రీ ఆ రచనల్లో ఎన్నింటిని చదివారో వివరంగా చెప్పే వీలులేదు. అయితే, ఆ టెక్నిక్స్ కొన్ని శ్రీ శ్రీ నాటికల్లో కనిపిస్తాయి. ఆ టెక్నిక్స్‌ని విడివిడిగా గుర్తించడానికి కొన్ని పాశ్చాత్య రచనలనూ, ఆ రచనల ప్రభావాలనూ తెలుసుకోవలసి ఉంటుంది.

Brecht alienation theme[69] ప్రభావం శ్రీ శ్రీ 'చతురస్రం', 'విదూషకుడి ఆత్మహత్య', 'గుమస్తాకల', 'బలి' మొదలైన నాటికల్లో కనిపిస్తుంది.

Brechtకి ముందు నాటకరంగానికీ, Brecht నాటక రంగానికీ స్పష్టమైన తేడా ఉంది[70]. పాత్రతో పాత్రధారుడు గానీ, ప్రేక్షకుడుగానీ తనను తాను identify చేసుకొనే అవకాశం లేదు. పాత్రనుండి విడిపోయి పాత్రధారుడు కనిపిస్తాడు. ప్రేక్షకుడు పాత్రతో తాదాత్మ్యం చెందే వీలుండదు. తాను వేరు, పాత్రవేరు అనే వివక్షతో చూస్తాడు. రచయిత ఎప్పుడూ ఎక్కడా పాత్రనీ ప్రేక్షకుణ్ణీ కలవనివ్వడు. ఉదాహరణకి "చతురస్రం" నాటికలో కవి పాత్రగానే కాక 'ఎనౌన్సర్'గా కూడా ధ్వనిస్తాడు. 'విదూషకుడి ఆత్మహత్య'లో ఆటంకం పేరు రకరకాలుగా మారిపోతూ ఉంటుంది. 'బలి'లో నిర్జీవి-జీవిగా, జీవి-నిర్జీవిగా మారిపోతూ ఉంటాడు[71]. నాటకం చివర్లో చిరంజీవి 'నేను నిర్జీవిని కాదలచుకున్నా' నంటాడు[72]. స్వర్గంలో చిరంజీవిగా ఉండి నరకంలో నిర్జీవిగా మారిపోతూ ఉంటుందీపాత్ర. శ్రోత ఏ పాత్రతోనూ ఐక్యం కాలేడు.

Dylan Thomas నాటకం "Under Milkwood" శ్రీ శ్రీ చదివారు. దాని గురించి చర్చించారు[73] Dylan thomas తన నాటకాన్నారంభిస్తూ "To begin at the beginning" అనే విచిత్ర వాక్య విన్యాసం జరుపుతాడు[74]. శ్రీ శ్రీ 'చతురస్రం' నాటికను అదే ధోరణిలో ఆరంభిస్తూ - ప్రారంభం నుంచి ప్రారంభిద్దాం" అని రాస్తారు[75].

Dylan Thomas పాత్రలకి బదులు I Voice, II Voice, III Voice అని పేర్లు పెడితే, శ్రీ శ్రీ కూడా అదే బాణీలో పాత్రలకి పేర్లు లేకుండా మొదటి గొంతుక, రెండవ గొంతుక, మూడవ గొంతుక - అని అంటారు.

"Under Milkwood' లో Dylan Thomas 'Evans the Death' అనే పాత్రతో "Where is your dignity Lie down" అనిపిస్తాడు[76]. 'విదూషకుడి ఆత్మహత్య'లో శ్రీ శ్రీ 'ప్రయోక్త'చేత - "వేళాకోళాల వేళ దాటిపోయింది. మరణం సమక్షంలో వినయం అవసరం" - అని అనిపిస్తారు[77].

"మానవునిలో ఉండే గుణాలను పాత్రలను చేయడం ప్రయోగం" అని అన్నారు రావూరి భారద్వాజ[78]. ఈ గుణాలను పాత్రలుగా ప్రవేశపెట్టడం 'ప్రబోధ చంద్రోదయము'లో

కూడా కనిపిస్తుంది[79]. కానీ శ్రీ శ్రీ ప్రవేశపెట్టిన 'ఆశ', 'భయం' అనే పాత్రలమీద Louis Macniece ప్రభావాన్ని గమనించవచ్చు. 'Christopher Columbus' అనే నాటకంలో 'Faith', 'Doubt' అనే రెండు పాత్రలు సరిగ్గా 'గుమస్తాకల' లోని 'ఆశ' 'భయం'లాగే ఉంటాయి. 'ఆశ'ది ఆశావాదం. 'భయం'కి ప్రతిదానికీ భయమే[80].

'మరోప్రపంచం'లో కూడా నెత్తురు మండే యువకులను ఒకవైపు, వయసుమళ్ళిన ఎముకలు కుళ్ళిన వృద్ధులను ఒకవైపు పెట్టి శ్రీ శ్రీ తన భావాలను అభివ్యక్తీకరించేందుకు ఈ నాటక ప్రభావం అధికంగా దోహదం చేసిందనిపిస్తుంది. శ్రీ శ్రీ నాటికల్లో యువకకంఠాలు 'Christopher Columbus' లోని 'Faith Chorus' లాగా ఆశావాదంతో, భవిష్యత్తుమీద ప్రగాఢ విశ్వాసంతో ముందుకురుకుతూ ఉంటాయి. వృద్ధకంఠాలు 'Doubt Chorus'లాగా- 'అంతాకల, వట్టిభ్రమ' - అంటూ తిరోగమిస్తుంటాయి[81]. 'Christopher Columbus' లోని పాత్రల సంభాషణలను గమనిస్తే ఈ వాస్తవం నిర్ధారితమౌతుంది.

1. "Faith - Yes, but it can be done, it can be done
wisemen have proved the world is round

Doubt - No, it cannot be done, it cannot be done
Here on the shore of the final sea
our windows open on Unreality[82]."

2. "Faith Chorus - West of Europe lies a world
Never heard of, never seen,
- - - - - - - - - - - - - - - - - - - - - - - - - -
soon shall reach a new demesne,
- - - - - - - - - - - - - - - - - -
when we cross the western sea,
All those things shall be shall be.

Doubt chorus - West of Europe all is dark
Water and Uncertainty ;
- - - - - - - - - - - - - - - - - - - - - - - -
All who try shall fail, shall fail[83].

'శిరస్సు చెప్పిన రహస్యం', 'చెప్పని సందేశం', 'మరోప్రపంచం'- నాటికల్లో తన కవితలనే సందర్భానుసారంగా చొప్పిస్తుంటారు శ్రీ శ్రీ. ఈ సంవిధాన చమత్కృతి T.S.Eliotలో కనిపిస్తుంది[84]. "విదూషకుడి ఆత్మహత్య"లో ఆయా సందర్భాలకు అతికేటట్లుగా శ్రీ శ్రీ గేయాలతో కోరస్ బృందగానాన్ని ప్రవేశపెట్టి రంగస్థల నాటికగా మలచారు ఆయన మిత్రులైన అబ్బూరి గోపాలకృష్ణ[85]. తన కవితలను వాడుకోవడమే గాక తనకి అభిమాన పాత్రుడైన పోతనామాత్యుని భాగవతంలోని పద్యాలను యధాతధంగా వాడుకున్నారు శ్రీ శ్రీ. ఇది కూడా శ్రీ శ్రీ చేసిన వినూత్న ప్రయోగమే.

కావ్యాల, శ్రవ్యనాటికల టెక్నిక్స్‌నేగాక సినిమాల్లో టెక్నిక్కుల్ని కూడా సందర్భోచితంగా ఉపయోగిస్తారు శ్రీ శ్రీ. చార్లీచాప్లిన్ సినిమాల్లో కనిపించే హాస్య

విషాదాల సమ్మేళనం (దీనికి 'రసన' అని పేరు పెట్టారు శ్రీ శ్రీ) 'విదూషకుడి ఆత్మహత్య', 'గుమస్తాకల' నాటికల్లో కూడా కనిపిస్తుంది. 'Flash Back Technique' (పాత్ర మనసు అకస్మాత్తుగా గతంలోకి వెళుతుంది) 'ఒంటరిబావి'లో గమనించవచ్చు[86]. 'గుమస్తాకల'లో వాస్తవిక స్వాప్నికలోకాలను 'Mixing Shots Technique' కి అనుగుణంగా మలిచారు. ఈ నాటికలోనే 'Close up shots technique' (పాత్ర మనస్సంచారాన్ని చిత్రించడం)నీ,'Montage Shots technique[88] (విరుద్ధమైన రెండు అంశాలను పక్కపక్కనే ప్రదర్శించడం)నీ దర్శించవచ్చు. 'Fade out, Fade in Techniques[89]'(ఒకశబ్దం అంతమై ఒక శబ్దం వినబడడం)ని గవేషణలో ప్రయోగించారు శ్రీ శ్రీ.

T.S. Eliot "Four Quartets[90]"లో వస్తువు మానవుని ఆంతరంగిక శోధన. ఒకేచోట అందమైన దాన్నీ - వికృతమైన దాన్నీ, ఉదాత్తమైన భావాన్నీ - చౌకబారు మాటల్నీ, అతిగా ఆవేశం వచ్చే సమయం - పక్కనే ఏదో సాధారణ విషయాన్ని చెప్పడం - వంటి లక్షణాలు ఆ రచనల్లో కనిపిస్తాయి. ఇవే లక్షణాలను శ్రీ శ్రీ 'గుమస్తాకల'లో కూడా చూడవచ్చు.

'ఒంటరిబావి', 'భూతల కొలిమి' ఈ రెండు నాటికలలో 5, 5 మాత్రల ఛందస్సువేసి ఒక విధమైన లయనూ, తూగునూ సాధించారు. ఆ రకంగా చేయడంవల్ల జానపద వాతావరణాన్ని సృష్టించారు. 'ఒంటరిబావి'లో మూడు కథనకంఠాలు నాటిక నడిపిస్తాయి. మధ్యలో ఫ్లాష్‌బాక్ పద్ధతిలో వినిపించిన ఆడ, మగ గొంతుల్ని మినహాయిస్తే నాటిక ఆధునికంగా 'తందానతాన' అనే వంతలేకుండా బుర్రకథ చెప్పినట్లుంటుంది. 'ఒంటరిబావి'లో బావి కదలదు. కదలని పాత్ర గురించి, దాని భయంకరత్వం స్ఫురించేలా కథన కంఠాలు కథ చెప్తాయి. ఇదొక ప్రయోగం. 'భూతాల కొలిమి'లో పరిగెత్తుతున్న పాత్రద్వారా నాటకాన్ని పరుగుపెట్టించడం మరొక ప్రయోగం. శ్రోతకి కదుల్తూ, కదుల్తూ చెప్తున్న అనుభూతిని కలిగించడానికి రైలు శబ్దపులయను ఉపయోగించారని భావించవచ్చు[91].

## శ్రీ శ్రీ రేడియో నాటికలు – వైఫల్యాలు

శ్రీ శ్రీ రేడియో నాటికలు రాసేనాటికి ఆంధ్రదేశంలో ఆధునికత అప్పుడప్పుడే వికసిస్తున్న కాలం. శ్రీ శ్రీ తాను చదివిన దేశ, విదేశాల ప్రయోగవాద రచనల్ని ఎప్పటి కప్పుడు తెలుగు ప్రజలకు పరిచయం చెయ్యాలనే ఉత్సాహంతో రేడియో నాటికల్లో ప్రయోగాలు చేశారు. ఆ కారణం వల్లే ఆయన రచించిన నాటికలు మేధావులైన శ్రోతల మస్తిష్కాలకు పదును పెట్టేవిగా తయారయ్యాయి. రేడియో నాటిక చదివి ఆనందించేది కాదు. లోతుగా తరచి చూస్తే తప్ప అవగతం కాని సంగతులూ, అందాలూ ఆయన రచించిన నాటికల్లో కనిపిస్తాయి. సామాన్య ప్రజలు ఒకసారి విన్నంతనే పట్టుకోలేని గొప్ప లక్షణాలు ఉన్నాయి ఆయన నాటికల్లో. సామాన్య శ్రోత దృష్టి కోణంలోంచి పరికిస్తే రేడియో నాటక రచయితగా శ్రీ శ్రీ ఎదుర్కొన్న వైఫల్యాలు గుర్తించేవీలుంది.

రేడియో నాటికల్లో కథ ప్రధానం. అది అందరికీ తేలిగ్గా అర్థమవ్వాలి. కానీ

'చతురస్రం', 'మరో ప్రపంచం' వంటి నాటికల్లో కథ అంత తేలిగ్గా కొరుకుడు పడదు. కథాకాలం ఇదమిత్థంగా శ్రోతకి తెలియాలి. భవిష్యత్తు, వర్తమానం, భూతకాలం కలగలిసిపోయి కంగారు పెట్టకూడదు. శ్రీ శ్రీ నాటికల్లో సాధారణంగా జరిగేదిదే! సంభాషణలు సామాన్యులు అర్థం చేసుకునేందుకు అనువైన ధోరణిలో సాగాలి. శ్రీ శ్రీ కొన్ని వాక్యాలతోనూ, పదాలతోనూ, అక్షరాలతోనూ సర్కస్‌ఫీట్లు చేయిస్తారు. రచయిత చెప్పదలచుకున్న అంశాన్ని సూటిగా చెప్పరు.సమాజంలో కనిపించే మనుషుల్నే పాత్రలుగా తిలకించే వీలుంటుంది గానీ మానవోద్వేగాలనూ, వివిధ వస్తువులనూ పాత్రలుగా దర్శించడం కష్టసాధ్యం. కథావస్తువు శ్రోతకి తెలిసినట్లే ఉంటుంది. కానీ తెలియదు. కథనం సూటిగా సాగక డొంక తిరుగుడుగా, ముందు వెనుకలుగా, వెనుకముందులుగా సాగుతుంది. ఇది జేమ్స్ జాయిస్ - చైతన్య స్రవంతి పద్ధతీ, ఫ్రాయిడ్ - మనోవిశ్లేషణ సిద్ధాంతాల ప్రభావాలవల్ల ఏర్పడిన ధోరణి. అలాగే కాలం విషయంలో కూడా ఐన్‌స్టీన్ - సాపేక్షతా సిద్ధాంతం వల్ల మనో విశ్లేషణ పద్ధతిలో మూడు కాలాలూ కలగలిసిపోయి కథ చెప్పే తీరువల్ల కాలానికి ఇవ్వవలసిన ప్రాధాన్యం ఇవ్వరు. Brecht alienation విధానం మాస్ మీడియాలో ఒకటైనా, రేడియో ద్వారా దేశంలో అత్యధిక సంఖ్యాకులుగా ఉన్న నిరక్షరాస్యుల కందిద్దామన్న ప్రయత్నం ఆచరణకి పనికిరాని ఆదర్శం మాత్రమే. పాత్రలతో విడివడడం వల్ల తాదాత్మ్యం చెందలేని శ్రోత ఆనందం పొందలేడు. రచయిత wave lengthని అందుకోడానికి శ్రోతపడే ప్రయాసవల్ల మస్తిష్కానికి తీవ్ర పరిశ్రమా, తత్ఫలితంగా అలసటా మిగుల్తాయి.

మేధావులైన శ్రోతలు నాటికని చివరివరకూ ఓపిగ్గా వినొచ్చు. సామాన్యశ్రోత కొద్దిగా వినగానే, బోరనిపిస్తే రేడియోకట్టేస్తాడు. శ్రీ శ్రీ సామాన్యప్రజల గురించి ఎంతగా తపించినా, వాళ్ళకి అందనంత ఎత్తునే కూర్చుని ప్రయోగం పేరిట తన గొంతుని వినిపిస్తారు. 1990కి కూడా ప్రపంచంలోగల నిరక్షరాస్యుల్లో ఎనిమిదవస్థానం ఇండియా ఆక్రమిస్తున్నప్పుడు, శ్రీ శ్రీ నాటికలు రాసే కాలానికి అంటే 1939-84మధ్య కాలాన, నిరక్షరాస్యులసంఖ్య ఎంత అధికమో మనం ఊహించవచ్చు. టి.వి.లు, వీడియోలు విజృంభిస్తున్న కాలానకూడా రేడియోని ఆదరిస్తున్న వాళ్ళెక్కువమంది గ్రామీణులే! శ్రీ శ్రీ తన శ్రోతల్లో ఆశించే Intellectual స్థాయిలో వాళ్ళేనాడూ లేరు.

గేయ నాటికలు, సంభాషణే ప్రధానంగా గల నాటికలు అనే వాటిమధ్య అంతరాన్ని చెరిపేసి, మామూలు నాటికల్లో గేయాల్నీ, కవితల్నీ చేర్చారు శ్రీ శ్రీ. అయితే ఈ పద్ధతి చేదుమందులాగా ఒకొక్కసారి శ్రోతకి మింగుడుపడదు. 'రెండుఖడ్గాలు, రెండు ఖంజరీ టాలు[92]" అని 'చతురస్రం'లో సిరికవిత మొదలుపెడతాడు. లూయీమెక్నీస్ చెప్పిన విధంగా కవితాముఖంగా శ్రోతని తీసికెళ్ళవలసి ఉన్నా, ఆకవిత అతనికి అర్థం కాని పదాలతో మరో ప్రపంచానికి సంబంధించినదిగా ఉండకూడదు. కాని శ్రీ శ్రీ "ఆరుద్రాభిషేకాలూ, హనుమచ్ఛాస్త్రాలూ[93]" అంటూ తన మనోప్రపంచంలో మెదిలే కపిసింహాలనీ, సింహకిశోరాలనీ చూపి బెదరగొడతారు.

శ్రీ శ్రీ నాటికల్లో భాష విషయానికొస్తే పాత్రోచిత భాషలేదు. ఎక్కువగా శ్రీ శ్రీ భాషే ఉంది. అది శ్రోతకీ, రచయితకీ మధ్య ఒక అగాధాన్ని సృష్టించింది. అనవసరపు ఆవృతాలున్నాయి. ఉదాహరణకి

"నా హృదయం వయస్సు ముప్పైయేళ్ళు
నా మనస్సు వయస్సు ముప్పైయ్యేళ్ళు[94]"

కవితావేశానికి లోనైపదాల వెంట పడతారు. ఉదాహరణకి

"సిరి : సిరి – ఆసిరీ– ఆ సంగతి అలావిసిరీ[95]" లయ కోసమో, తూగుకోసమో పదాలు వాడడం శ్రీ శ్రీ కలవాటు. ఉదాహరణకి

"ప్రేమ–ప్రేమ–ప్రేమ
కళ : మామా–మామా–మామా–
సిరి : కళా–కళా–కళా–
ఎందుకొచ్చావిలా[96]?

"ప్రయోక్త : మన్మధుడికి ఎన్ని పేర్లో తెలుసునా?
ఆటంకం : మన్మధుడిది మనలోకంకాదు.
ప్ర : తెలుగుకి పర్యాయ పదాలు తెలుసా??
ఆ : అది భాష నేను మాట్లాడేది మనుష్యుల సంగతి
ప్ర : కొండడూ, కరుణాకరుడూ, పురుషోత్తముడూ తెలుసా[97]?"

–చదివేటప్పుడు అర్థంగాకపోతే కాస్త ఆపి, ఆలోచించి, ముందుకి సాగవచ్చు. కానీ రేడియో నాటికలో ఆ అవకాశం ఉండదు. 'కొండడూ, కరుణాకరుడూ, పురుషోత్తముడూ' ఇలా వరసగా పరస్పర సంబంధంలేని పేర్లు వినపడుతుంటే శ్రోతకు ఆలోచించే ఆస్కారముండదు. పైగా తర్వాత డైలాగ్ వచ్చేసి అతన్ని అయోమయంలో పడేస్తుంది.

రచనకే పరిమితమైన 'కొసమెరుపు' వంటివి నాటికలో కూడా తీసుకురావడం వల్ల, ఏ కారణం వల్లనైనా నాటిక చివర ఓ క్షణం వినలేకపోయినా, సరిగ్గా ఫాలో కాలేక పోయినా నాటిక తన ప్రయోజనాన్ని పూర్తిగా నెరవేర్చలేక పోతుంది. ఉదాహరణకి 'గవేషణ'లో శిశువు రోదన ధ్వని. రేడియోస్టేషన్‌లో అంతరాయం వచ్చినా, శ్రోతనెవరైనా ఆటంకపరచినా శ్రోత రచయిత 'కొసమెరుపు'ని పట్టుకోలేడు.

–ఇంతవరకూ నేను శ్రోతవైపు నుంచి ఆలోచిస్తూ నాటికల వైఫల్యానికి కారణాలు వివరించాను. నిజానికి రచయిత ప్రయోగవాదపు స్ఫూర్తిని లోతుగా విశ్లేషించినపుడు De-Meritsగాతోచే ఈ అవరోధాలే Meritsగా పరిణమించే అవకాశముంది. ప్రయోగవాదం రేడియోలో విజయవంతమైనట్లు రంగస్థలం మీద కాలేదు. శ్రీ శ్రీ రేడియో నాటికలు రాసే కాలానికి రేడియో అన్న శ్రవణసాధనం అంతగా ప్రాచుర్యం పొందలేదు. అతి తక్కువమంది ఇళ్ళల్లో అంటే ఏ ధనవంతుల ఇళ్ళల్లోనో మాత్రమే రేడియోలుండేవి. డ్రామా డైరెక్టరైనప్పటికీ, ఆ రోజుల్లో వారింట్లో రేడియో లేదనీ, తాను రేడియోస్టేషన్‌లోనే వినేవాడిననీ రజనీ కాంతరావుగారు చెప్పారు[98] రేడియోలో ప్రయోగాలు జరుగుతున్న

కాలంలో తీవ్రమైన ఆర్థికసంక్షోభం మనదేశాన్ని ఆవహించింది. విద్యాధికులు నిరుద్యోగులై ఉదరపోషణార్థం దేశమంతా తిరుగుతుండేవారు. శ్రీ శ్రీ, కొడవటిగంటి కుటుంబరావు మొదలైనవారు చిన్నచిన్న ఉద్యోగాలు చేస్తూండేవారు[99]. ఆనాటి వాతావరణం నిరాశాజనకంగా ఉండేది. ప్రపంచ పరిస్థితి కూడా ఇంచుమించు ఇలాగే ఉంది. ఆధునిక జీవితంలో సంక్లిష్టత మొదలయింది. నగర జీవితం, ఆధునిక సౌకర్యాలు, వాటితో మూకీ, టాకీ- ఒక్కటొక్కటిగా వచ్చాయి. ఆ సందర్భంలో రేడియో ఒక వార్తా ప్రసార సాధనంగానే కాక, విజ్ఞాన వినోద ప్రసారానిక్కూడా ఉపయోగపడింది. సహజంగా అప్పటికి యూరప్ అంతటా వ్యాపించిన ఉద్యమాల ప్రభావం ముందు చిత్రకళమీదా, తర్వాత నాటక ప్రదర్శనమీదా పడింది. రేడియో ప్రభావం ఆయా కళా ఉద్యమాల ఛాయలో ప్రతిధ్వనించక తప్పలేదు. అలాగే దేశ దేశాల్లోని కళా కారులు, పేరొందిన కవులు రేడియోలో తమ గొంతు వినిపించారు. తాత్త్వికంగా సోషలిజాన్ని గాఢంగా నమ్మిన శ్రీ శ్రీ రేడియోలాంటి ప్రభుత్వ ప్రసార రంగంలో చేసిన ప్రయోగాలు ఆసక్తికరంగా ఉంటాయి. కానీ ఆ కాలంలో మన దేశంలో సాంకేతిక ప్రావీణ్యంలేదు. Modulationని సరిచూసుకునేందుకు గానీ, మెరుగుపరిచేటందుకు అవసరమైన పరికరాలుగానీ లేవు. Voice filtration ఉండేదికాదు[100].

శ్రీ శ్రీకి ఈ విషయాలన్నీ బాగా తెలుసు. అయినా విదేశాల్లో రేడియో నాటికలద్వారా రచయితలు సాధించిన విజయాలు అతన్ని ఆకర్షించి, ఆ తరహాకి చెందిన గొప్ప రచనలు సృజించేలా చేశాయి. శ్రీ శ్రీ నాటికలు రేడియోలో అంతగా విజయం సాధించలేకపోతే, అందులో కొంతభాగం సాంకేతికాభివృద్ధి అంతగాలేని ఆ కాలం (ఈకాలం కూడా) కారణమవుతుంది. లూయీమెక్నీస్ తన పీఠికలో చెప్పిన అంశాలు ఆనాటికే ఎంతగానో సాంకేతికంగా ముందుకి వెళ్ళిన దేశాలను దృష్టిలో పెట్టుకొని చెప్పాడన్న సంగతిని మనం గమనించాలి. అలాగే N.R. చందూర్, ఇంద్రగంటి శ్రీకాంతశర్మ, అమరేంద్ర, గొల్లపూడి మారుతీరావు, ఆత్రేయ ప్రభృతులు చెప్పిన లక్షణాలు, అందించిన వివరాలు అభివృద్ధిచెందిన కాలానికి సంబంధించినవి. శ్రీ శ్రీ తన నాటికలను ఆరంభదశలో రాసినప్పటికీ ఆ లక్షణాలుండడం గమనార్హం.

అంతర్జాతీయ రచయితనూ, వారు తమ రచనలో చూపిన వైవిధ్యాన్నీ తెలుగు పాఠకుడికి తక్షణం పరిచయం చెయ్యాలనే తహతహ శ్రీ శ్రీది. అబ్బూరి గోపాలకృష్ణ గారన్నట్లు[101] శ్రీ శ్రీది. -"Theatre of Ideas[102]" ఇది మామూలు స్టేజికి భిన్నంగా ఉంటుంది. - "This type of play with its background in mythology, religion and philosophy is not entertainment in the usual sense of diversion, escape and relaxation. Each one Presents an ordeal, a drama on the condition of life[103]."

"ఇదీ మన ప్రపంచం"- అని సమాజపరిస్థితుల్ని మన కళ్ళకి కట్టించడానికి శ్రీ శ్రీ ఈ ప్రయోగాలు చేశారు. ధనస్వామిని రక్షించడానికి న్యాయవాదుల శక్తియుక్తులూ, రాజకీయ వాదుల నక్కజిత్తులూ, విజ్ఞానవేత్తల తెలివితేటలూ అన్ని వేళలా పారాయిస్తాయి[104]. ప్రజలలో నిస్పృహ పెరిగే కొద్దీ జీవితం మీద విరక్తితో పెళ్ళాం పిల్లల్ని తిట్టి, కొడతాడు. రోజూ ఒకే అభినయం చేసే, ట్రాఫిక్ పోలీసు లాంటి వాళ్ళు ఒంటరిగా విషంతాగేస్తారు.

మనుష్యులకు మతులు పోతాయి[105]. ఇలా మనం సంఘం గురించి చెప్తూ- విప్లవ పద్ధతులో తర్ఫీదిచ్చే విద్యాలయాలు లేవనీ, విద్యార్థులు పాసుమార్కులనే పరిమాణంగా ఎంచుతున్నారనీ, మధ్యతరగతిలో ఇరుక్కుపోయిన అధ్యాపకులు నిన్నటి అబద్ధాలనే ఈ కాలానికి పనికిరావని తెలిసీ చెప్తూ - ముప్పై ఏళ్ళకే ముసలివాళ్ళై పోతున్నారనీ అంటారు శ్రీ శ్రీ[106]. ఈ పరిస్థితుల్లో కవి చెయ్యాల్సినపనిని నిర్దేశించి చెప్తున్నారు శ్రీ శ్రీ. కవులు స్తంభించకూడదనీ, సమాజానికి అంతఃకరణలుగా పనిచేయాలనీ సామాజిక శరీరంలో బ్రహ్మరంధ్రం దాకా పర్యాప్తమయ్యే సుషుమ్నాడిగా స్పందించి రచనలు చేయాలని శ్రీ శ్రీ ఉద్దేశ్యం.

సామాన్యశ్రోతకి మూడు కాలాలు కలపడంవల్ల, కథలో వెనకముందు లుండడంవల్ల గందరగోళంగా ఉంటుంది. ఇది శ్రీ శ్రీ కావాలని చేసిన ప్రయోగమే. 'అనంతం'లో తెలుగుపాఠకుడికి ఫ్లాష్‌బ్యాక్‌లనూ, మాంటెన్‌లనూ అలవాటు చెయ్యడానికి చేశానని స్వయంగా చెప్పారు[107]. శ్రోత వెంటనే గ్రహించడానికి వీలుగా ఉండే కథల్లేవు రేడియో నాటికల్లో. అయితే "కథా వస్తువుతో - తన ఆదర్శాన్ని చొప్పిస్తూ నాటిక నడపడం మహానాటక కర్తలకే చెల్లుతుంద - అని అంటారు దివాకర్ల వెంకటావధాని[108]. కథావస్తువులతో నాటకాలను రచించడం సులభమైనపని కాదు. అది జయప్రదంగా నెరవేరిస్తే మహత్తరమైన ఆశయాలను బోధింపవచ్చు. ప్రపంచంలో మహానాటకకర్తలకే యిది చెల్లింది[109].

"Modern life which Presents complex social conditions is neglected by play-writers[110]". అని గురజాడ మాటల్ని శ్రీ శ్రీ చాలాసార్లు గుర్తు చేసుకుంటారు. "రేడియో నాటిక" - శ్రవ్యకావ్యం అన్నమాటకి చక్కగా సరిపోతుంది[111]. అన్నారు శ్రీ శ్రీ - ఈ విషయాలను గురించి ఇంకా బాగా పరిశీలించవలసి ఉంది.

డార్విన్ - పరిణామ సిద్ధాంతం, ఐన్‌స్టీన్ - సాపేక్షతా సిద్ధాంతం, ఫ్రాయిడ్ మనో విశ్లేషణ సిద్ధాంతం, చార్లీచాప్లిన్ - సినిమా టెక్నిక్ - T.S. Eliot వస్తుసంవిధానం, Dream Play- ఇలా రకరకాల ప్రభావాలతో, తెలుగు జీవితంలోని - తనదైన వస్తువుతో- ప్రయోగాలు చేశారని అర్థం చేసుకున్నప్పుడు శ్రీ శ్రీ రేడియో నాటికలు - శ్రోతలకు ముందు ముందు బాగా అర్థమౌతాయి.

శ్రీ శ్రీ మానవుణ్ణీ, మానవత్వాన్నీ అమితంగా ప్రేమించినవారు. తన భావాలను ప్రజలకు అందించడానికి "రేడియో నాటిక" అనే ప్రక్రియని ఎంచుకున్నారు. పరిసరాలతో మానవాత్మపడే సంఘర్షణలని చిత్రించారు. బాహిర సమరంకాక అంతరంగ మథనాన్ని వెలికి తీశారు. మానవుడి వెలుగు-చీకటి కోణాలనూ, జీవిత వైవిధ్యాలనూ, బలహీనతలనూ - అన్నిటినీ బహిర్గతం చేయడానికి తగిన పాత్రలనీ, సన్నివేశ చిత్రణనీ కల్పించారు. శ్రీ శ్రీ మనిషి పురోగతికోసం, సమసమాజ స్థాపనకోసం ఇచ్చే సూచనలన్నీ సూటిగా ఇస్తారని అందరి అభిప్రాయం. అంతేగాకుండా జీవితాలకి సంబంధించిన మూల విలువలు, సృష్టి కాలం, దైవం, మృత్యువు కలలు - వీటన్నిటి గురించి విపరీతంగా ఆలోచిస్తారని ఈ నాటికల వల్ల విదితమవుతుంది.

# పాదసూచికలు

## అధ్యాయం ఒకటి :

## ప్రయోగవాద పరిచయం – రేడియో నాటిక

1. యూరప్‌లో సాంస్కృతిక పునరుజ్జీవన కాలంలో కళాకారులు, సైన్స్‌లో శాస్త్ర వేత్తల్లాగా సాహిత్యంలో కొత్త ధోరణులు ప్రవేశపెట్టి సమాజం నుంచి ఎలాంటి ప్రతిస్పందన వస్తుందో చూడాలనే తపన, ఆసక్తి కలిగి ఉండేవారు. సాహిత్య ప్రయోగం సైన్స్ ప్రయోగానికి భిన్నంగా ఉంటుంది. ఈ వ్యత్యాసం మౌలికమైంది. కళాకారుడు ఏ కళలో ప్రయోగం చేసినా స్పందించే హృదయం. ఉండడం వల్ల ముందు తానెక్కువ భావోద్వేగానికి లోనవుతాడు. ఆపై ప్రయోగాన్ని జనం అంగీకరించి విజయవంతమైతే అలాంటి ప్రయోగాలు మరికొన్ని చేస్తూ ఒక 'సైద్ధాంతిక ధోరణి'కి బాటవేస్తాడు. తనదీ అనే ముద్ర పడాలని తపించే కళాకారులు కొత్త కొత్త సైద్ధాంతిక ధోరణులకు మార్గం వేయడం, వారిని మరి కొందరు అనుసరించడం జరుగుతుండేది. ఆ కాలంలో ఏ ఒక్క ధోరణీ నాలుగుకాలాల పాటు మనగలిగేది కాదు.త్వరిత గతిని కొత్త కొత్త ప్రయోగాలు జరిగి పోతుండేవి. ఈ విధంగా సాహిత్య వేత్తలు వివిధ ప్రక్రియల్లో ప్రయోగాలు చేయడమే పనిగా పెట్టుకున్న ఔత్సాహిక కళాకారుల ధోరణిని 'ప్రయోగవాదం' అంటారు.
2. సి.నారాయణరెడ్డి – ఆధునికాంధ్ర కవిత్వము, సంప్రదాయములు: ప్రయోగములు పేజి. 515–516.
3. T.S. Eliot - "Tradition and the Individual Talent"- (E) 20th Centurey Literary Criticism - p - 516.
4. సి. నారాయణరెడ్డి – ఆధునికాంధ్ర కవిత్వము
   సంప్రదాయములు : ప్రయోగములు : పే. 41 – 44.
5. Ibid.
6. ప్రొఫెసర్ సెక్వేరా – ముఖాముఖీ – 15-8-89.
7. జె.వి.రాఘవేంద్రరావు – "కాల్పనికవాదం" (వ్యా)
   సం|| కె.కె. రంగనాథాచార్యులు –
   ఆధునిక తెలుగు సాహిత్యంలో విభిన్న ధోరణులు– పే. 1.
8. ఆర్. వెంకటేశ్వరరావు – "సాహిత్యంలో ఇజాలు" (వ్యా)
   సాహిత్యదర్శిని – పే. 127.

